

కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు - గుంటూరు శేషేంద్ర శర్మ గారు



విశ్వనాథపీఠ ప్రథమ సర్వసభ్యసమావేశం

# జయంతి

త్రైమాసిక సాహిత్య పత్రిక

(సెప్టెంబర్ 2003 - ఫిబ్రవరి 2004 1&2)




**SISTER NIVEDITA FOUNDATION**

11-4-654/3, Red Hills, Lakdi-ka-pul, Hyderabad - 500 004.

Ph . 23396358 / 23305134

# JAYANTHI

A Telugu Quarterly
Devoted to Telugu Literature and Culture

| | | |
|---|---|---|
| వెల : | ప్రారంభ సంచిక | : రూ. 100/- |
| | జీవిత సభ్యత్వం | : రూ. 1,000/- (ప్రారంభ సంచికతో పాటు) |
| | పోషక సభ్యత్వం | : రూ. 2,000/- (ప్రారంభ సంచికతో పాటు) |
| | విడి పత్రిక | : రూ. 50/- |
| ప్రకటనలు | రెండవ కవరు | : రూ. 3,000/- |
| | మూడవ కవరు | : రూ. 2,000/- |
| | లోపలి పూర్తి పుట | : రూ. 1,000/- |

For Copies

**SISTER NIVEDITA FOUNDATION**
11-4-654/3, Red Hills, Lakdi-ka-pul, Hyderabad - 500 004
Ph : 23396358 / 23305134

**M/s. VISALANDHRA BOOK HOUSE**
4-1-435, Bank Street, Hyderabad - 500 001
and all its Branches in A.P.

Printed at

**PARTHASARATHI PRINTERS**
Nallakunta, Hyderabad
Phone · 55108206 / 56608206

# అంకితం

ఎన్ని కాయ క్లేశ కష్టాలొచ్చినా

అంకిత భావంతో తెలుగు సాహిత్య సారస్వత ప్రచురణారంగంలో

ఎన్నో సవాళ్ళను ఎప్పటికప్పుడు ఎదుర్కొంటూ కూడా

ముందు చూపుతో ముందంజ వేస్తోన్న

Vishalandhra Book House

Deputy General Manager

Sri P. **రాజేశ్వర రావు గారికి**

అభినందనలతో

# విషయసూచిక

**P.S.Ramamohan Rao**
Governor, Tamilnadu.

శ్రీ **వెలిచాల కొండలరావు** గారికి,

విశ్వనాథ సాహిత్యపీఠం అనే సాహిత్య-సాంస్కృతిక సంస్థను స్థాపించారని తెలుసి చాల సంతోషంగా ఉంది. సంస్థ ముఖ్యోద్దేశ్యాలలో ఒకటైన "జయంతి" త్రైమాసి పత్రికను విశ్వనాథ జన్మదినోత్సవ సందర్భంగా ప్రారంభించడం ముదావహం.

ఈ సందర్భంగా, యాదృచ్ఛికమై అయినా ఒక యదార్థవిషయం. శ్రీవిశ్వనాథవా ఒకే ఊరివాళ్ళం. దానికి పైన, విజయవాడ S.S.R & C.V.R కళాశాలలో అధ్యాపకులుగా, విశ్వనాథవారు నాకు గురువు, మాతండ్రిగారికి సమకాలీనుల ఆయన స్మృత్యర్థం ఒక త్రైమాసిక సాహిత్య పత్రికను ప్రారంభించడం విశ్వనాథ తెలుగు సాహిత్య ప్రపంచానికి సేవ చేసినట్లవుతుంది.

ఈ సందర్భంగా మీకు మా అండదండలు ఎల్లప్పుడూ ఉంటాయని తెలియజేస

మీ

**పి.ఎస్.రామమోహన**

**డాక్టర్ సి.నారాయణ రెడ్డి**, ఎం.పి.

అధ్యక్షులు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి.

మిత్రులు డా.కొండలరావు గారికి,

నమస్కారాలు. విశ్వనాథ సత్యనారాయణగారిది ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో విరాడ్రూపం. ఆయన స్పృశించని సాహిత్య ప్రక్రియ లేదు. చేపట్టిన ప్రతి ప్రక్రియలో అంచులు ముట్టిన వరిష్ఠ ప్రతిభామూర్తులు వారు.

విశ్వనాథవారి పేర ఒక సాహిత్య పీఠం, ఒక సాంస్కృతిక విశ్వవిద్యాలయం నెలకొల్పుతున్న మీ కృషి అభినందనీయం.

గుడివాడలో జరిగిన ఆయన షష్టిపూర్తి సభలో నేను రాసి వినిపించిన కవితలోని రెండు పంక్తులు ఉదాహరిసునాను.

"అతనికీనాడు షష్ట్యబ్దములు నిండెనట
అతనికి తల వెండిమలయ్యై వెల్గుచుండెనిట"

నెరిసిన జుత్తులోనే కాదు, మెరిసిన కవితాత్మక విద్వత్తులోనూ విశ్వనాథవారు కైలాసగిరిలాంటివారే. వారు కొంతకాలం నిర్వహించిన 'జయంతి' సాహిత్య పత్రిక మిత్రులు జువ్వాడి గౌతమరావుగారి ప్రధాన సంపాదకత్వంలో పునః ప్రారంభిస్తున్నందుకు నాకు సంతోషంగా వుంది.

మీ

**డా.సి.నారాయణరెడ్డి**

**Dr. Arun Nigavekar**
Chairman
U.G.C

Dear Dr.Rao.

I am very happy to know that Telugu Literary Quarterly "Jayanthi" i be released on the occasion of the inauguration of the Viswanatha Sah Peetham. Your organization has a name of the very illustrious scholar writer in Telugu, late Kavisamrat Viswanatha Satyanarayana His contri tions in Telugu are very well known and they have been translated in m Indian languages It is a fitting tribute to Jnanpith Award winner from State of Andhra Pradesh. I send my greetings on the occasion.

with best wishes,

Yours sincerely,
**Arun Nigavekar.**

Prof. K.Satchidanandan
Secretary
Sahitya Akademi

Dear Dr.V.Kondal Rao,

I am very pleased to know that a literary and cultural organization calle Viswanatha Sahitya Peetham has been established to celebrate the memory Kavisamrat Viswanatha Satyanarayana, great scholar and writer and the fir Jnanpith Award winner in Telugu. I am also happy to know that a Telugu litera quarterly titled Jayanthi is being released on the occasion of the Inaugurati of the Peetham. Viswanatha Satyanarayana was undoubtedly one of the fine writers who contributed to the growth of Indian literature through his mo than 100 works in Telugu, Sanskrit and English He was a supporter ar sustainer of traditional values in life and literature, universally revered for h creative imagination, classical scholarship and courage of conviction. His wo stands like a bridge between one passing age and another that was being bor He was a true champion of aesthetic transition in Telugu literature. His novel plays and poems alike reflect the originality of his imagination and his respe for the high standards set by Indian poetics for sublime literature. I am su that Jayanthi will reflect these great values for which Viswanatha had sto and fought. I wish the journal and the organization all success.

with warm regards.

Yours Sincerel
K.Satchidananda

# సంపాదకీయం

'జయంతి' సాహిత్య మాస పత్రిక కిది మూడవ ఆరంభం. విశ్వనాథ సత్యనారాయణగారు కోలవెన్ను రామ కోటీశ్వర రావు గారి త్రివేణి ఆంగ్ల పత్రికకు జోడుగా దీనిని 1927లో ఆరంభించారు. 'జయంతి' రెండు నెలల పత్రికగా ఒక సంవత్సరం పాటు సాగి ఆగిపోయింది. మళ్ళీ 1958లో దాదాపు ముప్పయేళ్ల తరువాత సత్యనారాయణగారు గౌరవ సంపాదకులుగా జువ్వాడి గౌతమ రావుగారి సంపాదకత్వంలో రెండవసారి మొదలయింది. ఇది మాసపత్రిక. ఇది కూడా ఇరవై నెలలు మాత్రమే సాగింది. జయంతి వంటి సాహిత్య పత్రికలు ఏకధాటిగా ఎక్కువ కాలం సాగటం ఆనవాయితీ కాదేమో ననేది సాహిత్య పత్రికల చరిత్ర మనకొక పాఠం నేర్పుతున్నదని పిస్తుంది. సాధారణంగా సాహిత్య పత్రికలు సాహిత్యానికి సంబంధించి కొందరు వ్యక్తుల తపన నుంచి మొదలవుతాయి తప్ప, ఆర్థికంగానో మరో విధంగానో లాభపడటానికి కాదు. సాహిత్య పత్రికలకు పెట్టుబడులుండవు. వ్యాపారసంస్థల వత్తాసులుండవు. అందుకని ఏ సంచిక కాసంచిక వెలువడటమే ఒక గొప్ప. ఒక వైపు ఆర్థికమయిన వనరుల కోసం, మరో వైపు ఉత్తమ రచనల సేకరణ కోసం పాట్లు ప్రతి సారీ ఉండనే ఉంటాయి. సాహిత్య పత్రికలకు ప్రకటనలుండవు. చందాదారుల సంఖ్య చాలా తక్కువ. వారుగూడా చందా వరుసగా పంపటం మరీ తక్కువ. అయితే, ఇన్ని ఇరకాటాల్లోనూ ఎంతకాలం సాగిందని కాక, అది సాగిన కాలంలో సాహిత్య రంగాన్ని ఎంత ప్రభావితం చేసింది, ఎంత చైతన్య వంతం చేసింది అన్న దృష్టితో చూస్తే తొలి జయంతి నాటి సంచలనం మాకు తెలియదు గాని, మేము నేరుగా అన్వయించిన రెండవ సారి జయంతి మాత్రం ఉత్తమ సాహిత్యాన్ని అందించటమే కాక అనేక సాహిత్యాంశాలకు సంబంధించిన చర్చలలో క్రొత్త చైతన్యాన్నీ సంచలనాన్నీ ఆ ఇరవయినెలల్లోనే ఎంతో కలిగించిందనేది ఆ నాటి సాహిత్య తరానికంతటికీ తెలిసిందే.

తొలి జయంతి సంపాదకీయం – 'ఇది వరకే తెలుగు దేశం నిండా పత్రికలు కొటాను కోట్లు వున్నవి. ఇంకా కొత్త పత్రిక లెందుకయ్యా' అనీ 'ఇది మరల నింకొక సాహిత్య పత్రికను మేమారంభించుచున్నాము. ఆరంభించవలసిన అవసరమేమి? ఇది వరకున్నవి చాలవా? యను ప్రశ్న యున్నది. చాలవని మాయభిప్రాయము. కనుకనే దీని నారంభించుట' అని మలి జయంతి తొలి సంపాదకీయం మొదలయింది. ఇదే విధమయిన ప్రశ్న ఇప్పుడూవేయ వచ్చుగాని సమాధానం మాత్రం కొంత భిన్నంగా ఉంటుంది. ఆయానాళ్లలో సాహిత్య పత్రికలు అనేకం ఉండినయిగాని ఈనాటి పరిస్థితి వేరు. ఈ నాడు అచ్చంగా 'సాహిత్య' పత్రికలనేవి కన్పించవు. సాహిత్య పత్రికలలో అంతటి గొప్ప చరిత్రతో సుదీర్ఘకాలం సాగిన 'భారతి' ఆగిపోయింది. తిరగి మొదలయ్యే ఆశ ఏకోశానా కన్పించదు. మరి, తెలుగు విశ్వవిద్యాలయం – మధ్యలో కొంత ఎడం వచ్చినా పునఃప్రారంభించిన 'వాఙ్మయి' ఒకటి కన్పిస్తున్నది. మరికొన్ని పత్రికలు లేకపోలేదు కాని, అవి అచ్చంగా సాహిత్య పత్రికలు కావు. వివిధ పార్టీలు తమతమ సిద్ధాంతాలకూ, విధానాలకూ పరిమితమయి 'సాహిత్య స్వేచ్ఛ' రెక్కలు విరిచే విధంగా నిర్వహించేవే తప్ప సాహిత్యానికి అంకితమయిన పత్రికలు కన్పించవు. మరి దిన పత్రికలలో వార పత్రికలలో ఏదో ఒకరోజు ఒకటి రెండు పేజీలు సాహిత్యానికి కేటాయించటం ఉంది. కొన్ని పత్రికలు 'సాహిత్యం ఎంతమంది చదువుతారు? దాని వల్ల ఎవరికి ప్రయోజనం?' అన్న వ్యాపారాత్మకమయిన లెక్కలు వేసుకొని తమ పత్రికల్లో సాహిత్యాన్ని నిషేధించటం గూడా తెలిసిందే. కేటాయించిన పత్రికల్లోనూ స్ప జనాత్మక సాహిత్యానికీ, గాఢమయిన సాహిత్య విమర్శకూ అవకాశం కన్పించదు. ఏదో విధమయిన 'వాద–వివాద–ప్రతివాదాలను' రెచ్చగొట్టి అర్థరహితమయిన, అనారోగ్యకరమయిన సంచలనం కల్గించటం వైపే మొగ్గుతున్నట్టూ కన్పిస్తుంది.

ఈనాడు సాహిత్యరంగం అస్తవ్యస్తంగా అవ్యవస్థితంగా ఉన్నదనేది దాచేస్తే దాగని సత్యం. ఈనాడు సాహిత్యం ఏ రాజకీయ సిద్ధాంతానికో, పక్షానికో, కుల–మత–వర్గాలకో, వివిధ 'వాదా'లకో, ప్రాంతాలకో అనుబంధంగా, ఒక ప్రచార సాధనంగానో సాగుతున్నది గాని, తన స్వంత వ్యక్తిత్వంతో తానుగా పురోగమించేతీరు కానరావటం లేదు. వాదాల, ఉద్యమాల 'సాహిత్య'మే తప్ప సాహిత్యవాదాలు, ఉద్యమాలు కన్పించవు. ఈ స్థితిలో 'సాహిత్యా'న్ని పరిరక్షించుకోవలసిన అవసరాన్ని సాహిత్యం కోసం తపన పడే వారందరూ గుర్తిస్తున్నారు. ఈ గుర్తింపుతోనే మరల 'జయంతి' ని మూడవసారిగా ప్రారంభిస్తున్నాము.

సాహిత్యం, ద్వేషాలనూ రోషాలనూ పక్షపాతాలనూ రెచ్చగొట్టటానికి కాదు, రాజకీయార్థికాది విషయాలను ప్రచారం చేయటానికీ కాదు. మానవీయ సంబంధాల్లో ఆరోగ్యకరమయిన సమన్వయాన్నీ ప్రేమాభిమానాలను పెంచుతూ, దేశీయతా భూమిక మీద ఆరోగ్యవంతమయిన ఆలోచనా విధానాన్ని పెంపొందించటానికి సంబంధించింది సాహిత్యం. ఆలోచనా విధానానికి శాస్త్రం - సాహిత్యం రెండు పక్షాలు. సమాజంలోని అన్నిస్తరాలలోకి చొచ్చుకు పోగలిగింది సాహిత్యం. ఆయాస్తరాలకు అనుకూలమయిన రీతిలో, లందుబాటులోకి వచ్చే రీతులలో సాహిత్యం ప్రవర్తిస్తుంది. ఈ రీతులలో ఏది ఉత్తమ మయిందనే ప్రశ్నకు అవకాశంలేదు. అన్ని రీతులూ ఆహ్వానించవలసినవే. కొన్నేళ్లుగా తెలుగు పద్యానికి వ్యతిరేకంగా తీవ్ర ప్రచారం ప్రణాళికా బద్ధంగా సాగుతూండటం తెలిసిందే. అయినా పద్యం ఆగిపోలేదు. పద్యానికి భూస్వామ్యవ్యవస్థ వంటి వ్యవస్థలతో ముడి పెట్టి నిరసించటం జరిగింది గాని, నవల బూర్జువావ్యవస్థతో ముడిపెట్టబడలేదు. ఇట్లాంటివి కేవలం రకరకాల భ్రాంతులు, అపోహల కారణంగా, ఇంకా కచ్చితంగా చెప్పితే, రాజకీయ కారణాల వల్ల ప్రచారం చేయబడినవే తప్ప యధార్థమయిన ఆలోచన వీటి వెనుక లేవనేది క్రమంగా తేట పడుతున్న సత్యం.

సాహిత్యం అనేక ప్రక్రియల సమాహారం. ఏ ప్రకియగూడా నిరాకరింపదగ్గింది గానీ నిరసింపదగిందిగానీ కాదు. నిజానికి ఏ ప్రక్రియ అయినా దాని దాని స్వరూప స్వభావాలూ, పరిధులూ, పరిమితులూ ఒకే విధంగా ఉండవు. భిన్నభిన్నంగా ఉంటయి. వాటికి సంబంధించిన శిల్పరీతులూ భిన్నభిన్నంగా ఉంటయి, ప్రయోజనాలూ భిన్నభిన్నంగా ఉంటయి. వీటికి సంబంధించిన వివేకం కవికి/రచయితకూ ఉండాలి. పాఠకునికీ ఉండాలి. అంతకు మించి విమర్శకునికి ఉండాలి. విమర్శ రాగద్వేష భూమికల మీదగాక, కావ్యతత్త్వ ప్రకాశకంగా సాగాలి. నిజానికి ఏ ప్రక్రియ కూడా కవి/రచయిత యొక్క ప్రతిభ మీద ఆధారపడి ఉద్దీప్తమవుతుంది తప్ప, అది ఆ ప్రక్రియ కాబట్టి ఉద్దీప్తం లేదా అనుద్దీప్తం కాదు. కవి ప్రతిభమీద, ఉద్దేశించిన పాఠకసమాజం, ఆశించిన ప్రయోజనం వంటివాటి మీద ఆధారపడి ఉంటుంది. భాషా ప్రయోగం కూడా ఈ విధమయిందే.

గ్రాంధిక, వ్యావహారిక భాషావాదాలు సాహిత్యంలో అనవసరమయిన, అవగాహనారహితమయిన కల్లోలం సృష్టించినాయి. అవి కలిగించిన లాభం ఎంతదనేది అట్లా ఉంచి, అది కలిగించిన నష్టం మాత్రం గొప్పది. ప్రాచీనమయిన సాహిత్యానికి సంబంధించి విపరీతమయిన వైముఖ్యం నైరస్యం పెంపొందించాయి. ఇప్పటికీ ఆ గోతిలోంచి మనం బయట పడలేకపోతున్నాం. ఆ వాదాలకు పేర్లే సరిగా కుదరలేదని మలి జయంతి నాటి నుంచీ మేము చెప్పుతూనే ఉన్నాము. ఇప్పటికి గాని భాషా విశేషజ్ఞులు అందులోని యాధార్థ్యాన్ని గుర్తించలేదు. భాష, భాషాప్రౌఢిమ, భాషా సారళ్యం, పలుకుబడి, నుడికారం వంటి అనేకానేకాంశాలు అందులో ఇమిడి ఉన్నాయి. వాటినన్నింటినీ పరిగణనంలోకి తీసుకోవలసి ఉంటుంది.

సాహిత్యంలో కవి-రచయిత దృక్పధాలతో పాఠకునికి అవసరం లేదు. కావ్యం ద్వారా వ్యక్తమయ్యే అంశాలే కావ్యానుభవానికీ, కావ్యాన్ని అంచనావేయటానికీ ఉపయోగించే అంశాలు. ఒకడు కవి లేదా అకవి, రచయిత లేదా అరచయిత కావటానికి ఆయన సృష్టించిన కవిత్వం/కావ్యం, రచన మాత్రమే ప్రమాణం. అయితే అది 'ప్రమాణం' కావటానికి సాహిత్య/కవిత్వ ప్రమాణాలు కొన్ని తప్పని సరి. కొన్ని ప్రమాణాలు సాహిత్యం కాలదేశానుగతంగా పొందే మార్పుల మీద ఆధారపడి ఉండగా, మౌలిక ప్రమాణాలు కొన్ని. ఈ ప్రమాణాలు దేశీయతా భూమిక నుంచి నిష్పన్నమయి ఉండవలసి ఉంటుంది. సంస్కృతి, నాగరికత, జీవన విధానం దేశ దేశానికీ భేదిస్తుంటాయి. సాహిత్యం ఒక దేశపు సంస్కృతి, నాగరికత, జీవన దృక్పధం/విధానం నుంచి ఉదయించేది. అందువల్ల దేశీయ ప్రమాణాలే వాటికి ఉపకరిస్తాయి తప్ప విదేశీయ విధానాలు కాదు. సాహిత్యానికి రస ధ్వనులు దేశీయమయిన ప్రమాణాలు. దేశీయ జీవితపు విలువలు మొదలయిన వెన్నో ఇందులో ఇమిడి ఉన్నాయి. కాబట్టి కావ్యం కానీ, విమర్శగానీ దేశీయమయి ఉండటం పాఠకుని యధార్థమయిన అనుభవానికి అవసరం.

కాగా ఈ మూడవసారి మొదలవుతోన్న 'జయంతి' సాహిత్యానికి సంబంధించిన అనేకానేకాంశాల విషయంగా స్పష్టమయిన దేశీయతా దృక్పధంతో - ఇంతకు ముందు వలెనే పురోగమిస్తుంది. రచనలే మాకు ప్రధానం. ఆయారచనలు కవిత్వం / సాహిత్యం కావటమే ప్రధానం. ఈ పత్రికలోని చర్చలకు గూడా ఇదే భూమిక.

స్పష్టమయిన దృక్పధంతో ముందుకు సాగటానికి 'జయంతి' చేసే గాఢమయిన ప్రయత్నానికి అటు రచయితలు, ఇటు పాఠకులు హృదయ పూర్వకంగా సహకరిస్తారని విశ్వసిస్తున్నాం.



Vishwanatha Satyanarayana with members of the family

# చతుష్షష్టి

మల్లంపల్లి శరభయ్య

యష్టి ఆలంబమ్మై తనుయష్టి ఇట్టి
లనుపదంబును పతయాళువయ్యు గూడ
నాకు నొక్కింత నీగాలి సోక, ఒడలు
జలదరించు నదేమొ, ఆషాఢ జలద!

మిన్ను మన్నేకమ్మై క్రమ్ముకొన్న మొయిలు!
కన్నువిప్పిన తొలినాడు, కన్నుమూయ
నున్న యీ తుది నేడును ఒక్కరీతి
క్రిక్కిరిసి యుంటివీ బ్రదుకెల్ల నీవె.

నీ వచో భావనానేహ నిబిడలీన
శైశవాది వయోదశా - జాగ్రదాది
సకల వృత్తి నభశ్చతుష్షష్టి తిరిగి
చేతనా మాత్రముగ మిగిల్చినది నన్ను.

<u>చిరువివరణ:</u>

ఆధునికంగా తెలుగు సాహిత్య ప్రపంచంలో అరుదయిన వ్యక్తిత్వంగల మనీషి శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు. ఆనందవర్ధనుడు చెప్పిన సహృదయ లక్షణానికి ఆయన ఒక సరయిన లక్ష్యం. ఆయన పరమభావుకుడు, కవి,విమర్శకుడు. పూర్వాధునిక కవులందరి విలక్షణత్వాలు ఆయనకు తెలిసినంతగా తెలిసినవారు చాలా అరుదు. ఎవరి ప్రమేయం లేకుండా ఆ కవులందరితోనూ మాట్లడుతూ మననం చేస్తూ ఎన్నాళ్ళయినా ఒంటరిగా కాలక్షేపం చేయగలరు. ఇన్నాళ్లుగా ఆయన చేస్తున్న పనే అది. అందుకే విశ్వనాథ సాహిత్యకుటుంబానికంతటికీ ఆయన పెద్దన్నగారు.

విశ్వనాథ సత్యనారాయణగారిని తొలిసారిగా దర్శించి, ఆయన సాహిత్యాన్ని అధ్యయన పూర్వకంగా, మననశీలంగా అనుభవించటం మొదలయి ఇప్పటికి చతుష్షష్టి - అరవైనాలుగేళ్లు. ఆయన వయస్సిప్పుడు డెబ్భయి ఏండ్లు. సత్యనారాయణ గారి సాహిత్య సంపర్కం కలిగేనాటికే పూర్వాధునిక సంస్కృతాంధ్ర కవిశ్రేష్ఠుల సాహిత్యంతో గాఢమయిన సంబంధం ఏర్పడింది. అప్పటినుంచి ఇప్పటిదాకా సత్యనారాయణగారి కావ్యాలను, రచనలను పూర్వాధునిక కావ్యాలతో రచనలతో పోల్చి, బేరీజు వేయటం, ప్రతికవి ప్రక్కన సత్యనారాయణ గారిని నిలబెట్టి, ప్రతికవినీ సత్యనారాయణగారి ప్రక్కన నిలబెట్టి పోల్చుకొని సత్యనారాయణగారి ప్రతిభా - రచనా శక్తులకు, ఆయన సకలోహ వైభవ సనాథత్వానికి అబ్బురపడి ఉక్కిరి బిక్కిరయి పోయినారాయన. పరిచయమున్నంతవరకు ఆంధ్రేతర భాషాకవుల విషయంగానూ ఆయన ఇంతపని చేశారు. ఆయన పడిన అబ్బురంలో లేశమాత్రమైనా తేడా రాలేదు. కాగా ఆయన అనుభవ తీవ్రతను సమర్థమయిన అభివ్యక్తి ఈ మూడు పద్యాలు.

ఈ వయస్సులో ఆయన తను యష్టి(కాష్టభూతమయిన శరీరం) యష్టి(కఱ్ఱ) అవలంబనమ్మై అడుగడుగునా పతయాళు(పడిపోయే) దశను చేరుకుంది. అయినా గూడా ఆయన(విశ్వనాథ) గాలి సోకితేనే చాలు ఒళ్లంతా జలదరిస్తుమంది. ఎందుకో తెలియదు. సత్యనారాయణగారిని ఆయన ఆషాఢజలద అని సంబోధించారు. ఆయన్ని ఆషాఢంలో తొలిసారి దర్శించారు శరభయ్యగారు. (సత్యనారాయణగారు ఆషాఢజలద అని పద్యాలు రాసారు) మొయిల! (మేఘమా) అని పిలిచారు. ఆమబ్బు మిన్ను మన్నేకంగా కమ్ముకొంది. కన్ను తెరిచిన నాటి నుండీ, ఈ చరమ దశనాటికి గూడా ఆయనే ఈయనలో క్రిక్కిరిసి ఈ బతుకంతా ఆయనగా ఉన్నాడు. విశ్వనాథ వాక్కును గూర్చిన భావన దట్టంగా అలుముకొని లీనమై శైశవాది వివిధ వయోదశలలోనూ, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలోనూ నభశ్చతుష్షష్టి (నభస్ అరవైనాలుగు శ్రావణాలంటే అన్ని ఏండ్లు) గడిచి తన నీనాటికి చేతనామాత్రంగా శరభయ్యగారు.

ఇదీ సత్యనారాయణగారి - శరభయ్యగారి సాహిత్య వ్యక్తిత్వాల గాఢానుభవం.

(సంపత్కుమారాచార్య)

# కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారికి కవితా నీరాజనం

ఉండేల మాలకొండారెడ్డి

పద్యమ్ము వ్రాసెనా, భావగాంభీర్యవి
స్ఫూర్తితో నవరసంబులు సృజించు,
గేయమ్ము వ్రాసెనా, కిన్నెరసానియై
తరగల నురగల పరుగులెత్తు
నవలలు వ్రాసెనా, నవకల్పనా చమ
త్కృతులు సృష్టించి గిల్గింతపెట్టు
కధలు రచించెనా, కమనీయ సంఘజీ
వనచిత్ర దృశ్యాలు కనులగట్టు.

కలము చేబూని, తెలుగువాఙ్మయవధూటి
శిరముపై "వేయిపడగల" వరవినూత్న
మణి కిరీటమ్ము మలిచిన మాన్య సుకవి
విశ్వసాహిత్యనాధుడు విశ్వనాథ

అతని "వేయిపడగ" లాంధ్రసీమనెకాదు
నిఖిల భారతమున నిలిచి వెలుగు,
భరతదేశనేత నరసింహరాయని *
కలమువలన, కధనబలము వలన.

తెలుగు సాహిత్యమును, తొట్టతొలుత, మేటి
"జ్ఞానపీఠ" మెక్కించిన ఘనుడతండు
ఆంధ్రులకు చిరస్మరణీయులైన యట్టి
పూర్వకవులకు జెందు అపూర్వుడతడు

చెళ్ళపిళ్ళ శాస్త్రికి శిష్యుడు
అల నన్నయ తిక్కనాది ఆదికవులకున్
సులువుగ దొరకని భోగము
కలిగించెను గురుని కతడు కవిసమ్రాట్టై.

తన ప్రత్యేకత, పద్యశైలి, కధనోత్సాహమ్ము మీరన్, రచిం
చెను "రామాయణ కల్పవృక్షము" జగత్ శ్రేయోభిలాషన్, సుధీ
జన వంద్యుండగు "విశ్వనాథ", అది విశ్వప్రేమ సంధాయియై
తెనుగింటన్ పరనీయమై తరతరాల్ దీపించెడుం గావుతన్.

* మాన్యులు శ్రీపి.వి.నరసింహారావుగారు సత్యనారాయణగారి "వేయిపడగలు" ను క్లుప్తీకరించి "సహస్రఫణ్ "పేర హిందీలోకి అనువదించారు.

# ''కైమోడ్పు''

డా.మల్లెమాల

ప్రాచీనసాహితీ పరిశోధనాంబుధిన్
మేధతో కడముట్ట – ఈదినావు!
కమ్రరామాయణ కల్పవృక్షమునకు
జ్ఞానపీఠము నంటుగట్టినావు!
నర్తనశాలతో నవరసాత్మకమైన
నాటక బీజముల్ – నాటినావు!
పరిమళమ్ముడుగని పాటల హారమున్
మెచ్చి కిన్నెరసాని కిచ్చినావు!
వేయిపడగల కలమును విశ్వమంత
చకితమౌనటు ఝుళిపించి సకల జనుల
వినుతిగైకొన్న కవినాథ! విశ్వనాథ!
నిత్యమై యొప్పు జగతిలో నీదుగాథ!!

ఆంధ్రవాఙ్మయ మందు విఖ్యాతి గనిన
అన్ని ప్రక్రియలెపుడో నిన్నాశ్రయించి
పెంచుకొన్నవి తమకీర్తి నంచితముగ
నిరుపమానము నీవాణి నిశ్చయముగ!!

వేదనిధులు నీకు వెయ్యేండ్ల నేస్తాలు
అమలకవితకీవు ఆనవాలు
లోకవిదితమైన నీ కావ్యరాజాలు
మరపురాని గొప్ప మధువనాలు!!

చెళ్ళపిళ్ళకవికి శిష్యుండవై వారి
వాసినినుమడింప జేసినావు!
సాటిలేని శిష్యకోటికి గురువుగా
నిలిచి బవరమందు గెలిచినావు!!

జటిలము నీకవిత్వమని, సారెకు సారెకు బల్కునట్టి వా
రటుకులు గూడ గట్టియని యందురు, వారలమాటకేమి, నీ
పటుతర వాగ్విలాసమును ప్రాజ్ఞులహోయని మెచ్చి, హారతుల్
ఘటనమొనర్చినారు కవిగా చరితార్థుడవైతివెంతయున్!!

కవిసమ్మేళనమునవొక
కవియును పాల్గొనియెనన్నగౌరవమును, నా
కవిరళ ప్రేమ నొసంగిన
కవిసమ్రాట్! నినునుతింతు కైమోడ్పులతో!!

# కవిసమ్రాట్

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

కవితామ్నాయ రహస్యముల్ తెలియగా కాంక్షించినావేని, పా
మ్మువనిన్ నీవెవరిన్ దలంపక, తదే కాసక్తితో జేరుమా
కవిసమ్రాట్టగు విశ్వనాధు ప్రతిభా గంభీర వారాన్నిధిన్
శివకోటీర ఝరీ తురీయ వచన శ్రీ సన్నిధిన్ బెన్నిధిన్.
ఎవని యాకృతిమించు హిమశైల శిఖరమై
కవులలో పుడమి మానవులలోన,
ఎవని మన్గడయొప్పు శ్రవణ పీయూషమై
కథలలో సూరి వాక్సుధలలోన,
ఎవని భారతి వెల్గు నేకైక దీపమై
జగములం దాగామి యుగములందు,
ఎవని స్థానము గ్రాలు నవనవ
ఋషులలో నిఖిలానిమిషులలోన.
అతడు కవియును ఋషియు దేవతయు గాడు
కవులు ఋషులును దివిజులుం గలసిమెలసి
మ్రొక్కు సాక్షాత్ పరబ్రహ్మమూర్తిగాక
విశ్వనాధుడు కేవ లావిర్భవుండె!

# సాహితీ విశ్వనాథుడు

జె.బాపురెడ్డి

నన్నయనుండి నావరకు, నమ్మినదానిని నమ్మినట్లు, దే
శోన్నతికోసమై నవరసోజ్జ్వల కావ్యము లల్లినట్టి భా
వోన్నతులందు సన్నుతుడ వోయి! సహస్ర ఫణాగ్రకాంతి సం
ఛన్నుడవోయి! నీ కృతులు సత్యసరిత్తులు విశ్వరాట్కవీ!

చెలియలికట్టపై కడిమి చెట్టును కిన్నెరసాని పాటతో
వెలయగ జేసినావు; అది వేద సుబోధ వసంతశోభతో
తెలుగున కల్పవృక్షమయి, దివ్యత రామకథామృతమ్ము ని
స్తులముగ పంచిపెట్టు పరిశుద్ధుల కామనలెల్ల తీర్చుచున్.

వాద, నినాద వివాదాంధ్ర సాహిత్య
వనములో వల్మీకవాణి నీవు
నాటి వ్యాకరణ ఛందస్సూత్ర రణభూమి
ధర్మగీతా ప్రబోధనము నీవు
ప్రాచీన దృష్టి కర్వాచీన దృష్టికి
శిష్ట సమీచీన సృష్టి నీవు
నిందయు స్తుతియు వెన్వెంట నీ కీర్తిని
మోసెడి అద్వైతమూర్తి నీవు

దేశ కాలాలకును వేష భాషలకును
అంటుపట్టని పరమాత్మకాంతి నీవు
గురువులకె గురుడౌ శిష్యవరుడు నీవు
శిష్యు లెవ్వరు సరిరాని చిద్గురుడవు!

పద్యపు కాలుచేతులను పాశవికమ్ముగ త్రుంచినట్టి, ద్వే
షోద్యమ కర్తలందరు, మహోజ్జ్వల ఛందము విందు సేయు, స
ద్విద్యను తూలనాడి వెలివేసిన దుర్మతులంద రిప్డు, నీ
పద్యసరస్వతీ చరణపద్మములన్ కని మోకరిల్లరే!

నన్నయ్యచేతిలో వెన్న ముద్దలు తిన్న
పద్యమ్ము నీ గుండెపై స్రవించె
తిక్కన్న ఒడిలోన తేనెపలుకులు తిన్న
పద్యమ్ము నిన్నెంతొ ప్రస్తుతించె
శ్రీనాధు నింట పాకానేకములు తిన్న
పద్యమ్ము నీ నోట పరిమళించె
పోతన్న షడ్రసోపేతాన్నములు తిన్న
పద్యమ్ము నిను చూచి పరవశించె
అష్టదిగ్గజములు ప్రసిద్ధాశుకవులు
విందుచేసిన పద్యమ్ము కుందినపుడు
జాషువా కృష్ణశాస్త్రి దాశరధి వంటి
సహచరులతోడ పద్యావాసంతలక్ష్మి
ద్రఢిమ నిల్పిన విశ్వనాధుడవు నీవు.

ఏ ప్రక్రియ చేపట్టిన
ఆ ప్రక్రియలోన సిద్ధహస్తుడ వౌటన్
నీ ప్రాభవము ప్రభావము
ధీ ప్రజ్ఞోపజ్ఞ తెలుగుతేజం బయ్యెన్.

దేహాత్మలవలె నీ స
త్సాహిత్యము భాష - భావ సంయోజన, స
మ్మోహకమౌ! అక్షర వీ
ణా హంసక విశ్వనాధ నారాయణమై.

వేయి వాసంతములనుండి వెదకి వెదకి
తెలుగు సాహిత్య శారద తెచ్చుకొన్న
జ్ఞానపీఠ పురస్కార గౌరవమ్ము
నీవు! ఋషివి మానవతామనీషి నీవు.

నీ సాహిత్య సమావలోకనము తండ్రీ! చేయగా బూని, వి
ద్యా సంపన్న రసజ్ఞవిజ్ఞులు, వివేకాత్ముల్ వచోజ్ఞాన ల
క్ష్మీ సాన్నిధ్యము చేరినారు నవసంఫుల్లభావ సందీప్తు లై
భాసిల్లన్ వలె పూర్ణసత్య సమతాభాగ్యోదయ మ్మెల్లెడన్.

# తెలుగుభాష

విశ్వనాధ సత్యనారాయణ

ఒక్క సంగీతమేదో పాడునట్లు భా
షించునప్పుడు వినిపించు భాష,
విస్పష్టముగ-నెల్ల విన్పించునట్లు-స్ప
ష్టోచ్ఛారణంబున నొనరు భాష,
రసభావముల సమర్పణ శక్తి యందున
నమరభాషకును దీటైన భాష,
జీవులలో నున్న చేవయంతయు చమ
త్కృతి పల్కులన్ సమర్పించు భాష

భాషలొక పది తెలిసిన ప్రభువు చూచి
భాషయన నిద్దియని చెప్పబడిన భాష
తనర ఛందస్సులోని యందమ్మునడక-
తీర్చి చూపించినట్టిది తెలుఁగు భాష

## స్వేచ్ఛానువాదం

A language,
That sounds not like a language
But like a note of music, a lilt of a lyric,
Like something touching, striking nostalgic
When some one speaks, communicates

A language,
That appears self-revealing
Clean and clear sounding
When some one spells, pronounces

A language,
That impresses as powerful and immortal
As the immortal language "Sanskrit"
In the grace of expressing an aesthetic feeling
In the culture of conveying a cosmic musing.

A language,
That depicts the fire and flame of life
Underlining the "Consciousness" of all the lives
Wafted in words most amazing,
Woven in forms most astounding.

A language,
Of which
A king wondering
At its many splendors exclaimed
"Oh! This indeed is the language
Worthy of calling the language".

A language,
That, angling into the alchemy of poetry
Demonstrated many a marvel and a majesty
Entreasured in the treasure house of poesy
In the norms and nuances of poetics.
That indeed is my language
THE TELUGU LANGUAGE.

**(Dr. V. Kondal Rao)**

# సహృదయాభి సరణము

శివశ్రీ మల్లంపల్లి శరభయ్యశాస్త్రి

ఈ కృష్ణా గౌతమీ తీరములలో మాది విద్వద్వంశమని తెలియనివారెవ్వరూ కీ.శే.మా నాయనగారు మల్లంపల్లి మల్లికార్జునారాధ్యులవారు. నాకు పన్నెండేండ్లు నిండక మునుపే కావ్య నాటకాలంకారములతో సాహిత్యవిద్య ననుగ్రహించిరి. అప్పటికే కవితావిద్యా నన్ను వలచినది. స్వప్న సందర్శనములలో చెళ్లపిళ్ల వంశస్వామి నారాధించిన ఏకలవ్యుడను. సంస్కృతాంధ్ర సాహిత్యములలో కొన్ని వేల పద్యములు నాకు కంఠస్థములు. నేను కవినగుటలో నాశ్చర్యమేమి యున్నది? అప్పటికింకను శాస్త్రమేమియును మొదలుపెట్టలేదు. మా నాయనగారిని విడిచి ఒకసారి రెండుమాసములుండుట తటస్థించినది.

కైకలూరు వద్ద శోభనాద్రిపురమని కాశీనాధుని వారి యగ్రహారము. నేనా యూరు వెళ్లితిని. అచ్చట మా మేనల్లుడు కీ.శే.కాశీనాధుని శ్రీశైలపతియు దూరపు బంధువు మల్లంపల్లి నాగభూషణము గారును గలరు. నాగభూషణముగారి యొద్ద విశ్వనాధ సత్యనారాయణ గారి గ్రంధములన్నియు గలవు. మా మేనల్లుడు నాకన్న ఐదేండ్లు పెద్ద. మానాయనగారి యొద్ద నాతో సంస్కృత సాహిత్యము చదివెను. మహాప్రతిభాశాలి. అతనికింగ్లీషు సారస్వతములో గూడ మంచి ప్రవేశము గలదు. నా పద్యములు బాగోగులు విమర్శించి నన్ను తీర్చి దిద్దుచుండెడివాడు. నిరంతర గ్రంధ వ్యాసంగ శీలి. నాగభూషణము గారి యొద్దనున్న విశ్వనాధవారి గ్రంధములన్నియు నతడు చదివెను. ఆ గ్రంధములపై వారిద్దఱు ప్రసంగించు కొనుచు నన్ను కుఱ్ఱవానివలె చూచుచుండెడివారు. నాకది మనసులో చాల బాధగా నుండెడిది. నేనప్పుడు వేంకటశాస్త్రిగారి పద్యములు చదువుచుండెడివాడను. వారు నాకు విశ్వనాధవారి పద్యములు వినిపించెడివారు. నాకవి నచ్చెడివి కావు. అప్పటి యూహాలో సత్యనారాయణగారి పేరు ప్రక్కన M A అను అక్షరములు చూచి ఈయనకు సంస్కృతము సుష్ఠుగా వచ్చి యుండదనియును నాకొక యనుమానము.

"పసిమి బాలెంతావు పాలసంద్రములోన జున్ను లంకల మీదనున్న నీవు–" అని నాగభూషణముగారు చదువుచుండగా ఆ యూహలోని నవ్యతను ఆస్వాదించుటయెట్లో తెలియక నేను బహుశః ఇంగ్లీషు చదివినవారి కవితాధోరణి యిట్లుంటును కాబోలును! మన కర్థమగుట లేదని నిస్పృహచెందెడి వాడనుకాని తీసివేసెడువాడను మాత్రము కాదు. మా మేనల్లుని యందు నాకుగల ప్రామాణ్యమట్టిది.

ఒక కావ్యమును చదివి అందలి ప్రాణస్పందము తెలిసికొని ఆ కవి మనోధర్మమునందుకొని ఆ కవితో తాదాత్మ్యమును పొంది కొన్ని దినములదియే లోకముగా నుండుట నాకు జన్మసిద్ధమైన లక్షణము. అప్పటికే నాచిత్త సద్మమునందు కాళిదాస భవభూతులు బాణమయూరాదులగు సంస్కృత కవులును నన్నయ తిక్కనలు, శ్రీనాధ పోతనలు మొదలైన ఆంధ్ర కవులును చిత్రీకృతులై యుండిరి.

పరమభావుకుడైన నామేనల్లునికి ఇంతనచ్చిన విశ్వనాధ కవితా ప్రతిభ నాకేల తెలియుటలేదని అమర్షదుఃఖములతో నాగభూషణముగారి యొద్దనుండి తీసికొని ఒక్కొక్క గ్రంధము చదువ మొదలిడితిని.

ముందు కిన్నెరసాని పాటలకు చెవియొగ్గితిని. ఈ జన్మకు అగమ్యమనుకొన్న ఆ కవి మనోధర్మము మొదటిసారిగా నాకు మిక్కిలి సజాతీయమని తెలియవచ్చినది. తెనుగు పాటలలోని తీయదన మెట్లుండునో తెలిసినది. తెనుగుదేశములోని నదులు, కొండలు, అడవుల సౌందర్యమేమియో తెలిసినది. రసాక్ర తియైన ఆ వాగుతో నాకు తాదాత్మ్యము కలిగినది. నావెనుకటి జన్మలలో ఎచ్చటనో ఆ నది పూర్వజన్మమునకేదో సంబంధమున్నట్లు తోచినది. లేనిచో ఆ పాటలలోని తీయనలు "ఎన్నడో వెనుకటి బ్రతుకున మిక్కిలి విన్నవానివలె" నన్నింత వెన్నంటి యుండవు.

అనార్కలీ ఆలోకించితిని, అందలి గీతి మాధుర్యము ఆషాఢమాసమునందు గిర్యుపత్యకలలో పరువులు పెట్టుచున్న సన్నని సెలయేళ్ళ సంగీతమువలె వినిపింపజొచ్చినవి.

మాస్వామి పఠించితిని.

శ్రీనాధునకు పిమ్మట ఇన్ని శతాబ్దముల వఱకు అంతటిప్రాణ ప్రహ్లాదనమైన స్నిగ్ధగంభీరనిర్ఘోషముతో ఆంధ్రశారద నా చెవులలో ధ్వనింపలేదు.

నర్తనశాలలో ప్రవేశించితిని.

నాయుడు తెనుగు భాషలో నాటకము వ్రాసినట్లున్నది. ఆంధ్రప్రశస్తి హృదయగత మొనరించుకొంటిని. శక్తి నాలో వికసించి – "ఎన్ని జన్మమ్ములుగాగ – ఈ తనువునన్ బ్రవహించునో ఆంధ్ర రక్తములో" అన్న యనుభూతి నన్నాలమికొనెను.

వేనరాజు నా మనసులో నిలిచెను.

కలువపూ వ్వులోని పచ్చల దిమ్మ చుట్టును ముసరి తుమ్మెదగమి మ్రోసినట్లు – మెట్టైన యిసుకల మీద సన్నని సీటిపారజాలు ముర్మురి పుట్టినట్లు –

శుక్లాష్టమి వెన్నెలలో చంద్రకేతుకీ ప్రాసాద శిఖరములనుండి జాలువాఱుచున్న ఆ మహావైణికుని నాదవాహినిలో చేతనా చేతన సృష్టియంతయును ఆప్లావితమైనయట్లు నాతనూ సృష్టియంతయు నివతళించినది.

ఏకవీరతో తాదాత్మ్య మందితిని.

సంస్కృత మహానాటక కర్తల నాయికా సృష్టియందలి పరమభావుకతా లక్షణమంతయు చారుదత్తుని ప్రావారమునందు జాతీకుసుమ పరిమళరేఖవలె నామనసునావరించుకొనెను.

చివఱకు వేయిపడగలు చదివితిని.

తెనుగుదేశము యొక్క ఆత్మ సాక్షాత్కరించినది. కొన్ని కొన్ని అధ్యాయములు నాకన్నీళ్ళతో తడిసిపోయినవి. ఒక్కనెలరోజులలో ఈ గ్రంధములన్నియు చదివితిని. నా మనోధర్మమే మారినట్లయ్యెను. భూమియు, ఆకాశము, గాలియు క్రొత్తవియైనట్లు తోచెను. ఏదో క్రొత్త జన్మయెత్తిన యనుభూతి కలుగజొచ్చెను. ఆ రోజుల మాధుర్యమిప్పుడేమి చెప్పగలను!

ఆహా! పుస్తకముల మహిమ యెట్టిది!

భౌతిక రూపములలో పూర్వకవులెట్లుండిరో తెలియదు కదా! వారి ప్రతిభలన్నియు రాశీభావము నందినట్లున్న యీ కవి నేనున్న కాలములోనే ఈ ఆకాశము క్రింద – ఈ భూమిపై – నావలెనే నడయాడుచున్నాడు. ఈ గాలి మమ్మిరువురను సమానముగ స్పృశించుచున్నది. నాకింతటి సమానధర్ముడైన కవి యెట్లుండెనో! ఈ కవిని నేను చూచి తీరవలయును నాయంతట నేను చూడవలయును. మూడవ వారి ప్రమేయము ఉండరాదు. ఆయన ఎవరో నేనే గుర్తు పట్టగలను. ఇన్ని గ్రంధములలో ఇంత విస్పష్టముగ ఆయన యాత్మ నెఱిగియున్న నేను–అట్టి రసాత్మ నివసించుచున్న ఆ శరీరగృహములో ఆయనను గుర్తుపట్టలేక పోవుటకన్న అసంభవమైన విషయమింకొకటి యుండదు.

ఇట్టి స్థిర నిశ్చయముతో బెజవాడ వెళ్ళితిని. అప్పటి నా సాహసము తలంచికొనినచో ఇప్పటికిని నాకాశ్చర్యమే కలుగుచుండును. ప్రాణాధికుడైన కవికై నిర్వ్యాజరసముగ్ధమైన సహృదయాభిసరణమది. కాళిదాసాది మహాకవులను సైతము రసోన్మత్తులై ఏయజ్ఞాత సహృదయులైన వారు నావలె నిట్లభిసరించిరో! మహాశ్వేత చేసిన పుండరీకాభిసరణము కన్న పురూరవసునికై ఊర్వశి చేసిన దానికన్న – ఇది దివ్యమును అపార్ధివమును.

ఎవ్వరితోడను చెప్పలేదు. ఆ యూహలోని మాధుర్యభరమెవ్వరికి చెప్పనీయలేదు.

ఆయనెవ్వరు? నేనెవ్వరు?

వచ్చినపని యేమియని యడిగినచో–చెప్పుటకేమి యున్నది? దీని పరిణామమెట్లుండును. అసలు నన్నాయన లెక్కచేయునా? లెక్కచేయుటకు ముందు నేనెవ్వరో నా మనస్థితి యెట్టిదో తెలియవలయును గదా!

నా యాకృతి ఆయన తెలిసికొనుటకు వీలుగనున్నదా! నేనెవరో బికారివలె ఉన్మత్తునివలె నుంటిని గదా! తెలియక నన్నవమానించునేమో! ఈ వికల్పములను గాని నా యాభిజాత్యదర్పమును గాని ఆయుత్కంఠాభరము నిలువనీయలేదు.

నాకున్న సర్వస్వము నాహృదయమొక్కటియే.

నేనట్లున్ననేమి? నావేషమెట్లున్న నేమి? మాసిన లాగు, చొక్కా, మెడలో గౌడరుద్రాక్ష, ప్రజాగరారుణములైన కన్నులతో భారభుగ్నమైన హృదయముతో ప్రాణాధికుడైన కవికై విజయవాడ వీధులలో నా అన్వేషణము మొదలుపెట్టితిని.

ఉయ్యూరు రాజాగారి కళాశాల అప్పుడు గవర్నరు పేటలో ఒక మేడలో నుండెడిది. నేనా మేడ ప్రాంగణమునకు వెళ్ళితిని. ఆ యింగ్లీషు విద్యార్థుల వేషభాషలెక్కడ? నేనెక్కడ? లోపలి కడుగుపెట్టుటకే తగని బిడియముగా నుండెను. అచ్చట నన్ను లక్ష్యపెట్టువారెవ్వరు? ఎవరినైన ఏమైన అడుగవలయునన్నచో నాకు వల్లమాలిన నత్తియొకటి గదా ఎల్లరును నామాట వినిపించుకొనకయే నవ్వెదురు. అదిగాక నేనెవ్వరిని అడుగ దలచి కొననేలేదుగదా!

తుటుములు తుటుములుగా విద్యార్థులు వచ్చుచుండిరి. ఒకరిద్దఱుగా ఉపన్యాసకులును వచ్చుచుండిరి. నేనొక మూల నిలుచుండి వ్యగ్ర హృదయముతో పరిశీలించుచుంటిని. ఎవరెవరో వచ్చుచుండిరి. లోనికి పోవుచుండిరి. ఘూర్ణమానార్ణవమైన నాగుండెలోని సంక్షోభమెవ్వరికి దెలియును? నా ప్రతీక్ష ప్రతిక్షణ మహాయుగముగా నుండెను. నాలోపలి నుండి యెవ్వరో –

'అనుభూయతా మిదమిదం పురస్థితం పూర్ణ నిర్వాణమ్' అని హెచ్చరించుచున్నట్లున్నది.

ఇట్లు–ఒక పదినిమేషములు గడిచినవి. రావలసిన వారందఱు వచ్చుటయైనదని – వచ్చిన వారిలో నాకు కావలసిన వారు లేరనియు నాకు నిశ్చితమైనది.

నేడీయనకేమైన పనియున్నదో! సెలవు పంపిరో! నేటి కసలురానే రారో! నా ప్రతీక్షయంతయు భగ్నమైనది. నా హృదయమంతయును శూన్యమైనది. కాని–నేనాప్రదేశము నుండి కదలలేక పోవుచుంటిని.

ఇంతలో ద్వార భూమి యందు ఉత్తాల ఫణామండలముతో తోకపై నిలిచి ముందునకు తూగి వచ్చుచున్నట్లు–దుర్నిరీక్ష్యమైన ఒకానొక యాకృతి భాసించెను. ఆ యాకృతి అంతస్సంగీతముతో కదలుచున్నది కావలయును. నాకాళ్ళలో వణకు పుట్టినది. నా యెడలు నాకు తెలియుట లేదు. నిశ్చేష్టుడనై యుంటిని.

ఆయన లోనికేగి రెండు నిమేషములలో తిరిగి వచ్చి ద్వారము దాటి మరల వీధిలోని కేగెను. ఆయాకృతితో నా హృదయమును ప్రాణమును అనుగమించినవి కావలయును. ఒక్క క్షణములో ఇంకిపోయిన సముద్రమువలె నైతిని, నా సర్వస్వమును ఎచ్చటికో పోవుచున్నట్లనిపించెను.

కొన్ని క్షణములలో నేను తెప్పరిల్లి వచ్చినదెవ్వరో నాశరీరము నందలి ప్రత్యణువు నందును వేయిశంఖములతో నూదినట్లు ప్రతిధ్వనించుచున్నను వ్యావహారికమైన నిర్ధారణకై 'ఫలానావారు వచ్చిరా?' అని అచ్చటివారి నడుగుటయును 'ఇప్పుడు వచ్చి వెళ్లినది వారే' అన్న సమాధానము వచ్చుటయును ఒక్క లిప్తలో జరిగెను. పూర్ణమనోరథుడనై నేను వీధిలోనికి వచ్చితిని. అప్పటికప్పుడే ఆయన నా ముందు దూరమున నడచిపోవుచుండెను. సవేపథుస్ఖలిత పదన్యాసముగా సమీపించి కొన్ని యడుగుల వ్యవధిలో అనుసరించి నడచుచుంటిని. అప్పటి నా మనఃస్థితి నెట్ల చెప్పనలవియగును.

అర్ణవశ్యామసీమయైన అవనియంతయు నాకు కైవసమైనయట్లు, ఉపత్యకయందు నిలిచి కైలాస శిఖరమును సందర్శించుచున్న యట్లు, రాశీభూతమైన పూర్వాంధ్ర మహాకవుల ప్రతిభ యంతయును నా ముందు సాకారమై నడచుచున్నట్లు, భాస కాళిదాస భవభూతి దిఙ్నాగుల భావుకతలోని పరమసౌకుమార్య ముద్రలే నాచేత స్ఫుటము ముద్రితమైనయట్లు ఈత్రిలింగదేశాకాశమును, భూమిని, వాయువును, వనములను పర్వతములను మహానదులను యుగ యుగములుగా ఆవరించికొనియున్న ఆత్మయేదో ఆకృతికొదిగి నాకు ప్రసన్నమైనయట్లు, నేను దానిలోలీనమై పోవుచున్నయట్లు, ఒకానొక అంతస్సంగీతమును వినుచు నేనాయన వెనుక నడచుచుంటిని. ఎచ్చటకి పోవుచుంటినో తెలియకయే అవశముగా పోవుచుంటిని. పోవుట యెక్కడికి? గమ్యమునందె లీనమై యుంటిని. కొన్ని వీధులు గడచినవి, ఆయన ఒక యింటిలో ప్రవేశించిరి. అది స్వగృహము కాదు, మిత్రగృహము కావలయును. ఆ గదిలో నెవ్వరును లేరు. ఆయన

ఒక యాసనముపై నాసీనులైరి. అవశముగా పాదములపై వ్రాలి పోవుచున్న నన్ను చూచి – ఎవరో భిక్షుక శిశువనుకొని ఛీ! నన్ను తాకెదవేల? కావలసిన దేదో దూరముగ నిలిచి యడుగరాదా! అని ఆయన నన్ను గద్దించెను.

రుద్ధమైన కంఠము నుండి కొన్ని ఛందోమయాక్షరములు పెగిలిపడి – ఇంకవశము గాక యేడ్చుచున్న నన్ను చూచి–వి భ్రాంతుడై ఆయన లేచివచ్చి నన్ను దగ్గఱకు తీసుకొని – ఒడి యందు కూర్చుండబెట్టికొని ఏడ్పు మాన్పించి – నా చిబుకము నెత్తి 'నీవెవ్వరని' అడిగి నా సమాధానమును విని నిలువున నీరయ్యెను. ఇంక ఎన్నడును ఎవ్వరికిని గోత్రనామగ్రహణ విరహితముగ పాదాభివందనము చేయవలదని శాసించిరి. బాష్ప పరిపూర్ణ నయనములతో ఏవమవిజ్ఞాతాని దైవతాన్యప్యవధూయంతే అని తనలో తాను డగ్గుత్తిక పెట్టికొనెను

అజ్ఞాత హేతువగు దైవయోగమున నిట్లు కలసిన నన్ను వెంటబెట్టుకొని త్రోవలో నా విద్యాభ్యాసమును గూర్చి–నేను చదివిన తమ గ్రంథములను గూర్చి ముచ్చటించుచు తమ యింటికి తీసుకొనిపోయి స్వజనముతో కలిపికొనిరి. వానలో తడిసిన అడవి వలె కన్నీ రోడ్చి నా హృదయము తేలికపడి ఒక ప్రహ్లాద భావమును భజించెను. లది మొదలు ఈ ముప్పది నాలుగేండ్లలో మేమెప్పుడు కలిసినను ఆ తొలినాటి అనుభూతియే భాసించెడిది. ఆయన కంటికి నేనెప్పుడును పన్నెండేండ్ల బాలునివలెనె కనిపించెడువాడను. నేడు వార్ధకచ్ఛాయ నాపై పడుచున్నను ఆయనను చూచినపుడెల్ల నాకును అట్లే లనిపించెడిది. ఆ ప్రేమ బలము నా వయోజ్ఞానమును కూడ స్తంభింపజేసినది కావలయును.

అప్పుడు పగలు రెండు జాములైనది. నేనేమైయుందునో తెలియక బంధుజనము నాకై యలజడి పడుచుందురన్న యూహ వచ్చి ఇక నేను పోయివచ్చెదననగా 'సాయంకాలమురమ్మని' ఆయన నన్నాదేశించిరి.

నాడు వృషసంవత్సర శ్రావణశుద్ధ ప్రతిపత్తు. ఆ సాయంతనము నేను వారియింటికేగి ఆయనకై ప్రతీక్షించు చుంటిని. ఉద్విగ్నమైన ఆ ప్రొద్దుటి ప్రతీక్షకును, స్థిమితమైన సాయంతన ప్రతీక్షకును ఎంతటి భేదము!

ఆయన వాహ్యాళికేగి చీకటిపడి యింటికి వచ్చిరి. వచ్చుచునే నన్ను చూచి ఈ అబ్బాయి వచ్చెనే అనుచు లోపలికేగి వచ్చి ఏమి చదువు చుంటివని నన్నడిగిరి. ఆ సాయంసమయమున దేవీస్తుతులు–నేను రచించినవి చదువుచుంటిని. అవి విని 'నీకు అమ్మవారన్న ఇష్టమువలె నున్నదే? నేనును అమ్మవారిపై పద్యములు వ్రాసితిని విను' మని యీ పద్యములు చదివిరి. ఆ కంఠము నుండి తొలిసారిగా వెలువడి నాశ్రవోయుగళిలో పడినంతనే నాకు కంఠస్థమైన ఆ ప్రథమ సరస్వతీ నిష్యందమిది.

కోకిల కామినీ మధుర కూజిత కోమల వాయువీచి సం
ధ్యా కపిశమ్ములైన జడలల్లిన జీబులలోన తాండవ
శ్రీ కమనీయ జాహ్నవి ధరించిన దేవుని గేహదీపమా
లాకృతి మందహాస కలితానన మాకు బ్రసన్నమయ్యెడున్.
నిగమ మహార్థముల్ జగమునిండెను తన్నిగమాంత వైఖరుల్
నిగమ చయమ్ముకన్న హవణించెను తన్నిగమాంత చూడమై
తగిలెను బ్రహ్మనాబడు పదార్థము–బ్రహ్మము మౌళి తల్లి క్రొం
జిగురు పదమ్ము గోటిరుచిచే రుచిమంత మిదెంత చిత్రమో.
అమ్మధురావలోకనములద్భుతమయ్యెడు తల్లిలోచనాం
తమ్ములు సాగినంతన శతప్రమితుల్ మధురేక్షుచాపఖం
డమ్ములవారు రత్నమకుటమ్ముల వారు జగద్విలోభనా
స్యమ్ముల వారునున్ బ్రభవ మందెదరంబుద నీలరోచిషుల్.

ఆరాత్రి మేమిరువురము కలసి భుజించి – భోజనాంతరము మఱల గోష్ఠికి గూర్చుంటిమి. తమ 'మాస్వామి' సర్వాశీస్సులతో నాకు వ్రాసియిచ్చి ఆ గ్రంథము నాకు వినిపింప మొదలిడిరి. అది శ్రావణ

మాసము కదా! బయట దారాసారములుగ వర్షము కురియుచుండెను. మా స్వామిలో శ్రీకాళహస్తీశ్వర స్వామియును, కాశీవిశ్వేశ్వర స్వామియును వచ్చి లీనమై యుండగా ఆ పద్యముల మాధుర్యములో ధూర్జటి శ్రీనాథులు లీనమై యుండక యేమగుదురు? శ్రీ మంజూషిక వద్ద నుండి మొదలిడి కైలాసా చలసానువుల మీదుగా నా మనస్సు ఆయన త్రిప్పినచోనెల్ల తిరిగి తిరిగి - చివరకు -

"సాబాముల్ మసకాటలో విడుచుకూసాలాజడ్డల్ ముళ్ళలో

జీబుల్ గట్టిన యేటి క్రొత్తరగలో చిన్నారి జాబిల్లిగా

రాబంపున్ మునుసోగ వెన్నెలల దారాలల్లులో కీలు బొ

మ్మై బందిన్ గొని"

తెమలింపరాక చిక్కుపడి యుండెను.

బయట శతసహస్ర వీణాధ్వనుల వలె వర్ష ధారాధ్వనులు! నడుమ నడుమ మేఘస్తనితములు!

ఆయన కంఠసీమలో తేనెలు పొంగుచుండెను. మేఘ గర్జనలు వీతెంచు చుండెను. పికీకన్యకానూన వ్యాప్తిని పంచమ మధువు చిందు చుండెను. ద్యోనదాంభఃకణశ్రీలు తాండవించు చుండెను. ఆ శతకమారీతిగ ముగియు చుండెను. రాత్రి రెండు జాములయ్యెను. వియన్నీలాతిసీల ప్రభాశ్రీకృన్మోహన వర్షభాద్రపద సంశ్లేష ప్రగర్జ ద్వీలాసై కాంభోద తనూ ప్రకాశిత వధూసౌదామనీదేహవల్లీ కల్యాణమనోజ్ఞ దీధితులవలె ఒక్కసారిగ-స్వామికారుణ్యము మెఱసి అందు విశ్వమంతయును దేదీప్యమానమై వెలుగొందెను.

ఇట్లు లోకరోకరిలో లీనమగుచున్న కవి సహృదయులను తనలో విలీనమొనరించు కొన్న ఆ ప్రథమ నభోనిశాక్షణముల స్మృతి మాధుర్యమే నేటికిని సన్ను నిలిపి యీ కథ నాచే నిట్లు చెప్పించినది.

*******



Andavilli Satyanarayana, Viswanatha Satyanarayana, T.V. Hanumanth Rao, Ushasri at the metting

# నేను - మా మాస్టారు గారు

కీ.శే.ధూళిపాళ శ్రీరామమూర్తి

ముప్పైయేడో ముప్పై యెనిమిదో గుర్తులేదు. కృష్ణాజిల్లాలో శాయపురమనే ఒక అగ్రహారం [illegible] అగ్రహారంలో పద్దెనిమిది, యిరవై యేళ్ళలోపు వయస్సు గల పిల్లలందరు కలిసి ఒక లైబ్రరీ పెట్టుకున్నారు. దాని వార్షికోత్సవానికి మాష్టరుగారిని పిలిచారు. మాష్టరుగారప్పుడు [illegible] న్నారు. అప్పుడు పురాణం సూరిశాస్త్రిగారు కూడా వచ్చారనుకుంటాను. మాది ఆ [illegible] కాకి పోయినా ఆ వూరిలో చాలా భాగం మాబంధువులే అవటంవల్ల ఆ సభకు నేనూ వెళ్లాను. నేనూ సత్యనారాయణ [illegible] పంచరత్నాలు వ్రాశాను. ఇంకా వొకళ్ళిద్దరు వ్రాశారు. వాటిల్లో నాకు ఒక పద్యం గుర్తువుంది

ప్రాకట భావయుక్త రసబంధుర సత్కవితాసుధా ఝు రీ
శీకర పాళి భారతికి జీవము పోసిన యట్టి దుగ్ధ ర
త్నాకర కల్పుడీవె కవితా నవచాతురి నీదుసొమ్ము రా
పే కవి సార్వభౌమ! కొనవే యివె మేమిడు స్వాగతంబులన్.

ఇది మొదటి పద్యం. ఇందులో మూడో చరణంలో అక్కపెద్ది సత్యనారాయణగారని వుండేవారు, ఆయన దిద్దుబాటు కొంత వుంది. మేము పద్యాలు చదివిన తరువాత మాష్టరుగారు మాట్లాడారు. ఆ మాట్లాడటం "ఆయం ధీరో ధీరో ధ్వనితి నవనీలో జలధరః" అన్నట్లుగా వుంది. ఆయన యేం మాట్లాడారో గుర్తులేదు. అప్పుడు యేదో భావకవిత్వాన్ని విమర్శించారు. అప్పుడేమిటి? ఎప్పుడైనా ఆయన వుపన్యాసం యేదో విమర్శవుంటేనే రక్తి కట్టేది. ఆ రోజు ఆ సభ రక్తి కట్టింది. అది మాష్టరుగారితో నా మొదటి పరిచయం. తరువాత తరువాత మా పరిచయం బాగాపెరిగి మాష్టరుగారికి నేను చాలా సన్నిహితుడినైనాను, ఆయనతో నలభైయేళ్ళు నాకు సాన్నిహిత్యం నడిచింది. మాష్టరుగారు స్వర్గస్థులై దాదాపు పదేళ్ళు అయింది! అయినప్పటికీ కూడా ఆ మొదటిరోజు యెంత క్రొత్తగా కన్పించారో ఇప్పటికి కూడా నాకాయన అంత క్రొత్తగానే కన్పిస్తాడు. ఏమాత్రం పాతబడిపోలేదు. ఆయన అప్పటి నుంచి నాకు కవిసార్వభౌముడే. ఆ తరువాత బందరులో సభచేసి ఆయనకు కవిసమ్రాట్ అని బిరుదు యిచ్చారని విన్నాను. సరే! నేనన్నది లోకం అంగీకరించిందనుకొన్నాను.

తరువాత కొద్ది రోజులలోనే మాష్టరుగారు బెజవాడరాజాగారి కాలేజీలో ఉపన్యాసకునిగా చేరారు. బెజవాడలోనే హిందూ హైస్కూలులో నాకూ ఉద్యోగం దొరికింది. అప్పుడు కాలేజీ గవర్నరు పేటలో నొక అద్దె యింట్లో వుండేది. ఓ తడవ అక్కడికి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రుల్లుగారు, వేలూరి శివరామశాస్త్రుల్లుగారు వుపన్యాసానికి వచ్చారు. నేనూ యింకో మిత్రుడు కలిసి సభకు వెళ్ళాము. ఆ సమయానికి వేంకటశాస్త్రులుగారు మాట్లాడుతున్నారు. వెంకటశాస్త్రుల్లుగారు మాటలాడటమంటే అది జగన్మోహకంగావుండేది. ఆయన వేషం అపరశివుడిలా ఉండేది. మాట్లాడుతుంటే మాటమాటకి పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వు వచ్చేది. ఎంతో సహజంగాను ఉండేది. చెణుకులకు చెణుకులు వుండేవి. లోతుకు లోతూ వుండేది. అవతలి వాడు కోపం తెప్పించాలని చూచినప్పటికీ ఆయనకు కోపం వచ్చేదికాదు. చమత్కారంగానే సమాధానం చెప్పేవాడు, చాలా తేలికగా యేడిపించేవాడు. ఆయన మాటలాడుతుంటే వొక్కొక్క మాటకి వేయేసి కత్తులు కట్టి మాట్లాడేవాడు. ఆయన వుపన్యాసం తాత్పర్యం "భక్తి - రసం - కాదు" అని తేల్చారు. దాని మీద శివరామ శాస్త్రిగారందుకుని భక్తిరసం కాక పోవట మేమిటని సంస్కృతం లోంచి బోలెడు వుదాహరణలిస్తూ ప్రసంగించారు. దానిమీద మళ్ళీ వెంకట శాస్త్రుల్లుగారు, ఆ పైన మళ్ళీ శివరామ శాస్త్రుల్లుగారు వొకరినొకరు ఖండించుకుంటూ వుపన్యాసాలు చెప్పారు. శివరామ శాస్త్రుల్లుగారికైతే బాగా ఆవేశం వచ్చిందిగాని వెంకటశాస్త్రుల్లు గారికిరాదే! ఆయన తన సహజ ధోరణిలోనే, చమత్కారంగానే ఆయన చెప్పిన యుక్తుల నన్నింటిని తునకలు చేశారు. దానిమీద శివరామశాస్త్రుల్లుగారు ఇంగ్లీషులో నుంచీ, ఫ్రెంచిలోనుంచీ, జర్మనీలో నుంచీ వుదాహరణలిస్తూ మాట్లాడారు. వెంకటశాస్త్రుల్లుగారు, "ఒరే! శివరామా! ఆ జాతి భాషల్లోనీవు చెప్పినట్లు వుందేమో! నాకా భాషలురావు కాబట్టి, సంస్కృతం వచ్చు

కాబట్టిన్నీ నేను వొప్పుకో  పోతున్నారు. వెంటనే మాస్టరుగారు లేచి వారిద్దరి వాదాన్నీ సంగ్రహం చెప్పి భక్తి రసమంటుం సంప్ర కాదని యింకా యేదో జాతి భాషల్లోవున్నవాన్ని గురించి వ్యాపోయారు. శివరామ శాస్త్రుల్లుగారు, "సత్యనారాయణగారూ ఆ భాషలు రానివారు అట్లాగే అనుకుంటారు లెండి" అన్నారు. ఆ మాట యిద్దరికి వర్తిస్తుంది. అంటే వెంకటశాస్త్రుల్లుగారికి, మాస్టరుగారికిన్నీ. వెంకట నిమ్మకు నీరెత్తినట్లు వూరుకున్నారు. మాస్టరుగారు మాత్రం నేనిప్పుడు మాట్లాడితే తగాదా వస్తుంది అని సభను సమాప్తం చేశారు. దాంతో మాకు తెలిసిందేమిటంటే అంతవాదించుకున్నా వెంకట శాస్త్రుల్లుగారికి, శివరామ శాస్త్రుల్లుగారికి వైమనస్యం యేమిలేదని, శివరామ శాస్త్రుల్లుగారికి, మాస్టరుగారికిన్నీ యేమీవాదం జరగకపోయినా పడదని. మరింకొకటేమిటంటే మాస్టరుగారు చాలా ఆత్మనిగ్రహం ప్రదర్శించారా సభలో.

సాధారణంగా మాస్టారుగారు నిరంకుశంగానే మాట్లాడేవారు. ఆయన సభలో వుండగా యెవరన్నా అసంప్రదాయకంగా మాట్లాడుతే వూరుకునే వారు కాదు. బాగా తీవ్రంగా ఖండించేవారు. అందుకని ఆయనంటే చాలా మందికి కోపంవుండేది. ఓ మాటు ఏలూరుసభలో కాబోలు సత్యనారాయణ గారు మాట్లాడుతున్నారు. ప్రసక్తానుప్రసక్తంగా, "వేసవి కాలంలో కాలవలు యెండిపోతాయి. కాబట్టివాటిల్లో చెలమగుంటలు త్రవ్వుతారు, తియ్యటి నీళ్ళు పడతాయి" అని చెప్తున్నారట , అప్పుడు ప్రక్కనే కూర్చున్న వెంకట శాస్త్రుల్లుగారు "ఒరేయ్ మా వూర్లో కాలవల్లో చెలమగుంటలు తవ్వితే నీళ్ళు పడవేరా?" అన్నారట. దానికి వెంటనే సత్యనారాయణగారు, "ఎట్లా పడతాయ్? ఆ నీళ్ళన్నీ మన కవిత్వంలోకి యెక్కితే" అని అన్నారట. వేంకటశాస్త్రులు ఆ మాటకు నవ్వివూరుకున్నారట. సత్యనారాయణ గారు వొక్కొక్కప్పుడు గురువుగారినైనా లెక్కపెట్టేవారు కాదన్నమాట.

మాస్టారుగారికి గుడివాడలో గజారోహణోత్సవం జరిగింది. ఆనాటి సాయంకాలం పెద్దసభ జరిగింది. అ సభకు వెంకటశాస్త్రుల్లుగారు వచ్చారు. కాటూరి వెంకటేశ్వరరావుగారు వచ్చారు. అ సభలో కాటూరి వెంకటేశ్వరరావుగారు పద్యాలు చదివారు, నిజంగా రత్నాల్లాంటి పద్యాలు. ఆ పద్యాలు వినినంత మాత్రం చేతనే గుర్తుండేవి. నిజం చెప్పాలంటే కాటూరి వెంకటేశ్వరరావుగారే పద్యం వ్రాయాలి. దానిలో వుండేతెలుగు ఫ్లేవరు, నభూతోనభవిష్యతి. పద్యరచన మహా తీర్పుగావుండేది. బెజవాడలో నవ్యసాహిత్య పరిషత్తు జరిగినప్పుడు ఆ సంవత్సరానికి పరిషత్తు అధ్యక్షుడిగా మాస్టరుగారిని యెన్నుకున్నారు. ఆ సభలో సత్యనారాయణగారు సర్కస్ మాస్టర్‌లాగా వ్యవహరించారు. అనుకున్నసమయానికి కవులందరి చేతా పద్యపఠనంగాని, వుపన్యాసంగాని ముగింపజేయగల్గారు. ఆ సభ మూడు రోజులు జరిగింది. రెండోరోజున కాబోలు వారు 'పౌలస్త్య హృదయం' చదివారు. అందులో,

"జనపాలు వ్రేలు నీడున శైవచాపంబు
విరిచిన శృంగార వీరమహిమ "

అనే వొక సీసపద్యచరణం నాకు గుర్తువున్నది. ఆ సీసపద్యం చదివిన తరువాత మాస్టరుగారు, కాటూరి వారిని కౌగలించుకుని "అచ్చమైన నియ్యోగి బిడ్డవి కాబట్టి సీసపద్యం యింత బాగావ్రాశావు " అన్నారు. చెప్పవచ్చిందేమిటంటే ఆ గుడివాడ సభలో వెంకటేశ్వరరావుగారి పద్యాలు రక్తి కట్టినట్లు మరెవ్వరివీ కట్టలేదు.

పితృపాదుల్‌వలె కాశికేగితివొ? యా విశ్వేశ్వరున్ దెచ్చి చే
సితివో మేటి ప్రతిష్ఠ? పద్యములనన్ చేలోకు వొటన్‌గదా!
శతకంబొక్కటి కట్టి, కొంటివి ప్రతిష్ఠన్ ; మేల్ బళా! కాశికా
పతి! విశ్వేశ్వర! నీవు మెచ్చువలె నబ్బా యిట్టి చాతుర్యముల్

యీ పద్యం నాకు బాగా గుర్తువుంది. అప్పుడు విని గుర్తుపెట్టుకున్నదే. ఇంకా కొన్ని కొన్ని పద్యాల్లో కొన్నికొన్ని ముక్కలు గుర్తున్నాయనుకోండి. ఈ పద్యాలు వ్రాసినందుకు తరువాత వారి మిత్రులెవరో "అతని మీద యింత మంచి పద్యాలు వ్రాశావేమిటి? " అని అడిగారట. దానికాయన "ఆతనట్లాంటివాడే" అని చెప్పారట. ఆయన సహృదయత్వమట్లాంటిది. నేనొకమాటు సత్యనారాయణగారి తో అన్నాను.

"వెంకటేశ్వరరావు గారు పద్యం బహుబాగా వ్రాస్తాడండీ. ముక్కు తిమ్మన లాగా వ్రాస్తాడు." అట్లా అంటే ముక్కుతిమ్మన వ్రాయడ మేమిటి? అంతకన్నా వందరెట్లు బాగా వ్రాస్తాడు. పద్యంలో తెలుగు పలుకుబడి గుబాళింపంతా వుంటుంది. పద్యం వ్రాస్తే అతనే వ్రాయాలి. నేనొక మహాకావ్యం వ్రాయబోయానా? అన్నాను. అతనాపని చేస్తే అతని ముందు యెవళ్లూ ఆగరు" అని. వాళ్లిద్దరికీ యేవో సాహిత్యాలు ఇట్లు కొంత చెప్తూ వుంట ఆ పొరువు లేమన్నా వుంటే రాజకీయాల వల్ల తప్ప అంతరాంతరాల్లో వున్నవి కావని నాకు బాగా తెలిసిందే. ఆ సభలో వెంకట శాస్త్రుల్లు గారు యేం మాట్లాడారో నాకైతే గుర్తులేదు. రాత్రిపూట భోజనాలు ఉపద్రష్ట వారి సత్రంలో యేర్పాటు చేసారు. అప్పుడు వెంకట శాస్త్రుల్లు గారు సత్యనారాయణ గారిని చూచి " ఒరేయ్! సత్యనారాయణా! యీ పట్టుబట్ట లెవరు ఇచ్చారురా" అని అడిగారు అని కోపొచ్చా! "జమిందారులు భోగం వాళ్ళకు పట్టు బట్టలు పెడ్తారులే. అందుకని అడిగాను" అన్నారు. మాస్టరుగారు శాస్త్రుల్లు గారూ ఇవి ఆ బాపతు కాదు లేండి అని యేదో అన బోయి నిగ్రహించు కొని వెళ్ళిపోయినారు. ఈ సంఘటన మాత్రం గుర్తు వున్నది. ఆ సభకు మా మల్లంపల్లి శరభయ్య వచ్చాడు. అతను వెంకట శాస్త్రులుగారి మీద పద్యాలు చదివి నట్లు గుర్తు. మాష్టారు గారి మీద చదివి నట్లు గుర్తు లేదు, చదివాడేమో మరి, నేనూ పద్యాలు వ్రాసాను గాని చదవటానికి సమయం దొరికలేదు. తరువాత ఆపద్యాలు యెక్కడో పోయినాయి. సభలో మాష్టారు గారికి చేసిన సన్మానం చాలా తక్కువే. కానీ సాహిత్యవేత్తలు మాత్రం చాలా మంది వచ్చారు. చాలా మంది కుఱ్ఱవాళ్లు ఉల్లాహితులైనారు.

అక్కపెద్ది సత్యనారాయణగారని ఒకరు వుండేవారు. వీరిది శాయపురం. హిందూ హైస్కూలులో తెలుగు పండితుడుగా నాకంటే చాలా ముందే వీరు వుద్యోగం చేస్తువుండేవారు. వీరు "అమృతసిద్ధి " అనివొక గ్రంథం వ్రాశారు. నూరు, నూటయాభై పద్యాలుంటవి. సత్యనారాయణగారికి విన్పిద్దాం రమ్మని నన్నుకూడా తీసికెళ్ళారు. సంగతివిని మాస్టరుగారు యేదీ చదవండన్నారు. ఈయన చదువుతున్నారు. ఆయన వింటున్నారు. కొంత దూరం చదివి "యెలా వుంది " అన్నారీయన. ఆయన " సాంతం చదవండిచెబుతా" నన్నారు. ఈయన మొత్తం చదవటానికి గంటన్నరకు పైగానే పట్టింది, చదవటం అయిపోయింది. మాస్టరుగారు విన్న పద్యాలు వుదాహరిస్తూ గుణదోషాల్ని గుఱించి వొక అరగంట చెప్పారు. ఈ అరగంటలో ముప్ఫైనలభై పద్యాలు వుదాహరించినట్లు గుర్తు. నాకు ఆశ్చర్యమేసింది. అప్పటికి వారితో చనవు తక్కువ. బైటకి వచ్చిం తరువాత అక్కపెద్ది వారినడిగాను. " ఇదేమిటి? యిట్లా యెట్లా గుర్తు పెట్టుకొని వుదాహ-ంచారు" అని, ఆయన " యేమో మరి! ఆయన జపం చేస్తువుంటారు. ఏదైనా వుపాసనా బలమేమో? " అన్నారు. తరువాత నేనూ, ఆయనా చాలా సార్లు మాస్టరు గారిని కలుస్తూ వుండే వాళ్ళం. ఆయన రామాయణం విన్పిస్తూ వుండేవారు. వారి రామాయణం నేను తొలుతగా విన్నది పూర్వం చెప్పిన గుడివాడ సభలోనే. అప్పుడు బాలకాండ వ్రాస్తూ వుండే వారు. ఆ రోజున గుడివాడలో మేనకా విశ్వామిత్ర ఘట్టం చదివారు.

కోకిల కొమ్మలో కూసిన నీవటే
నన్ను పిల్చితి వంచు నవ్వు మౌని
తుమ్మెద పాదలోన ఝుమ్మన నిది యేమి
మణితమే యని మేల మాడు మౌని

ఆ గుడివాడ సభలోనే కాదు, యెక్కడ చదవనీ, యెప్పుడు చదవనీ ఆయన రామాయణ పఠనం శ్రోతలమీద సమ్మోహనాస్త్రమే. దీన్ని గురించి చాలాచెప్పవలసి వుంది. ఆ రోజుల్లోనో అంతకంటే వొక యేడాది ముందుగానో గుర్తులేదుగాని ఆంధ్రపత్రికలో 'వేయిపడగలు' ప్రతి ఆదివారం సారస్వతాను బంధంలో పడుతూ వుండేది. వేయి పడగలకు పూర్వం చెలియలికట్ట పడింది. చదవాలంటే పత్రిక దొఱికేది కాదు. వేయి పడగలతో పత్రికకు బాగాగిరాకీ పెరిగింది. రామమోహన లైబ్రరీ వసారాలలో ఆ పత్రిక వేసుకు కూర్చుని వొకళ్ళ బుజాల మీద నుండి వొకళ్ళు తొంగిచూస్తూ పది మంది చొప్పున గుంపుగా చేరి చదువుతూ వుండేవారు. ఒక గుంపు తరువాత, యింకొకగుంపు పత్రిక కోసం పడిగాపులు కాసేవారు. లైబ్రరీ మూస్తేనే పత్రికకు విశ్రాంతి. అట్లా యెగబడి చదివేవారు, దాంతో సత్యనారాయణగారికి

బాగాపేరు వచ్చింది. మాష్టరు గారే వొకమారు చెప్పారు ఆయన అనుభవం. మధ్యాహ్నం భోజనానంతరం, వొకగంట నిద్రపోయి లేచింతరువాత కాఫీ తాగి వక్కపొడి వేసుకుని అలా నులకమంచంలో పడుకునే డిక్టేట్ చేస్తూ వుండేవారు. ఆయన తమ్ముడు వెంకటేశ్వర్లుగారు వ్రాస్తూ వుండేవారు. ఇట్లా వొకనెల - ముప్పై రోజులున్నూ, ముప్పైప్రకరణాలు, వేయిపేజీలు డిక్టేట్ చేసినట్లు చెప్పారు. తరువాత తరువాత నాకు మాష్టరుగారితో సాన్నిహిత్యం యేర్పడిన తరువాత ఆయన డిక్టేట్ చేస్తుంటే ప్రక్కన కూర్చుండి చూస్తుండేవాడిని. ఒక సమాధిలో వున్నట్టు చకచకా చెప్పేస్తూ వుండేవారు. నేనాయనను అడిగాను "ఏమండీ యిది అంతా ముందు ఆలోచించి పెట్టుకుంటారా" అని, "నవల అంటే దానికొక ప్లాట్ ఆలోచించుకుని ప్లాన్ వేసుకుని చెపాలి గదా! అది అంతా మీరు చేస్తున్నట్లు లేదేమని". ఆయన అనా ః గదా! "యేవో కొన్ని నవలలకు మాత్రం ప్లాన్‌లాంటిది ప్లాట్ లాంటిది అనుకుంటాను. కొన్నింటికి అదీలేదు". అని "మరి యెలావ్రాస్తారు? మీ రచనలో ఆద్యంతాల జిగింపు బాగానే వుంటుందే! ఆలోచించకుండా యెలా చేస్తారు" అన్నాను. ఆయన "చెప్పాను గదా అది అంతా వ్రాయటంలోనే వస్తుంది" అని అన్నారు ఎలా వస్తుందో నేను పరీక్షగా చూస్తుండే వాడిని. తరువాత దాంట్లోని కిటుకు నాకు అర్థమైపోయింది.

"వేయిపడగలు" ఆ రోజుల్లో అట్లా ఆంధ్రపత్రికలో చదివిన వాణ్నే నేను. పుస్తక రూపంలో చదివినవాణ్నికాదు. వేయి పడగలతో ఆంధ్ర పత్రిక సర్క్యులేషన్ బాగా పెరిగింది. మాష్టరుగారికివచ్చిన డబ్బుమాత్రం యేమిలేదు. ఒక వేయి కాపీలు మాత్రం యిచ్చారట. ఒకవేయికాపీలు పత్రిక వారే వేసుకొన్నారని విన్నట్లు గుర్తు. కాపీఖరీదు రెండున్నర రూపాయలు, "commercial links" అని ఒక పుస్తకాల షాపు వుండేది గవర్నరు పేటలో, అక్కడ బోర్డుపెట్టి అమ్ముతుండేవారు. ఈ "వేయి పడగలు" నవల గురించి మాష్టరుగారు వొక కధ చెప్తుండేవారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు సమకాలికమైన తెలుగు దేశాన్ని, సంస్కృతిని, సంఘాన్ని ప్రతిబింబింపజేస్తూ వ్రాసిన వెయ్యి వ్రాత పేజీల సాంఘిక నవలకు వెయ్యిరూపాయలు పారితోషికం యిస్తామని ప్రకటించారు. దానికి ముగ్గురు జడ్జీలు. అందులో ఒకరు అప్పుడా యూనివర్శిటీకి ఉపాధ్యక్షుడుగా నున్న రాధాకృష్ణయ్యగారే. రాధాకృష్ణన్‌గారి అల్లుడు మదరాసులో మాష్టరుగారిని కాక తాళీయంగాకలిసి మీ పుస్తకానికి ప్రైజు వస్తుందని అభినందించారు. తరువాత యేమైందో యేమిటో గాని ఆ వేయిరూపాయలకి యింకోయాభై రూపాయలు కలిపి అడివి బాపిరాజుగారికి 550, మాష్టరుగారికి 500యిచ్చారట. "ఐతే యిందులో అడవి బాపిరాజుగారిదేమిలేదు, అతను చాలా అమాయకుడు. అతనిని గురించి నేనేదో చెడ్డగా అన్నట్లు యెవళ్ళో చెప్పారట.బాపిరాజు నేను చాలా స్నేహితులం. అతను బాధపడటం నాకు విచారం కలిగించింది. దానిమీద అతనిని తీసుకుని మద్రాసు నుంచి బరంపురందాకా తిరిగి అతనూ నేనూ వుపన్యాసాలు చెప్పాం. అట్లా అతని మనస్సులోని కష్టం తీసివేయగల్గాను అని అన్నారు మాష్టరుగారు నాతో. బాపిరాజుగారు వ్రాసిన నవలపేరు నారాయణరావు దానికీ ఆ రోజుల్లో బాగా ప్రచారం వుండేది. కానీ అది ఆంధ్రదేశంలో వేయిపడగల మాదిరిగా పల్లె పల్లెకు, యింటింటికి చొచ్చుకుపోలేదు.

మాష్టరుగారు యేది వ్రాసినా దానిలో చదివించేశక్తి అనంతంగా వుంటుంది. చదవటం మొదలుపెడ్తే పాఠకులు బండీమీద పోయినట్లు పోవలసిందే. మఱి ఆయన రచన సామాన్యంగా వుంటుందా? తేలిగ్గావుంటుందా? మధ్య మధ్య చాంతాడులాంటి సమాసాలు, పెద్ద పెద్ద వర్ణనలు, విమర్శలు, వుపన్యాసాలు, తర్కాలు, తుంచడాలు, ముడిపెయ్యడాలు వుంటావుంటవి. పాఠకుడికి పాండిత్యం యేమీలేకపోయినా అక్షరజ్ఞానం వున్నవాడైతేచాలు ఒక ముక్కకూడా వదిలిపెట్టకుండా చివరంటా చదువుతాడు. ఎవరేమి విమర్శించినా యీ శక్తి ఆయనలో అనంతంగావుంది.

1947లో ఆంధ్ర విశ్వవిద్యాలయం కాలేజీల్లో వున్న తెలుగు అధ్యాపకుల తరపున సెనేట్ సభ్యత్వానికి పోటీ జరిగింది. ఆ పోటీకి యిద్దరే అభ్యర్థులు. ఒకరు పింగళి లక్ష్మీకాంతంగారు, రెండో వారు సత్యనారాయణగారు. లక్ష్మీకాంతంగారు చాలా బలమైన అభ్యర్థి. విశాఖపట్టణం నుండి నెల్లూరు దాకా వున్న కాలేజీల్లో వున్న తెనుగు చెప్పే వుపాధ్యాయుల్లో చాలాభాగం ఆయన శిష్యులే. ఆయనంటే భక్తి ప్రపత్తులున్న వాళ్లే. మాష్టరుగారికి కొంతమంది అభిమానులు లేకపోలేదుగాని వీరిసంఖ్య చాలా తక్కువ.

లక్ష్మీకాంతంగారికి శిష్యవర్గాన్ని తోడు పదును పెట్టి ప్రయోగించగల శక్తి కూడా బాగా వుంది. మాస్టరుగారికి అవన్నీ తెలుసు. తెలిసినా పోటీకి నిలబడ్డారు. ఆ రోజుల్లో రాజకీయాలేమిటో నాకు తెలియవు. ... ప్పు. ఆయన ఒక రోజున బందరు వచ్చారు. మా యింటికి ... కలసి ప్రారంభం కాలినడకనే తిరిగాము. అప్పుడు రిక్షాలుంటూ ... ండేవి యెక్కుదన్నా ... వుండేదేమో. ఓటర్ల యిళ్లు తిరిగిన తరువాత ఆయనతో రైలుస్టేషనుకి వెళ్ళి రైలెక్కించాను. త్రోవలో మా సంభాషణ అంతా రామాయణం మీదే నడిచింది. స్టేషన్ ముందు నేనన్నాను. "ముందు కాలాల్లో మీ రామాయణం మీద సిసలైన విమర్శయేదన్నా జరిగితే అది ఒక్కటే, అది ఏమిటంటే రామాయణంలో మీరు మీ వ్యక్తిత్వాన్ని మరుగుపరుచుకోలేక పోయినారనేదే" అని. ఆయన నా వంక చిత్రంగా చూసి "అది నిజమే. దానికి కారణం చాలా వుంది. తెనుగు కవిత్వం వృద్ధి పొందిన తీరువేరు. ఇందులో కవి వ్యక్తిత్వమే ప్రధానం. అది లేకపోతే చప్పగా తయారై వూరుకుంటుంది. తెలుగులో ఒక్కొక్కకవి వాడి మార్గం వాడిదేనన్నట్లుగా పరాకాష్ఠను పొందిన రచనను చేసిన వాళ్ళేనిలిచారు. అట్లాంటి విశిష్టమైన మార్గం ప్రత్యేకింగా ఒకటి వుంటే తప్ప యేవరూ నిలవలేరు. అందుచేత impersonalise చేయడమనేది, వాల్మీకికి, నన్నయగారిని వదిలిపెడ్తే యింకొకరికి సాధ్యమయ్యేది కా" అన్నారు. సంస్కృతంలో కూడా, వాల్మీకి తరువాత, ఒక కాళిదాసును వదిలేత్తేక్కిన వాళ్ళంతా యిట్లాంటి వారే. ఇట్లాంటి Back groundతో impersonalise చేయడమనేది కుదిరేది కాదన్నారు. తరువాత రెండు మూడు రోజులవరకు ఆయన చెప్పిన అంశాల మీదే నా మనస్సు తిరుగుతూ వచ్చింది. ఎన్నికల్లో మూడు వోట్ల తేడాతో మాస్టరుగారే గెల్చారు. అందరికీ ఆశ్చర్యమేసింది! లక్ష్మీకాంతంగారేమిటి వోడిపోవటమేమిటని. నిజంగా యీ గెలుపు మాస్టరుగారిది కాదు. దివాకర్ల వెంకటావధానిగారిది. ఆయన నేపథ్యంలో చాలా పని చేసివున్నారు. ఆయన ముఖ్యంగా లక్ష్మీకాంతంగారి శిష్యుడే అయినా రాజకీయాల ప్రభావంవల్ల ఆయన మాస్టరుగారిని పురిగొల్పి నిలబెట్టడం, గెలిపించడం జరిగింది. నాకప్పుడు తెలిసింది దివాకర్ల వెంకటావధానిగారి రాజకీయ నైపుణ్యం, కార్యదీక్షను. మాస్టరుగారూ కొంత కృషి చేశారనుకోండి. ఆయన మూడేళ్ళు సెనేట్ మెంబరుగా వున్నారు. ఒక తడవ సెనేట్ మీటింగుకి హాజరు కావటానికి మేడమెట్లు యెక్కుతుంటే రామలింగారెడ్డిగారు దిగుతున్నారట. మేస్టరుగారితో బాటు యింగా యిద్దరు ముగ్గురు యెవరో వున్నారట. వారందరినీ చూచి రామలింగారెడ్డిగారు "ఓ హో! యివ్వాళ సెనేట్ మీటింగు వుంది కాబోలు. నేను మదరాసుకు రైలుకు పోతున్నాను. అయినా ఏ మున్నాయి? అన్నీ అఫిషియల్ రిజల్యూషన్సే మీరు మీTA, DA లను తీసుకుని వెళ్ళ వచ్చు" అని. ఇట్లాంటి సంఘటనే ఒకటి మాస్టరుగారు కేంద్ర సాహిత్య అకాడమీలో మెంబరుగా వున్నప్పుడు జరిగిందట. అప్పుడు మాస్టరుగారితో బాటు, నార్లవెంకటేశ్వరరావుగారు కూడా వున్నారట. అప్పుడు జవహర్‌లాల్ గారు సరిగ్గా రామలింగారెడ్డిగారు అన్నట్లే అని వెళ్ళి పోయినారట. వేంకటేశ్వరరావుగారు "మరి యింతదూరం మనం యెందుకు వచ్చినట్లు"? అని అన్నారట. మాస్టరుగారు మీరెందుకు వచ్చారో నాకు తెలీదు. నేను మా అబ్బాయిని చూడటానికి వచ్చాను అన్నారట. ఈ సంఘటనను చెప్పి మాస్టరుగారు వ్యాఖ్యానిస్తూ వుండేవారు, "ఇదిగో యిదీ, డెమోక్రసీ అంటే!" అని.

వేంకటేశ్వరరావుగారికి గొప్ప జర్నలిష్టని పేరువుంది. తెలుగులో సంపాదకీయం వ్రాస్తే ఆయనే వ్రాయాలి అనే విషయం సరే అనుకోండి. భాషకూడా పటువుగా వుండేది. తెలుగు పదాలకంటే సంస్కృత పదాలే యెక్కువగా వాడేవారు, కానీ వీరికీ మాస్టరుగారికీ పడేదికాదు. వీరు ఆంధ్ర ప్రభకు సంపాదకులుగా వున్నప్పుడు సంస్కృత భాషకు వ్యతిరేకంగా పదోపదకొండో సంపాదకీయాలు వ్రాశారు. తరువాత అనతి కాలంలోనే వీరు ఆ పత్రికలోంచి బైటికి వచ్చారు. తరువాత 'ఆంధ్రజ్యోతి' అనే పత్రిక వచ్చింది. దానికి వీరే సంపాదకులుగా సంపాదకీయాలు వ్రాసినట్లుగుర్తు. ఒకతడవ యేదో మీటింగు జరుగుతోందట. ఆ మీటింగులో మాస్టరుగారు, వీరుకూడా మాట్లాడవలసివుందట. ఆ సభలో మాస్టరుగారు, వీరు వచ్చేసరికి వేదిక మీద మరి కొంత మంది పెద్దలతోబాటు ఆసీనులై వున్నారు. వేంకటేశ్వరరావుగారికి కాలుమీద యేదో గాయమై వేదిక యెక్కలేక పోయారట. మాస్టరుగారు చేయి అందిచ్చారట. వేంకటేశ్వరావుగారు "వొద్దులెండి, మీ సాయం నాకు అక్కరలేదు. మీ అభిప్రాయాలు వేరు. నా అభిప్రాయాలు వేరు"

న్నారట. దానిమీద మాస్టరుగారు నవ్వి అన్నారట. "ఎందుకండీ అంతకోపం. మీ అభిప్రాయాలు మీ కావు. నా అభిప్రాయాలు నావీ కావు. మీరే originators కారు. అటువంటప్పుడు మనం పోట్లాడుకోవటం యెందుకు? ఫలమేలేదుకదండీ" అని పైకి అన్నారట, కానీ వెంకటేశ్వరరావు గారికి మాస్టరు గారి మీద కోపం పోనే లేదు. మాస్టరుగారు పరమపదించిన తరువాత కూడా ఆయన మీద నిందా పూర్వకంగా సంపాదకీయాలు వ్రాశారు. చాలా రోజులు విద్వేష పూరితమైన జాబులు కూడా ప్రకటించారు. ఈ ప్రసంగమంతా దాదాపు వొ నెలరోజులు కొనసాగించారు. తరవాత వెంటనే ఆంధ్రజ్యోతిలో నుంచి యే కారణం చేతనో వారుబయటకు రావటం జరిగింది. అయినా వీరికి వైరం శాంతించ లేదు. మరణాంతాని వైరాణి అని వున్నా అది వీరి విషయంలో వర్తించలేదు, తరువాత కూడా హైదరాబాదులో వో సభపెట్టించి మాస్టరుగారంటే గిట్టని వాళ్ళచేత వుపన్యాసాలిప్పించారట... డాక్టర్ సి.నారాయణ రెడ్డిగారు మాస్టరుగారు దివంగతులైనప్పుడు "హిమాలయ పర్వతశిఖరం విరిగి పడి పోయింద"న్నారట. చాలా బాగా అన్నారాయన. ఆ మాట అన్నందుకు ఆయన్నికూడా విమర్శించారట యిలాగే, "మీ అభిప్రాయాలకి ఆయన అభిప్రాయాలకి పడవుగదా అటా యెందుకన్నా" రని. దానిమీద ఆయన "చచ్చిపోయిన వాళ్ళని సంస్మరించేటప్పుడు తిట్టే సంస్కారం కాదు నాది. ఆయన నిజంగా తెలుగు సాహిత్యంలో హిమాలయపర్వత శిఖరం లాంటివాడే. ఆ మాటే అన్నాను" అన్నారట. ఈ ఉదంతాన్ని గురించి నేను వ్రాసిన దాంట్లో యెంతవరకు సత్యాసత్యాలున్నాయో నాకు తెలియదు. నేనా సభకు వెళ్ళలేదు. కర్ణాకర్ణిగా విన్నదాన్ని బట్టే వ్రాశాను.

మాస్టరుగారికి తెలుగు సాహిత్య లోకంలో మిత్రులో, శత్రువులో తప్ప మధ్యస్థులంటూ వుండేవారుకాదు. అందులో శత్రువులే యెక్కువ అని చెప్పవచ్చు. ఒక తడవ తెనాలిలోనో, మరేదో దానిదగ్గరి గ్రామంలోనో ఒకసభలో మాస్టరుగారు ప్రసంగించవలసివుంది. వారికి ముందు వక్త వకరు పురాణప్రసక్తి తెచ్చి "అగ్రకులంవారు తక్కిన కులాలవాళ్ళని అణగద్రొక్కి మహాపాపం చేశా" రన్నారు. తరువాత మాస్టరుగారు ప్రసంగిస్తూ "అవును నిజమే ఆ చేసిన పాపానికి అప్పటి ఆ బ్రాహ్మణులంతా యిప్పుడు అబ్రాహ్మణులై పుట్టారు. అప్పటి అణగద్రొక్కబడ్డ అబ్రాహ్మణులంతా ఆ పుణ్యానికి యిప్పుడు బ్రాహ్మణులైపుట్టారు. పుట్టినాకూడా వాళ్ళ కష్టాలు తీరాయికాదు. అప్పుడు బ్రాహ్మణులై, యిప్పుడు అబ్రాహ్మణులై కూడా మీరు మమ్మల్ని అణగద్రొక్కుతునే వున్నారు" అన్నారట. సభ అయిపోయిన తరువాత, "ఒరెయ్ మా బాగా అన్నాడ్రా, యీయన్ని షూట్‌చేసి చంపాలి తప్ప దీనికి వేరేసమాధానం లేదు" అని ఒక యువకుడెవరో అన్నాడటకూడా.

మాస్టరు గారి అభిప్రాయాలతో యేకీభవించని వారిలో కూడా మాస్టరుగారి కవిత్వాన్ని మెచ్చుకునే వారు చాలా మంది వుండేవారు. ఎవరో యెందుకు? స్వర్గీయ త్రిపురనేని రామస్వామి చౌదరి గారే వున్నారు. మాస్టరు గారు 'వేనరాజు' అను నాటకం వ్రాస్తే దానికి ప్రతిగా వారు 'ఖూని' అనే నాటకం వ్రాసి పీఠికలో యిలా వ్రాశారు. "విశ్వనాథ సత్యనారాయణ గారు జీనియస్ కాదని చెప్పటం కోసం కాదు నేనీ నాటకం వ్రాసింది. ఆయన చెప్పదలచుకొన్న విషయం మాత్రం నేనంగీకరించను అని తెలపటానికి మటుకే" అని, మాస్టరుగారికి కావలసిందీయిదే. "చెప్పిన విషయమేదైతే నేం? ఆ విషయాన్ని ఆధారంఅని తెలపటానికి మటుకే" అని, మాస్టరుగారికి కావలసిందీయిదే. "చెప్పిన విషయమేదైతే నేం? ఆ విషయాన్ని ఆధారం చేసుకొని కవి వెలయించిన కావ్య సౌందర్యం చూడండి" అని అనే వారాయన. రావస్వామిచౌదరి గారికే కాక ఆయన కుమారులు సుగ్రహీత నామధేయులు స్వర్గీయ త్రిపురనేని గోపీచంద్‌గారికి కూడా మాష్టరుగారంటే చాలా గౌరవాభిమానాలు వుండేవి. వారు హైదరాబాదులో All India Radio లో ప్రొడ్యూసరుగా వున్నప్పుడు ఆంధ్ర సాహిత్యం మీద కొన్ని నాటకాలు వ్రాయించాలని వక ప్రతిపాదన వచ్చింది. అప్పుడు అన్ని విషయాలకి సంబంధించిన ప్రొడ్యూసర్లందరూ కలసి ఎవరిచేత వ్రాయించాలో నిర్ణయించడానికి వక మీటింగు పెట్టుకొన్నారు. ఆ మీటింగులో వక్కొక్కరిని ప్రతిపాదించారు. గోపీచంద్‌గారు మాత్రం మాట్లాడకుండా కూర్చున్నారు. ఒకరు ప్రతిపాదించిన వారిని తక్కినవారు అంగీకరించలేదు. చివరికి వారు నిర్ణయం కుదరక గోపీచంద్‌గారిమీదే ఆ భారంపెట్టారట. దాని మీద ఆయన "మీరెవరూ చెప్పని వ్యక్తి ఒకరున్నారు. ఈ నాటకాలు వ్రాయటానికి ఆయనే సమర్థుడు. ఆయనపేరు విశ్వనాథ

సత్యనారాయణ" అన్నారు. మరి గోవిందంగారు చెప్పటంవల్లనో యేమోగాని అందరూ ఆ నిర్ణయానికి అంగీకరించారు. ఆ నాటకాలు రేడియోలో ధారావాహికంగా వచ్చాయి. వాటికి జనాదరణం కూడా వచ్చింది. ఎంత బాగా వచ్చిందంటే అంతకు పూర్వం శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి గారి ద్వారా మాస్టరు గారి మీద పెద్ద గాలి దుమారం లేపిన భారతి పత్రిక వారే మాస్టరు గారికి బంధువులైన గోవిందలూరి సాంబశివరావు గారిని పంపి ఆ నాటకాలు భారతిలో ప్రకటించుకోవటానికి తెప్పించుకున్నారు. సాంబశివరావుగారు చెప్పిన పేరానికి రెట్టింపు యిస్తే తప్ప నాటకాలు యివ్వడానికి మాస్టరుగారు ఒప్పుకోలేదు. తరువాత నేను మాస్టరుగారిని కలిసినప్పుడు అడిగాను. "మళ్ళీ ఆ పత్రికకు మీ నాటకాలెందుకిచ్చారని." ఆయన "ఊరికేయిస్తానా పేజికి యేంచేస్తే సరిపోతుందో ఆలోచించే యిచ్చాను. ఊరికే యివ్వలేదు" అన్నారు

అసలు సదరు కొత్త సత్యనారాయణ చౌదరిగారు వారి విమర్శ 'తెలుగు విద్యార్థి' అనే పత్రికలో మొదలు పెట్టారు. అప్పుడు మేము కరీంనగరంలో వున్నాము. మాస్టరుగారు అక్కడి కాలేజీలో ప్రిన్సిపాలు, నేను తెలుగు సంస్కృతాలలో లెక్చరర్ని. ఒకరోజున ఆ వూళ్ళో వున్న చింతల నరసింహులు & సన్స్ అనే పుస్తకాల కొట్టుకు నేను, మాస్టరుగారు, గౌతమరావుగారు కలిసివెళ్ళాము. అక్కడా యీ తెలుగు విద్యార్థి పత్రిక మాకు కన్పించింది. దాంట్లో మాస్టరుగారి మీద విమర్శపడిందని యెవరో చెపితే నేను తీసి చదువుతున్నాను. గౌతమరావు "ఎవరో యేదో వ్రాస్తే అదంతా మనం చదవటమేమిటి" అని రెండు మూడు మాట్లు నన్ను వారించారు. ఇంకా నేను చదువుతూ వుండటం మాస్టరుగారు గమనించి నాచేతులో నుంచి ఆ పత్రిక లాక్కుని సైడు కాలవలో పారవేశారు. తరవాత భారతిలో ఆ విమర్శ వస్తున్నా మేమెవరం పట్టించుకోలేదు. తరువాత వుద్యోగమై పోయి మాస్టరుగారు విజయవాడ వచ్చారు. మదరాసులో యేదో సభ జరిగి, ఆ సభలో సత్యనారాయణగారు భారతిని యేదో దుయ్యబట్టడం జరిగింది . దాని మీద భారతి దిన పత్రికలో వివాదం ప్రారంభించారు. దాంతో వాదప్రతివాదాలు చెలరేగినవి. మాస్టరుగారికి కూడా బాగా ఆవేశం పెరిగి సమాధానాలివ్వడానికి పూనుకున్నారు. ఒంగోలునుంచి వావిలాల రామమూర్తిగారి వొకరు, రాజమండ్రినుండి మల్లంపల్లి శరభయ్య, చెఱుకుపల్లి జమదగ్ని శర్మగారు కూడా వాదాల్లో దిగారు. నేను వక్కణ్ణే వూరుకుంటే యేం ప్రయోజనం? నాకూ వ్రాయక తప్పిందికాదు. వివాదం అంటూరాకుండా వుండాలిగాని వచ్చిన తరువాత ఆవేశాలు పెరగక మానవు. ఈ వివాదాలు ఒక్క సారస్వతానికి సంబంధించి వుంటే బావుండును. అట్లావుండవు, తీగలాగితే డొంకంతా కదిలినట్లు అనేక విషయాలు వస్తవి. రాగద్వేషాలు, కోపతాపాలు చివరికి యివి ప్రధాన మౌతాయి. అసలు విషయం మరుగునపడిపోతుంది.

ఐతే క్రొత్త సత్యనారాయణ చౌదరిగారు చదువుకున్నవారే. తెలీని వారు కాదు. అంతకు పూర్వం వారితో నాకు కొలది పరిచయమేవున్నా, మాస్టరుగారంటే ఆయనకు కూడా బాగా గౌరవం వుండేది అని చెప్పటానికి తగినంత నిదర్శనం ఆయన వ్యాసాల్లోనే కన్పిస్తుంది. మాస్టరుగారిలో ఆయన చూపించిన తప్పులన్నీ నిజంగానే తప్పులని ఆయన భావించి వుండరనే యిప్పటికీ నా అభిప్రాయం. ఆయన ఒకరు, శ్రీతుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ఒకరు, స్వభావాల్లో అంతరం వున్నప్పటికీ – తెలుగు సంస్కృత సాహిత్యాలు చక్కగా చదువుకున్నవారని, అందులో వ్యాకరణం బాగా వ్యాసంగం చేసిన వారని సందేహం లేకుండా చెప్పగలను. వీరిద్దరూ స్వభావం చేత సాధువులేగాని, సీతారామమూర్తి చౌదరిగారు తమ వుపన్యాసాల్లోగాని, వ్రాతల్లోగాని ఎవర్నీ గూడా పల్లెత్తు మాట అన్నట్లు నాకు గుర్తులేదు. కాబట్టి యీ వివాదం ప్రారబ్ధంలో వుంది కాబట్టి వచ్చిందేతప్ప మరొకటి కాదని నేననుకుంటాను. కాకపోతే 'చిద్గగన ప్రాలేయాంశువు' అన్నచోట రేఫసంయుక్త పూర్వాక్షరానికి గురుత్వం వైకల్పికమని ఆయనకు తెలీదా? అయినప్పటికీ దానితోనే మొదలు పెట్టారాయన. మాస్టరుగారుకూడా దానినే నిగ్రహస్థానం చేశారు. ఈ ఒక్క విషయం మనం విచారిస్తే చాలు, యిదంతా పిల్ల సమ్మేరీ తప్ప మరొకటి కాదని తేలిపోతుంది. ఇది పాండిత్యానికి సంబందించిన వ్యవహారం అసలేకాదు. ఐతే మాస్టరుగారి రచనలలో తప్పులంటూ వుండవని, చౌదరిగారు చూపించిన వన్నీ తప్పులు కాదని మాస్టరుగారూ అనలేదు. ఆయన్ని సమర్థించినవారూ అనలేదు. కొన్నితప్పులు ఎప్పుడూ వుంటాయి. ఏవరిలోనైనా వుంటాయి. మాస్టరుగారిలోను వున్నాయి. చౌదరిగారు ఎత్తి చూపించిన వాటిల్లో కొన్ని దోషాలు ఒప్పుకోదగ్గ వున్నాయి.

వారైతే టిని 'అక్షర్స్యాత్ సాధుః' అంట . ఋషి కల్పులైన మహాకవుల్లో వారైతే 'నిరంకుశాః కవయః' అంటాము. వ్యాకరణాన్ని మీరి ప్రయోగాలు చేయడమనేది సంస్కృత కవుల్లోను తెలుగు కవుల్లోను బాగా పరిపాటిలోనున్న విషయమే. ప్రయోగమంత్రేణపలాయంతే వైయ్యాకరణపిశాచాః" "ప్రయోగమూలం వ్యాకరణం" మొదలైన ఆభాణకాలు వుండనే వున్నవి. అష్టాధ్యాయి సూత్రాలకు లొంగని బహుమహాకవి సమ్మతమైన ప్రయోగాలకు వార్తికాలు వ్రాసి గతి కల్పించారు. తెలుగులో మాట చెప్పేదేమిటి? చెళ్ళ పెళ్ళ వెంకట శాస్త్రులుగారు

వ్యాకరణ మొక్క త్రోవ మ
హాకవులొక త్రోవ, కోశమఖిలమ్మొక త్రో
వై కన్పించెడి - నీ భా
షా కావ్యమ్ములను తజచి చదివిన కొలదిన్.

అని వ్రాశారు. గిడుగు రామమూర్తి పంతులుగారి 'బాలకవిశరణ్యమ్' మాట చెప్పనక్కరలేదుగదా ఇట్లాంటి సందర్భంలో చిన్నయసూరి 'బాలవ్యాకరణం' చేత్తో పట్టుకుని చిన్న పిల్లల కాంపోజిషన్లు దిద్దినట్లు మహాకవులను దిద్దబోవటం, పూచిక పుల్లను చేత్తోపట్టుకుని అర్జునుని మీదకు యుద్ధానికి పోవటం లాంటిదే.

ఐతే ఆ వ్యాసాల్లో చౌదరిగారు చూపించిన పురోభాగిత్వం వారి మిత్రులలోనే చాలా మంది వప్పుకోలేదని వానిమీద వారు కూడా పశ్చాత్తాపం ప్రకటించారని విన్నాను. మాష్టరుగారు మదరాసు సభలో భారతి స్థాయిపడిపోయిందని అన్నారట. ఆయన యెందుకన్నారో మఱి బాగా బాధపడి అని వుంటారు. అప్పటికీ, యిప్పటికీ భారతికి అంతకు పూర్వం వున్నస్థాయి మళ్ళీరానేలేదు. పత్రికవారు, తదితరులు నిలబెట్టటానికి యెంత ప్రయత్నం చేసినా మహాకవి వాక్కు "మైలనభీము ఖడ్గమును మారన వాక్యము రిత్తవోవునే!".

మాష్టరుగారి దగ్గర నిగ్రహానుగ్రహాలు రెండూ వుండేవి. గుంటూరు జిల్లాలో అదేదో ఊరు పేటపాలెమో, మున్నంగో మరేదన్నానో! వానలు లేవు. ఆ వూరి వారు మాష్టరుగారిని తీసుకు వెళ్ళారట. మీరు రామాయణం వ్రాస్తున్నారుగదా! వాన కురిపిస్తారాని అన్నారట. ఆయన సరే చూద్దామని ఋష్యశృంగుని చరిత్రం చదివారట.

"ఆ రథమేగు త్రోవ జలదావళిమింట"

అనే పద్యం చదవటం మొదలు పెట్టేసరికి మేఘాలు క్రమ్ముకు వచ్చాయట. ఆ రాత్రి కుంభ ద్రోణంగా కురిసిందట. ఇల్లా రెండు మూడు గ్రామాల్లో జరిగిందని ఆయన నాకు చెప్పారు. ఇది నాకు పరోక్షమనుకోండి. ప్రత్యక్షంగా జరిగిందే ఒక వుదంతమున్నది. అది వేసవి కాలం. ఒక రోజున సాయంకాలం అంటే మూడు నాల్గుగంటలవేళ మాష్టరు గారింటికి వెళ్ళాను. బాగా వడగా వుంది. ఆయన లోపల పడుకుని వున్నారు. నేను వచ్చానని చెప్తేనన్ను లోపలికి రమ్మన్నారు. "బాగా యెండగా వుందయ్యా ఏ కోశానా చల్లదనం లేదు. ప్రాణం ఆగే ట్టు లేదు. అందుకని యిక్కడే కూర్చో" అన్నారు. "భారతంలో వ్యాస మహర్షి ఋష్య శృంగ చరిత్రంవ్రాశాడు చదివావా" అన్నారు. చదవలేదన్నాను. "సరే విను వానకురుస్తుందేమో చూద్దాం. ఎంతబాగా వ్రాశాడనుకున్నావ్" అని చదవటం మొదలు పెట్టారు. వ్యాసుడు కథ చాలా చమత్కారంగా వ్రాశాడు. ఇప్పుడు మనం పంటులంటామే, అట్లాంటి పడవలు కలిపికట్టి వాటిమీద మట్టిపోసి మామూలు నేలమీద పెరిగిన ట్లుగానే ఒక కృత్రిమవనాన్ని తయారు చేశారట. దానిని ఆ ప్రక్కన వున్ననదిలో నిలిపి వేశ్యలు ఋష్యశృంగుణ్ని ఆ వనంలోకి తెచ్చి అతనికి తెలియకుండా రోమపాదుని నగరానికి తీసుకుని వచ్చారట. మాష్టరుగారు కథ చదువుతున్నారు. వ్యాఖ్యానం చేస్తున్నారు. ఇక్కడికి వచ్చేసరికి అమ్మయ్య ప్రాణం చల్లబడింది. కాస్త చల్లగాలి తిరిగింది. బయట కూర్చుందాం పద అన్నారు. మళ్ళా కథ మొదలు పెట్టారు. కథ నడిచిన కొద్దీ వాతావరణం బాగా చల్లబడింది. ఒక పదిహేను, యిరవై నిమిషాలు ఒకమాదిర్ని జల్లు పడింది. పెద్దవర్షమైతే కాదుగాని వొకబట్ట తడుపు జల్లు కంటే పైగానే పడింది. అమ్మయ్య యివ్వాలిటికి ప్రాణం నిలిచిందన్నారు. ఆ మరునాడు ఎండ క్రితం రోజు అప్పు తీర్చింది. కారాలు మిరయాలు నూరిపోసింది. ఆనాడు కూడా క్రితం నాడుకు మల్లేనే నేను

మాస్టరు గారింటికి వెళ్ళాను. ఆయన నన్ను లోపలకు పిలిచి "ఏమయ్యోయ్ నిన్నటివారడి యివ్వాళ వాపేస్తోంది. ఏట్లావచ్చా" వన్నారు. "మీరు వాన కురిపిస్తారేమో యివ్వాళకూడా చూద్దామని వచ్చా [illegible]" "[illegible] సరే అయితే చూద్దాం కూర్చో" అని ఆ రోజున నన్నయ్యగారు వ్రాసిన ఋష్యశృంగ చరిత్రం చదివారు. [illegible] రోజు మాదిరి గానే సరిగ్గా అంతే ప్రమాణంలో జల్లుపడింది. నాకు కొంచెం ఆశ్చర్యమేసింది. మరునాడు [illegible] హ్నం రెండున్నర మూడింటికి మాస్టరుగారి భార్య వరలక్ష్మమ్మగారు మా యింటికి కంగారుగా వచ్చారు. ఆమె నాకు అక్కగారు, ఆమెకు నేను అన్నగారునున్నూ, "అదేమిటన్నగారు అక్కడ యిళ్ళంటుకుపోయినాయి. మీది పాకాయె, సామాను, బయటకు వేసుకోండి అని చెప్పటానికి వచ్చా" న్నారు. నేను మరేం తొందరలేదు లెండి, అక్కడెక్కడో చుట్టుగుంట దగ్గర గదా తగలడేది. అప్పటిమాటచూద్దాం. మాస్టరుగారు యెల్లావున్నారని అడిగాను. ఆయన ఆపసోపాలు పడుతున్నారని చెప్పగానే నేను మాస్టరుగారింటికి పరిగెత్తాను. కొంత అగ్నిహోత్రుని ప్రతాపం చూద్దామని, కొంత మాస్టరుగారు మళ్ళా వాన కురిపిస్తారేమో చూద్దామని, అప్పటికే ఫైర్ యింజన్లు వచ్చి మంటలతో పోరాటానికి దిగినాయి, గాని నీళ్ళెక్కడవున్నాయి, నేను, మాస్టరుగారూ ఇవ్వాళకూడ వాన కురిపించండి బాబోయ్ ఇళ్లు తగలబడిపోతున్నాయి,మాదిపాకగూడాను అన్నాను. రోజూ కురిపించటానికి నేనేమన్నా దేముణ్నా వాన మనం కురవమంటే కురుస్తుందా? అన్నారు. మీరైతే కురవమనండి, కురిస్తే మనమహిమ లేకపోతే దేముడి మహిమ అనుకుందా మన్నాను. ఐతే యివ్వాళ వాల్మీకం చదువుదాము అని చదివి వ్యాఖ్యానంచేశారు. దాని దుంపతెగ మళ్ళా వానపడింది. తరువాత ఆయన వ్రాసింది కూడా చదివారు. ఇక్కడ మాకూ తాపశాంతి కల్గింది. అక్కడ అగ్నిహోత్రుడికి తాపశాంతిఐంది. ఇల్లాయిదంతా నాకు అనుభవంలో నున్న విషయమే.

విశ్వనాథ శారదనుంచి.



# అన్నదమ్ముల అనుబంధం

నాయని కృష్ణకుమారి

శ్రీ విశ్వనాద సత్యనారాయణ గారికి వారి తల్లిదండ్రులు చేసిన నామకరణం విశ్వనాద సత్యనారాయణ మానాన్న నాయని సుబ్బారావు ఒకసారి 'సుషేప మా అందరిలో చేరి పోవడానికి అడ్డొస్తుందని ఆ పేరి రెండక్షరాలు తీసి పారేశారు' అని 'అయినా నువ్వు బ్రాహ్మడి వంటే నిన్ను నమ్మేదెవరు? నీ నల్ల తోలు ఎవర్నీ ఆ పని చేయనీయదు. నన్ను చూడు తెల్లటి రంగులో నేను సద్బ్రాహ్మణ్ణంటే ఎవరైనా నమ్ముతారు" అని చతుర్లాడేవారు. పైపెచ్చు సత్యనారాయణగారు మన్మథ నామ సంవత్సరంలో పుట్టారు. నాన్న ఈ విషయంలో కూడా హాస్యపు జల్లు చిలుకుతూ "నల్లగా ఉండే నీవు పుట్టిన సంవత్సరం మన్మథ. అందగాణ్ణి నేను పుట్టిన సంవత్సరం వికారి. ఈ రకంగా సంవత్సరాలు నిన్ను బుజ్జగిస్తున్నట్లున్నాయి" అనే వారు.

మా నాన్నకు ఆయన అన్న. తన బహిశ్చర ప్రాణం! 'అన్నా' లనే ఆయన్ని సంబోధించి సంభావించేవారు. ఇప్పుడీ వ్యాసంలో ఆయన పేరు పలుకు తున్నాను కానీ నేను ఎప్పుడూ ఆయన్ని మా పెదనాన్న అనే చెప్పేదాన్ని. ఆయన బిడ్డ స్వాహాదేవి నాకు స్వాహక్క. మిగతా పిల్లలతో నాకు అనుబంధం లేదనను గాని దూరం కొంత ఎక్కువే. వారి రెండో అమ్మాయి దుర్గ, నా జ్ఞాపకాలలో చిన్నపిల్ల. వారి కొడుకు పావని శాస్త్రి నాకు తమ్ముకుర్ర. నన్ను నోరారా అక్కా అని పిలుస్తుండే వాడు. ఈ మధ్య రకరకాల వ్యాపకాల్లో పడి ఊళ్ళోకి వచ్చినా ఈ అక్కకు కనబడకుండా జారుకుంటున్నాడు. మా కుటుంబాలలో పెదతండ్రి భార్యను పెద్దమ్మ అనీ పెద్ది అనీ పిలవడం అలవాటు. కాని ఈ పెదనాన్న గారి భార్యను దొడ్డమ్మా అంటుండే దాన్ని. అది ఆ కుటుంబాల అలవాటు.

నేను పుట్టింది గుంటూరు జనరల్ ఆసుపత్రిలో. ఆ రోజుల్లో మా నరసరావు పేటలో మంచి ఆస్పత్రి లేదు కనుక నన్ను మా అమ్మ గుంటూరులో కనవలసి వచ్చింది. మానాన్నగారు నరసరావు పేట మునిసిపల్ హైస్కూలులో అప్పుడు టీచరుగా పని చేస్తుండే వారు. నా బాల్యం హాయిగా అక్కడే గడిచింది.

మా నాన్నకూ ఈ పెదనాన్నకూ ఉన్న స్నేహం చాలా చిక్కనైనది. చాంద్రీ మసృణశోభతో స్వచ్ఛకాంతుల్ని వెద జల్లుతుండేది.

బెజవాడకూ నరసరావు పేటకూ మధ్యదూరం ఏమంత ఎక్కువైనది కాదు. గట్టిగా లెక్కపెడితే 50 మైళ్ళు కూడా తేలవు. అందువల్లనే ఈ అన్నదమ్ముల మధ్య రాకపోకలు విరివిగానే ఉండేవి. పెదనాన్న మాయింటికి వస్తే అన్నం తినేవారు కాదు. కాని ఇడ్లీ, అందులోకి అనుపానంగా నెయ్యి, కారప్పొడి వేసుకునేవారు. మేము, ఎక్కువగా, నాన్న, అప్పుడప్పుడు నేనుకూడా, వాళ్ళింటికి వెళ్తే, భోంచెయ్యకుండా వెళ్ళనిచ్చేవారు కాదు. కాని మేము ఎప్పుడూ ఆయన సహపంక్తి భోజనం చెయ్యలేదు. మాయిద్దరికీ వంటింటి ముందున్న వసారాలో ఆకులు పరిచి దొడ్డమ్మ వడ్డించేది. మేము తింటున్నంతసేపూ ఆయన పక్క వాటుగా కింద బాసిన పట్టు వేసుకుని మేం సరిగా తింటున్నామా లేదా, ఆదరువులన్నీ అందుతున్నాయా లేదా అని పర్యవేక్షిస్తుండేవారు. మా భోజనాలై లేచాక, ఆయన తాను భోంచేయడానికి వంటింటి వైపుకు కదిలేవారు. మాతోపాటు తినొచ్చుగా అని నేను మనస్సులో అనుకునేదాన్ని గాని అడగలేదు. ఈ విషయం నాన్నను అడిగితే "ఎవరి ఆచారాలు వారివి. వీటిని గురించి మధనపడి మనసు పాడు చేసుకోవడం మూర్ఖులు చెయ్యాల్సిన పని" అని జవాబు చెప్పి ఉండే వారనుకుంటాను. ఇటువంటి వ్యక్తిగత ఆచారాలు, మామధ్య పెనవేసుకుపోయిన ఘనిష్ఠ మానవ సంబంధాలకు ఎప్పుడూసేగి చేయలేదు. నా పెండ్లికి అప్పుడు 150 రూపాయల పట్టుచీర కొని పెట్టింది ఆయనే. అదే నా పెండ్లిచీర. అసలు మా నాన్నగారికీ పెదనాన్నగారికీ పరిచయం బందరులో 1922 లో జరిగింది. బందరు నోబెల్ కళాశాలలో నాన్న బి.యే చదవడానికి చేరారు. జాతీయ కళాశాలలో పెదనాన్న అధ్యాపకుడిగా అవతార స్వీకరణ చేశారు. మా పెదనాన్నగారు నాన కంటే నాలుగు సంవత్సరాలు పెద్ద. ఆయన (1895) మన్మథ నామ సంవత్సర భాద్రపద మాస బహుళ షష్ఠి మంగళవారం జనించారు. మానాన్న వికారి

నామసంవత్సర( 1 8 9 9 ) ఆశ్వయుజ బహుళ దశమి నాడు పుట్టారు. లెక్కగడితే ఇద్దరి మధ్యా వారడి నాలుగు సంవత్సరాల పైచిలుకు.

వీళ్ళిద్దరి అనుబంధానికి కార్యస్థానం బందరే. ఇద్దరి మధ్యా పెనవేసుకున్న ఆత్మీయతకు మూలసూత్రం సాహిత్యమే. మానాన్నగారి జీవితాన్ని సాహిత్య మహత్త్వం వైపుకు తరిమింది నాన్న అనుభవాల గాఢత. మా కుటుంబంలో సాహిత్య పరంగా ఇంత ఉచ్ఛస్థానానికి చేరుకున్న వారు మానాన్నగారొక్కరే. భావకవితా కాయమానానికి ఒక స్థిర స్తంభంగా నిలిచిన ప్రతిష్ఠను ఆయన సంపాదించుకున్నారు.

మా తాతగారు, ఆయన తమ్ములు, నిత్యభారత పఠనాలగ్నమానసులు. సంప్రదాయానికి జీవకర్ర అనిపించుకునే కావ్యాపేక్షణ పైన ఎనలేని మక్కువ గలవారు. ఆ జీవన వృక్షం విడిలిన మానాన్న గారు, చిగురు దశలోనే కవితా నైగనిగ్యాన్ని వెదజల్లడం అబ్బురమైన విషయమేమి కాదు. ఆయన బందరులో బి.య్యే చదువుతున్న రోజులలో, జీవితంలో ఒక ఎదురు దెబ్బను చవిచూడవలసి వచ్చింది. తాను ప్రేమించిన తన మేన మరదల్ని కారణాంతరాల వల్ల తన మేనమామ తనకు ఇవ్వను పొమ్మన్నాడు. ఈ ప్రణయకథ వేయి పడగల్లో చిత్రితమై శాశ్వతత్వాన్ని సంపాదించుకున్నది. విశ్వనాథ తన వేయి పడగల్లో సాక్షాత్కరింపజేసిన మానాన్నగారి పేరు కిరీటి. ఆయన ప్రేమించిన మామ కూతురి పేరు శశిరేఖ. తన ప్రేమను, వియోగాన్ని, ప్రేమసాఫల్యాన్ని, కులపాలికా ప్రణయ మాధుర్యాన్ని, సాహిత్యానికి వెలలేని ఆభరణంగా కైసేసిన ఆయన కావ్యం సౌభద్రుని ప్రణయయాత్ర శ్రీశ్రీ వంటి అభ్యుదయ కవితా సారధి "సౌభద్రుని ప్రణయ యాత్ర చదవాలని తొందర" అని ఆత్రుతను ప్రకటించుకున్నారు. అందులో నాయకుని పేరు సౌభద్రుడు. అతడు మానాన్నే. నాయిక పేరు వత్సల. మహారాష్ట్ర సాహిత్యంలో బలరాముని కూతురు పేరు వత్సల. ఈ మహారాష్ట్ర వత్సల, తెలుగు శశిరేఖ ఇద్దరూ ఒకటే. అందుకే విశ్వనాధవారు వత్సల స్థానంలో శశిరేఖను నిలిపారు. ఈ రెండు పేర్లూ వ్యాసభారతంలో లేనివే. వేయిపడగల్లో విశ్వనాధ కిరీటి పాత్రను చిత్రించిన పద్ధతిలో మా నాన్నరూపు నూటికి నూరుపాళ్ళు అచ్చుగుద్దినట్లుదించారు. అది అతిశయోక్తి దూషితం కానిది. సహజాలంకారానికి ఖచ్చితమైన ఉదాహరణంగా భాసించేది. ఆ తమ్ముని పట్ల ఆ అన్న మనస్సులో ఉన్న రమ్యమైన, ఆర్ద్రతా శోభితమైన, ఆత్మీయమైన, సర్వభావ పారమ్యాన్నీ కుప్పపోసేది. నిజానికి వీళ్ళు నలుగురు మిత్రులు. పాలూ నీళ్లవలె కలగలిసిపోయినవారు. అందరిలోకీ ధర్మారావు వయసులోనూ, తెలివిడిలోనూ ఎక్కువ. ఆయనది తతిమ వారందరికీ అప్రకటిత నాయకత్వం. ధర్మారావు ఎవరోకాదు. విశ్వనాథే. ఒకరు కిరీటిరావు మరొకరు సూర్యపతి, ఇంకొకరు రాఘవరావు – ఈ పాత్రలన్నీ నిజజీవితంలో జీవత్పాత్రలే. వాళ్ళ నిజ జీవితాల్లో మహాభారతమంత కార్యవ్యగ్రతా, జీవన సాఫల్యమూ కనిపిస్తాయి.

మా నాన్న సుకుమారుడు. అబ్బనాకారి. చేయెత్తు పొడవుగల రూపసి. ఈయనా, విశ్వనాథ, నండూరి కలిసి తిరిగే వారు. అన్న ఎంత చెప్తే తమ్ముళ్ళకది అంత. సాహితీ సమితి స్థాపించిన రోజుల్లో కొన్నాళ్ళు ఆ సమితిలో వీరు ముగ్గురూ సభ్యులుగా ఉండేవారు. దానికి శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి గారు సభాపతి. ఆ కాలంలో ఆధునికతపైనా, పాశ్చాత్య కవిత్వ ధోరణుల పైనా ఆదరం పెరిగిన కవికుమారులు చాలా మంది అందులో సభ్యులు. రానురాను చిక్కబడిన అభిప్రాయభేదాల కారణంగా ఈ ముగ్గురూ సమితిలో నుండి ఒక్కసారే బయటికి వచ్చేశారు. అది 1 9 2 5 వ సంవత్సరంలో.

మా నాన్న పెదనాన్నల అనుబంధం ఆకళింపు చేసుకోవాలనుకున్న వాళ్ళు వేయిపడగల్ని ఆశ్రయించక తప్పదు. వేయిపడగలు ఇంచుమించు డెబ్బైయేళ్ళ వెనకటి సమాజాధ్యయన శీలం కలిగిన గొప్ప వచన కావ్యం. నా మట్టుకు నాకు అటువంటి రచన నభూతో నభవిష్యతి. ఇందులో కవికి తన అభిప్రాయాల కనుగుణమైన సృష్టి చేయాలన్న తపన ముమ్మరంగా కనిపిస్తుంది. అందుకు చాలావరకు ఆయన కల్పనను ఆశ్రయించక తప్పలేదు. ఒక కల్పనాత్మక ప్రపంచం చుట్టూ తన ఆశయాల, అభిప్రాయాల సందోహాన్ని చిక్కగా అల్లుకుంటూ పోతే వేయిపడగలు తయారయింది. అంతటితో విశ్వనాథ తృప్తి చెందలేదు. అంతకంటే విశిష్టంగా దీన్ని తయారు చేయడానికి కవికి సంబంధించిన అనుభవోదంతాల కూర్పు బాగా సహాయపడ్డది.

విద్యార్థి దశ, స్నేహితులు, మరి కొందరు పరిచయముల జీవన రేఖలు, భారతీయ సంస్కృతికి సంబంధించి తానెరిగిన సమాచార సర్వస్వం, ఆచార వ్యవహారాల లన్నీ స్వస్వరూప విశేషాలతో, కల్పనాత్మక కథనంతో చక్కగా అనుసంధింపబడ్డాయి. ఈ సమాచారం కథ అనుభవంలో లెక్కే సత్యకథన పడగలు చదివే ఈ రెండు పకాలనూ విభిన్న దృక్పథంతో చదవాలి. అప్పుడే ఆ నవల ఆంతర్యం చక్కగా తెలుస్తుంది. రామాయణం చదివే ప్రతి మనిషీ రామునిలా చరించగలడా? చరిస్తాననుకోగలడా? అయినా ఆ కావ్య, సౌందర్యాన్ని ఆస్వాదించగలడు. ఈ వేయిపడగలూ అటువంటిదే.

ఇంతకూ, వేయిపడగల్లోని సత్యకథనాలలో బాగాపండిన సంపూర్ణ కదనం కిరీటి శశిరేఖల ప్రేమకథ. ప్రేమ పరిణయంగా మారి ఫలశ్రుతి రూపమై కులపాలికా ప్రణయ తత్వాన్ని మొట్టమొదట ఆంధ్రసాహిత్య ప్రపంచానికి పరిచయం చేసిన కథయిది. ఇంత సంపూర్ణ స్ఫూర్తితో విశ్వనాథ వేయి పడగల్లో చిత్రించిన కథ ఇదొక్కటే కనిపిస్తుంది. ఇంతకూ వేయి పడగల్లోని కిరీటిరావు నాయకుడైన ధర్మారావుకు ప్రాణ స్నేహితుడు. అనుంగు తమ్ముడు.

విశ్వనాధ వేయిపడగల రచన 1933లో జరిగింది. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రకటించిన నవలల పోటీలో దీనిని పోటీకై సమర్పించడం 1933లోనే జరిగింది. నాయని విశ్వనాథుల సహవాసం 1922 నుండీ బందరులో సంఘటితమైంది. విశ్వనాథ 22 నుండి 27 వరకూ బందరు జాతీయ కళాశాలలోనే ఉండేవారు. 27 తరువాత గుంటూరులో 33 వరకూ పనిచేశారు. 32లో ధర్మపత్ని శ్రీమతి వరలక్ష్మి మరణించింది. 1933లో వరలక్ష్మి త్రిశతిని రచించారు, రామాయణ కల్పవృక్ష రచన 33-38 వరకూ 5 సంవత్సరాలపాటు సాగింది. కాని 1940 లో దాని అచ్చుపని ఆరంభమైంది. కొన్నాళ్ళు నిరుద్యోగిగా ఉండి 38లో బెజవాడ SRR కాలేజీలో ఉద్యోగంలో చేరారు. అక్కడే పదవీవిరమణ చేశారు. నాన్న 1922 నుండీ 25 వరకూ బందరులో ఉండి, బి.యే పరీక్షలో ఉత్తీర్ణులై 26 నుండి 28 వరకు చిన్న ఉద్యోగాలూ, బి.ఇడి పరీక్షా నిర్వహించుకుని, 28 నుండి నరసరావు పేట మునిసిపల్ హైస్కూలులో టీచరుగా కుదురు కున్నారు. ఆయన సౌభద్రుని ప్రణయయాత్ర రచనను 1922లో ఆరంభించి 1925 నాటికే పరిణయ పర్యవసాయిగా పూర్తి చేశారు. 1924లో మాతృవియోగం కలుగగా మాతృగీతాల రచనను సాకారం చెందించారు. ఈ రెండు పుస్తకాలలోని ఖండికలూ వివిధ పత్రికలలో అచ్చవుతుండేవి. మిత్రులు సాహిత్య సభల్లో వీటి ప్రసక్తి తెస్తూ గానం చేస్తుండే వారు. కాని ఇవి పుస్తక రూపంలో అచ్చయి కనిపించడం 1939లో మాత్రమే. దీనిని బట్టి నాన్న జీవనోదంతమైన ఆయన ప్రణయమూ, వియోగ వ్యధా, మాతృ మరణమూ, పరిణయమూ, కులపాలికా ప్రణయశోభా అన్నీ పెదనాన్న మనస్సులో నిత్యహరితంగా శోభిస్తుండేవని గ్రహించవచ్చు. 1925 నాటికి జయకేతనం ఎగురవేస్తూ తీరం చేరిన నాన్న ప్రణయగాథ 1933కు వేయిపడగల్లో పెదనాన్న కలం నుండి జాలువారి అమృతత్వ స్థితిని పొందింది. వేయిపడగల్లోని కిరీటి కథకు అంతచారిత్రక ప్రాధాన్యం ఉంది. అది మొత్తం నవలలో అవాంతర కథనంగా, మనసు పెట్టి చదవని వాళ్ళకనిపించినా, అక్కడక్కడా కనిపించినా, ఆద్యంతమూ చక్కగా ప్రారంభింపబడి కొనసాగిన సత్యోదంతమై నవల మొత్తంలో ప్రతిభాసించింది. చివరి వరకూ కిరీటి నేనున్నానంటూ పఠితను పలకరిస్తూనే ఉంటాడు. ఇందులో కిరీటి పాత్ర చిత్రణలో, అతనికి ధర్మారావు మీదున్న అనుబంధ గాఢతలో, ఇసుమంతైనా కల్పన లేదు. ఇంత చక్కగా వాస్తవాన్ని తీర్చిదిద్దిన కథ మొత్తం నవలలో ఇదొక్కటే. అందువల్లనే ఈ కథ జరిగిన పది సంవత్సరాల తరువాత కూడా విశ్వనాథ మనస్సులో పచ్చగా శోభిస్తూ, తరువాతి ఆయన కృతి వేయిపడగలలో అమృతత్వసిద్ధిని పొందింది.

అక్కడి కిరీటి కథనాన్ని పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది. కిరీటిని వర్ణిస్తూ "కిరీటి సహజముగా ముగ్ధుడు. మెత్తని మనసు కలవాడు. ధర్మారావు వలె దురుసుగా మాట్లాడడు. కిరీటి మొగము చూచినంతనే ఎవరికైనను మంచి వాడనిపించును. అతనికి ప్రతిచిన్న విషయమును హృదయ దఘ్నముగానే యుండును. ఎవరికైన సాక్ష్యమేమయిన కావలసినచో కిరీటిని చెప్పమనవలెను. అతడు పెద్దమనిషి" - ధర్మారావు, కిరీటి మరియిద్దరు, సూర్యపతి రాఘవరావులు నలుగురూ ప్రాణ మిత్రులు. "నలుగురు నాలుగు దిక్కులు చివర్లనున్నా వారి హృదయములు కలిసియే యుండును".

"కిరీటి కథ . అందు శశిరేఖా ప్రణయగీతములందు తన యనుభవ మంతయు, తన ప్రేమ యంతయు చెప్పినట్లు చూపుటకు వ్రాసెను . అతని కవితా పద్ధతి బహురమ్యతరమై అతడు పోయిన [illegible] నవలే ప్రధానము.

విశ్వనాథ నాయని ప్రేమకథను ఇలా కిరీటి ప్రేమకథను, పరితలకు పరిచయం చేయడం కూడా ఒక విశిష్టం. సంగీతంలా సాగుతు జరిగింది. వేయిపడగల్లో ఒక అవాంతర కథనంలో ఒక పాత్ర రాఘాపతి. అతడు ఒక మహారాష్ట్ర గాయని పట్ల ఉన్మ్రత ప్రేమికుడై ఆమె కథనాన్నే అనుక్షణం మిత్రులందరికీ వినిపిస్తుండే వాడు. కిరీటి అతని కథ పట్ల ఆసక్తి చూపించడం ధర్మారావు పసికట్టి, కథ ఏమిటి? అని తరచి అడగగా కిరీటి "ధర్మారావా!" అనెను – అప్పుడు ధర్మారావు ఈ విషయాన్ని పరిహాసంగా కొట్టివేయ తగింది కాదని నిశ్చయించుకుని "కిరీటి! నీ ప్రకృతి నేనెరుగుదును. ప్రతిచిన్న సంగతియు నీకు హృదయ దఘ్నముగానే యుండును. ఎవరిని ప్రేమించితివి? నీరహస్యము నేను దాచగలుగుదును కదా!" అనిన తరువాత కిరీటి తన ప్రేమ కథోదంత రహస్యమును విప్పడం మొదలు పెట్టాడు.

ఈ కథనంతయు విశ్వనాథ ప్రత్యక్షరమున తన తమ్ముని ఆత్మీయ క్షోభను, వియోగ దుఃఖమును, తమ్మాలమున అన్నగా, ప్రాణస్నేహితుడుగా తాను పడు వేదనను పొదిగి ఒక విషాద మధురాకృతిగా శిల్పీకరించడం జరిగింది. నాయని జీవనోదంతాన్ని, నాయని విశ్వనాథల ప్రగాఢ స్నేహ రామణీయకాన్ని, ఎరిగిన వారికి కిరీటి కథలోని సౌందర్యం హృద్గతం కాగలదు.

కిరీటి చదువు సంధ్యల పై నాసక్తి పోగొట్టుకొని, శశిరేఖా స్మరణ లగ్నమానసుడై యింట్లో ఉండిపోతాడు. అన్ననుకూడా కాలేజీ మానుకొని తనతో పాటు ఉండి పొమ్మంటాడు. తమ్ముడి మాటను కాదనే కాఠిన్యం ఆ అన్నకు లేదు. ఆయన మనస్సులో ఎప్పుడూ తమ్ముడి బొమ్మ ఆర్ద్రతకు తావలం కావలసిన సుకుమార మూర్తి. కిరీటి ధర్మారావు చేలగట్ల వెంబడి తిరిగేవారు. ధర్మారావు ఆ పని చేయడం తమ్ముడు పడుతున్న బాధను ప్రశమింప చేయాలనే ఉద్దేశంతోనే. అట్లా వెళ్ళినప్పుడు ఒక సందర్భంలో అన్నదమ్ములిద్దరూ చేనిగట్టుపై కూర్చున్నారు. వరిపైరు ఏపుగా పెరిగి ఉంది. వీరు కూర్చున్న చోటికి అల్లంత దూరంలో ఒక కాజదుంప కాడ పైరుతో సమానంగా పెరిగి రెండుగా విభక్తమై చివళ్ళ రెండు పూవులు విడిచింది. ఆ పూవులు గాలికి ఊగుతూ మనోజ్ఞంగా ఉన్నాయి. కిరీటి చేలో దిగి వాటిని తెస్తానన్నాడు. బలహీనయష్టియైన తమ్ముడు తూలి పడతాడేమోనన్న భయంతో అన్న ఆ పెద్ద కాజకాడను పూవులతో సుందరమై కనిపించే దానిని, తీసుకు వచ్చాడు. తమ్ముని చేతికిస్తూ చూడు "ఇందులో ఒకటి నీవు మరొకటి శశిరేఖ" అని తమ్ముని ముఖంలో మందహాసం కోసం వెదికాడు. కాని కిరీటి ముఖంలో నవ్వు మొలకెత్త లేదు సరిగదా అది విషాధ మేఘ పటలావృతమై నల్లవారినట్లని పించింది. "అవునవును రెండును దూరముగనే యున్నవి" అన్నాడు కిరీటి. "ధర్మారావు కట్టిన బట్ట నుండి ఖద్దరు దారములాగి రెండుపూవులను కలిపి ముడివేసెను. కృతజ్ఞతామయములైన కిరీటి చూపులు ధర్మారావు మీద ప్రసరించెను." వారి పరిణయోత్సవ వర్ణన పరితల మనస్సులనా కర్షిస్తుంది. కిరీటి కథ సుఖాంతమే. అది మా నాన్నగారి పెండ్లి కథే. శుభ పర్యవసాయి అయిన ఆయన ప్రణయ గాఢతపైన ఆర్ద్రమనస్కులైన స్నేహితులంతా ఆ పెండ్లికి వచ్చారు. అక్కడ విశ్వనాథ "నాయని సుబ్బారావుకు అతని వివాహ సమయమున" అంటూ మూడు గీత పద్యాలు వ్రాశారు. అవి,

మీర లిరువురు చిన్నారి మేఘ శకల
ములను బంగరు వాహనములుగ మలచి
సంజరేకలలో ప్రశస్త పథములకు
ప్రాకెదరు లెండు జంటగా నాకు తెలుసు.
మీరలిరువు రేసెలయేటి మృదుల వారి
నో రహోజల క్రీడార్థమురుకు చుందు
రస్మదీయ చక్షురతీతులగుచు వెదుక
లేక శ్రమ మందెదము మేము నాకు తెలుసు.
మీరలిరువురు గంగాంబుధారలందు
ప్రణయ కోమల కౌసుమ పరిమళముల

కలగంటి పైడి పన్నీటి కన్నుల ...
మాకుపై వచ్చెదరనురే నాకు తెలుసు.

తమాషా ఏమిటంటే ఈ పద్యాలకే అడవి బాపిరాజు గారొక చిత్రం గీసి అంచు లో పద్య చరణాలను పన్నెండింటినీ చిన్న పెద్ద అక్షరాలతో అక్కడక్కడా పొదిగా ఆ చిత్రాన్ని ఆ కవితను వాళ్ళు సంయుక్తంగా, మా నాన్నకు బహూకరించారు. ఆ చిత్రంలో ప్రణయ యాత్రి నాయికా నాయకులు వత్సలా సౌభద్రులు, చిన్నారి మేఘశకలాలు, గంగాంబుధారలు, సంజరేకలు, కౌసుమరామణీయకమూ, అన్నీ కనిపిస్తాయి. ఈ చిత్రం బాపిరాజుగారి కూతురు శ్రీమతి రాధావసంత తాడేపల్లి గూడెం నుంచి నాకు పంపించారు. అవి నాన్న శతజయంతి(1899-1999) సంచికలో అచ్చువేయగలగడం మా అదృష్టం. బాపిరాజు గారు మానాన్నకూ, విశ్వనాథకూ బాపి బావ. సౌభద్రుని ప్రణయ యాత్రకు, కిన్నెరసాని పాటలకు బొమ్మలు వేసింది ఆయనే.

వేయిపడగల్లో ఆయిద్దరన్నదమ్ముల అనుబంధ కథనం ఇక్కడితో ఆగిపోలేదు. పెండ్లి చేసుకుని, తిరిగీ చదువుకోసం కిరీటి సుబ్బన్న పేటకు వచ్చాడు. ధర్మారావు తమ్ముణ్ణి ఇంటికి తీసుకుని వచ్చి, తాను లోనికిపోయి భార్యతో "మరిది పెండ్లి కొడుకై వచ్చెను. ఈ పూట అన్నములోనికేమి చేసెదవు?"

నిన్న దులిపితిని. కాకర పాదునకు నాకోపిక లేక నీళ్ళు పోయడం లేదు. అవి కాయుట లేదు. రెడ్డిదొరలు తీగ బచ్చలి తిందురా?" అనగా ధర్మరావు "ఆ తినకేమి శ్రీకృష్ణదేవరాయలవారు తిందురనియే చెప్పెను" అన్నాడు. అప్పుడు అరుంధతి "మీరీ బాదము చెట్టెక్కగలరా" యని యడిగెను. ధర్మా - 'ఎక్కి?' అరుం- ఎక్కి ఆ వాసముతో ఆకాశమునందున్న శశిరేఖను గొట్టుడు. అది తరిగి వేయించెదను- కిరీటి రాకచేత సంతోషంతో తలమునకలవుతున్న ధర్మారావు మహానందముగ్నుడై చావడిలోనికి పరుగెత్తు కొనివచ్చి "మీ వదినె యిట్లనుచున్నదోయీ" అని చెప్పెను. పెండ్లి కొడుకు ముసిముసి నవ్వులు నవ్వెను.ఇట్లా చెప్పూపోతే ఆ యిద్దరన్నదమ్ముల అనుబంధగాఢతకు దరీదాపూ కనిపించదు. దాన్ని కొలవడానికి సరైన కొలబద్ద లేదు. ఈ కిరీటి వేయిపడగలంతా విస్తరించి కనబడుతూనే ఉంటాడు. అన్నివేళలా సుఖసంతోష సమయాల్లోనూ, సంకట పరిస్థితులలోనూ అన్నను అంటి పెట్టుకునే ఉంటాడు కిరీటి. శశిరేఖ కూడా అరుంధతి, రథంతరి, గిరకలతో సమఉజ్జీగా చిత్రింపబడి నవల అంతటా సుమపరిమళం వలె మనోజ్ఞంగా విస్తరించి ఉంటుంది.

ఇక, ఈ సంచిక జయంతి ఈ నాడు తిరిగీ ప్రారంభమౌతున్నది. నిజానికి దీని ప్రారంభం నాదృ 1924-25 ల్లోనే జరిగింది. కోలవెన్ను రామకోటీశ్వరరావు గారూ, విశ్వనాథ, కలిసి ఇంగ్లీషులో త్రివేణినీ, తెలుగులో జయంతినీ ప్రారంభించారు. ముఖ్యంగా జయంతిని నిలబెట్టడానికీ దాన్ని సర్వాంగ సుందరంగా ఉండేటట్లు తీర్చిదిద్దడానికీ విశ్వనాథ పడ్డశ్రమ అంతాయింతా కాదు. దీన్ని మద్రాసునుండి పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు అచ్చువేయించి పంపిస్తుండేవారు. సంపాదకద్వయం దీనికి ఆర్థిక సహాయం కోసం మద్రాసు, బరంపురం, పర్లాకిమిడి, విజయనగరం మొదలైన చోట్ల తిరిగారు. దాన్ని రెండు నెలలకొక సంచికగా సంవత్సరం పాటు నడపడం గగనమైపోయింది. జయంతి పుట్టిన తరువాతనే 'శారద' ,'సాహితి' పుట్టాయి. ఆ మీదట 'భారతి' పుట్టింది. సాహితి సాహితీ సమితి పత్రిక. అందులోనే విశ్వనాథ ,'ఏలో' అనే తన తొలి భావకవితా ఖండికను వ్రాశారు. విశ్వనాథ ఉద్యోగ విరమణ చేశాక 1959 అక్టోబరు 3 వ తారీకున కరీంనగర్‌లో కాలేజీ ప్రిన్సిపాలుగా పనిచేశారు. అక్కడా శిష్యబృందమూ, స్నేహబృందమూ తయారయింది. ఆయన వ్యక్తిత్వమే అంత. మనుష్యోపగతజీవి! మనుష్యులంటే ఆయనకు గల ఆర్ద్రత, ఆప్యాయత, కొలతను మించినవి. ఇంతకూ ఈ బలగం ఉండడం వల్లనే 1960లో జయంతిని తిరిగీ ముద్రించడం జరిగింది. విశ్వనాథ తన 1960 డైరీలో జనవరి 12న, జయంతి బ్లాక్ కోసం 10 రూపాయలిచ్చినట్లు వ్రాసుకొన్నారు.

ఆ జయంతి పేరు మీదుగానే ఈనాడీ జయంతి ఆవిష్కృతమవుతున్నది. ఇది కలకాలమూ, మనుష్యలోకంలో ఆయన స్మృతివలె నిత్యహరితంగా సాహితీప్రియుల కనుల చల్లగా, వర్ధిల్లుతూనే ఉంటుంది. ఉండాలి!

# మా గురువు గారు - విశ్వనాథ వారు

ఎం.వి.వి. సత్యనారాయణ

నవ్య కవితా సనాదులు కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి దగ్గర చదువుకోవడమే ఒక మహాభాగ్యం. వారితో కలిసి అధ్యాపకుడుగా పనిచేయడం ఒక అదృష్టంగా భావిస్తుంటాను. క్లాసులో వందమంది విద్యార్థులలో ఒకడుగా ఉండడమో, అనేకమంది సహాధ్యాపకులలో ఒకడుగా ఉండడమో కాదు - విశ్వనాథ వారితో సన్నిహిత పరిచయం ఉండి, వారి అపారమైన ఆదరాభిమానాలనే కాకుండా, వారిచేత చివాట్లు తినడం, మొట్టికాయలు వేయించుకోవడం, వాటన్నిటినీ యింతకాలం తరువాత స్మరించుకోవడం ఒక అపూర్వ అవకాశంగా మురిసి పోతున్నాను.

విశ్వనాథవారు మనదేశం గర్వించదగ్గ మహాకవిగా, నవలా రచయితగా, ఎన్నోసాహిత్య ప్రక్రియలు సృష్టించి, అందరి ప్రశంసలు పొందిన మహనీయుడు. ఆయనలోని అనన్య సామాన్యమైన ప్రతిభను గురించి వ్రాయగలవారు ఎందరో పండితులు, సాహిత్య విమర్శకులు, మేధావులు ఉన్నారు. ఎటునుంచి చూసినా వారందరి మధ్య నోరు విప్పడానికి కూడా శక్తి సామర్థ్యాలు నాకులేవు కాని, వారిని ఒక మహావ్యక్తిగా చాలా దగ్గరగా చూసేటటువంటి అవకాశం నాకు దొరికింది. అందులోనూ అడుగడుగునా వారి కోపతాపాలు, వారి ఎత్తుపొడుపులు, వారి వ్యంగ్యోక్తులు మొదలైన వాటన్నిటినీ చవిచూచిన వాణ్ణి. ఆ అనుభవాలను గురించి యిక్కడ స్మరించడం సముచితమని భావిస్తున్నాను.

నేను విజయవాడలో S.R R & C VR కాలేజిలో ఇంటర్మీడియట్‌లో చేరాను. అప్పుడు విశ్వనాథ వారి యిల్లు గవర్నరుపేటలో మాయింటికి దగ్గరలోనే వుండేది. అందువల్ల వారింటికి అప్పుడపుడు వెడుతుండేవాడిని. అదీగాక మానాన్నగారు డాక్టరు నరసింహం గారికి - వారితో కొంచెం పరిచయం వుండడం, వారికి కొంచెం రచనా వ్యాసంగం కూడా వుండడం వల్ల, విశ్వనాథ వారి గొప్పతనాన్ని గురించి, ఆయన రచనల పరమార్థాన్ని గురించి, మానాన్నగారు చెపుతుంటే వినడం జరిగింది.

మానాన్నగారు చిన్నతనంలో రాజమండ్రిలో చదువుకునే రోజుల్లో, అప్పటికే తనరచనలతో ఆంధ్రదేశంలో సుస్థిర స్థానం సంపాదించుకున్న చిలకమర్తి లక్ష్మీనరసింహం గారింట్లో కుటుంబ సభ్యుడిగా మెలిగే భాగ్యం కలిగింది. వారి ప్రేమానురాగాలకు పాత్రులైనారు. ఆవిధంగా మానాన్నగారికి కవిత్వంమీద, కవుల మీద ఎంతో గౌరవభావం వుండేది. ఈ కారణాల వల్ల మా కుటుంబాల మధ్య మంచి స్నేహసంబంధాలుండేవి.

విశ్వనాథవారి తమ్ముడు వెంకటేశ్వర్లుగారి కుమారుడు వేణుగోపాల్, మా అన్నయ్య సూర్యనారాయణ, నాకు కాలేజీలో ఒక ఏడాది సీనియర్స్. అటువంటి వేణుగోపాల్ మా అన్నయ్య కంటె నాకు అత్యంత సన్నిహితుడయ్యాడు. అతని ఆరోగ్యం బాగుండకపోవడం వల్ల, చదువుకోవడానికి వీలుగా వుంటుందని, వేణుగోపాల్ తన తండ్రి దగ్గర కాక, పెదనాన్నగారైన విశ్వనాథ వారింట్లోనే వుండే వాడు. అతనికి మంచి సాహిత్యాభిరుచి ఉండడమే కాకుండా, మాటతీరూ, మాట విరుపూ అన్నీకూడా సత్యనారాయణగారిలాగ అచ్చుగుద్దినట్లుగా వుండేవి. రచయితగా, వారపత్రికా సంపాదకుడిగా తరువాతి కాలంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న పురాణం సుబ్రహ్మణ్య శర్మ, వేణుగోపాల్ క్లాస్‌మేట్. అతనికి రచనావ్యాసంగంలో అభిరుచి కలిగించి ఎంతగానో ప్రోత్సాహం కలిగించాడు. దురదృష్టవశాత్తు వేణుగోపాల్ చాలా చిన్నవయస్సులో పెదనాన్నగారి దగ్గరే వుంటూ పరమపదించాడు. మా అందరికీ ఎంతో బాధ కలిగింది. సత్యనారాయణ గారికి కూడా అది ఎంతో తీరని లోటు. అతనే బ్రతికి బట్టకట్టుంటే, సత్యనారాయణగారి సాహిత్యవారసుడైవుండే వాడేమోనని, ఆ రోజుల్లో మేమందరం అనుకునేవాళ్లం. అంతప్రతిభావంతుడు వేణుగోపాల్.

వేణుగోపాల్ ప్రోత్సాహంతోనే, అతని అండదండలు చూసుకుని, నేనూ, పురాణం సుబ్రహ్మణ్య శర్మ కాలేజీకి ఒక వ్రాత పత్రిక (Manuscript Magazine) తీసుకువద్దామని నిర్ణయానికి వచ్చాం. అప్పటికి మాకాలేజీకి మాగజైన్ లేదు. అప్పుడు సుదర్శన్ అనే ఒక మంచి చిత్రకారుడు వుండేవాడు శర్మక్లాసులో. Live Drawing అతనిది ఎంతో అద్భుతంగా వుండేది. అప్పుడు మా ప్రిన్సిపాల్ డా.పుట్టపర్తి

శ్రీనివాసాచారిగారు. ఆయన హిస్టరీలో లండన్ యూనివర్సిటీ నుంచి పి.హెచ్.డి పొందిన మేధావి. ఆయన అనర్గళంగా ఇంగ్లీషు కానీ, తెలుగుకానీ మాట్లాడుతుంటే, మేమేకాదు - విశ్వనాధవారు కూడా ముగ్ధులై వింటుండేవారు. ఆయన సుదర్శన్ గీచిన చిత్రాల్ని మెచ్చుకుంటూ, ఇతను ఏ ఇంగ్లాండులోనో పుట్టివుంటే అక్కడి వారు అతనికి బ్రహ్మరధం పట్టేవారనేవారు.

మా వ్రాతపత్రికకి "శారద" అని నామకరణం చేశారు. నేను, శర్మ పని ప్రారంభించాం. శర్మకి కొంత రచనా వ్యాసంగం, ఏదోచేయాలనే తపన వుండేది. నాకు ఉన్నదల్లా కేవలం అభిరుచి మాత్రమే. అందరి దగ్గరకెళ్ళి రచనలు, కవితలు మొదలైనవి సేకరించాం. సత్యనారాయణ గారి దగ్గరకెళ్ళి విషయం చెప్పాం. మా ముఖాలు చూసి ఆయన చాలా వ్యంగ్యంగా "మీరు పత్రికా సంపాదకులా? నేను మీకు నా రచన యివ్వాలా?" అన్నారు. "చదువుకోకుండా మీకీ పనులేమిట్రా" అని మమ్మల్ని చీవాట్లు పెట్టి, చివరికి "అయితే రాసుకోండి" అన్నారు. మా యిద్దరిలో నా దస్తూరి బాగా వుండడం వల్ల ఆపని నాకు పడింది. కానీ నాకు తెలుగు పద్యాన్ని గురించి అప్పటికి ఎంతమాత్రం తెలియదు. చాలా తప్పులతో రాసుకున్నాను. అది చూసి ఆయన మమ్మల్ని మరోసారి తిట్టి, తనే అదంతా మళ్ళీ వ్రాసిచ్చారు. యధాతధంగా ఆయన చేత్తో రాసిన పద్యాన్ని మా మొదటి సంచికలో వేశాం. అందులో కాలేజీలో వున్న లెక్చరర్లదగ్గర, విద్యార్థులదగ్గర, బెజవాడలో వున్న కొందరు పెద్దల దగ్గర కూడా కథలు, పద్యాలు, వ్యాసాలు, చిత్రాలు తీసుకొని వేశాం. ఆప్రతిమొత్తమంతా నేనే నా చేతుల్తోవ్రాసి తయారుచేశాం. డా.పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు గారు, డి.వి.కృష్ణమూర్తిగారు, జటావల్లభుల పురుషోత్తంగారు, యింకా అనేకమంది వ్రాసినవి అందులో వేశాం. పొట్లపల్లి సీతారామారావు అప్పుడు కాలేజీలో స్టూడెంటు, నాకు సీనియరు. తెలుగులో అతనికి ఎంతో ప్రతిభ వున్నట్లు విశ్వనాధవారు గుర్తించి ఎంతగానో అతని రచనల్ని మెచ్చుకున్నారు. మా 'శారద' పత్రికలో అతని పద్యం ప్రచురించాం. పత్రిక ఆవిష్కరణ సభకి స్వామి శివశంకరులు (తల్లావఝుల శివశంకర శాస్త్రిగారు) ముఖ్య అతిధిగా వచ్చి ఆవిష్కరించారు. ఆసభలో విశ్వనాధ వారు ముఖ్యంగా సీతారామారావు ప్రతిభ గురించే ప్రస్తావించారు. "ఇతడు రాసిన పద్యం చూస్తే, నాకే అనుమానం వస్తూవుంటుంది. ఇది అతను రాశాడా, లేక నేను రాశానా అని" అన్నారు. సత్యనారాయణగారు ఒక విద్యార్థిగా మాత్రమే వున్నవానిని యింతగా మెచ్చుకోవడం చాలా అరుదైన విషయం. తరువాత కొంతకాలానికి ఎం.ఏ.తెలుగు పూర్తిచేసుకుని, మాకళాశాలలోనే, విశ్వనాధవారితో పాటు లెక్చరరుగా చేరడం సీతారామారావుగారు ఎప్పుడు తన అదృష్టంగా చెప్పుకునేవాడు. విశ్వనాధవారు ప్రజ్ఞాపాటవాలు ఎక్కడున్నా, చిన్న వాడు - ఎవరిలో వున్నా, ఎంతగా మెచ్చుకునేవారో చెప్పడానికే ఈ విషయాన్ని గురించి యిక్కడ ప్రస్తావించడం జరిగింది.

అప్పుడు మాకాలేజీలో ఇంటర్మీడియట్ మాత్రమే వుండేది. రెండు సంవత్సరాలు కలిపి 1 5 0 మంది వుండేవారు. విద్యార్థులకి, ఉపాధ్యాయులకి మధ్య చక్కటి స్నేహానుబంధం వుండేది. పాటిబండ మాధవశర్మగారు తెలుగుశాఖలో పనిచేస్తుండేవారు. ఆయన కాలేజీకి 5 కిలోమీటర్ల దూరంలో వుండేవారు - గుణదలలో సుమారు పదిఎకరాల స్థలం వుండేది. అందులో ఆయన "బాలభారతి" అనే గురుకులం నడుపుతుండేవారు. విద్యార్థులు, ఉపాధ్యాయులు అందరూకూడా అక్కడేనివాసం. చాలా చిన్నవయస్సులో వారి కుమారుడు పోయాడు. ప్రతిసంవత్సరం ఆకుర్రవాని సంస్మరణార్థం ఒక కార్యక్రమం ఉదయం నుంచి రాత్రిపొద్దుపోయే వరకు జరుపుతుండేవారు. ఆరోజు మేమందరం పుదయాన్నే అక్కడికి చేరుకుని, రాత్రి పదిగంటలదాకా వుండి, నాటకం కూడా చూసి, అందరం కలిసి తిరిగి వూళ్ళోకి వచ్చేవాళ్ళం. మాప్రిన్సిపాల్ డా.పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు గారి దగ్గర్నుంచి, ఉపాధ్యాయులందరూ కూడా అక్కడికి వచ్చి, ఉదయం ఫలహారాలు, మధ్యాహ్నం, రాత్రి భోజనాలు అన్నీ అక్కడే - అందరు విద్యార్థులతో కలిసిమెలిసి గడిపే వారు. అప్పుడు కాలేజీలో పనిచేస్తున్న జె.యస్.శాస్త్రిగారు, చతుర్వేదుల రామనరసింహంగారు, బి.ఆర్.రావుగారు - విశ్వనాధ వారితో చాలా చనువుగా వుంటూండేవారు. ఒకసారి విశ్వనాధవారు ఎవరిని గురించో విమర్శిస్తూ మాట్లాడారు. శాస్త్రిగారు వెంటనే "Mr Samrat, you are talking 'some rot' I say" అన్నారు. అందరితో పాటు విశ్వనాధవారు కూడా విరగబడి నవ్వారు. శాస్త్రిగారి ధైర్యానికి ఆశ్చర్యపోయాం.

ఆ సంవత్సరమే మాకాలేజీకి, ఆంధ్రాయూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ డా.కట్టమంచి రామలింగారెడ్డిగారు రావడం జరిగింది. వారి గౌరవార్థంగా మా ప్రిన్సిపాల్‌గారు ఒకసభ ఏర్పాటుచేశారు. రెడ్డిగారు మాట్లాడేముందు. మాలోకొందరం ఇంగ్లీషులో బాగా మాట్లాడగల ముగ్గుర్ని మాట్లాడ్డానికి ఏర్పాటుచేశారు. నాతోపాటు చోడవరపు కృష్ణారావు, శేషపల్లి ఉండ్రపేటర శర్మకూడా వారిలో వున్నారు. మర్నాడు క్లాసులోకి వచ్చి, పాఠం మొదలుపెట్టేముందుగా "నిన్న రెడ్డిగారి ఉపన్యాసం ఎలాగుందోయ్" అనడిగారు విశ్వనాధవారు. మేమెవ్వరం మాట్లాడలేదు. కృష్ణారావొకడే "బాగుంది కానీ Balancedగా లేదు సార్" అన్నాడు, విశ్వనాధవారు ఆ ఉపన్యాసాన్ని మెచ్చుకున్నారో లేదో తెలియక. ఒక్కసారిగా వారు మండిపడిపోయారు. ఆయనకి కోపం వచ్చినా, ఎక్కువగా సంతోషం కలిగినా, ఇంగ్లీషులో మాట్లాడేవారు – అనర్గళంగా. వారి భాష నిర్దుష్టంగా, చక్కగా కూడా వుండేది. "ఏమిటి, రెడ్డిగారి ఉపన్యాసాన్ని గురించి విమర్శించేటంతటి వాడివయ్యావా? "You know what is the meaning of 'Balanced speech', Reddy is one of the finest speakers not only in English but in Telugu also He is a great scholar also", నేనే ఆయన ఉపన్యాసాన్ని ఎంతో ముగ్ధుడనైపోయాను తెలుసా" అని మందలించారు. ఈ రకంగా ఒకపావుగంటసేపు రెడ్డిగారి గొప్పతనాన్ని గురించే చెప్పారు విశ్వనాధవారు.

విజయవాడలో లీలామహల్లో ఇంగ్లీషు సినిమాలు మాత్రమే ఆడేవారు. ప్రతి శుక్రవారం సినిమా మారేది. ఏవారం తప్పకుండా ప్రతి శుక్రవారం, యింకో యిద్దరు ముగ్గురుతో కలిసి లీలామహల్లో 6 గంటల ఆటకి వచ్చేవారు విశ్వనాథ. అప్పుడప్పుడు నేనుకూడా అక్కడికి వెళ్ళేవాడిని. ఆరోజుల్లో లీలామహల్లో ఇంగ్లీషు సినిమా చూడడం ఒక గౌరవచిహ్నం (Status Symbol) గా వుండేది. సినిమా అయిపోయాక మారుతీనగర్‌లోని వారింటికి, నాలుగు కిలోమీటర్ల దూరం స్నేహితులతో మాట్లాడుకుంటూ, నడుచుకుంటూ చేరుకునే వారు.

1 9 5 0 ప్రాంతాల్లో లారెన్స్ ఒలీవియర్ (Lawrance Olivier) నటించిన Hamlet వచ్చింది. అప్పుడు మాకు ఇంగ్లీషు లెక్చరరుగా వున్న కె.యస్.హాస్కాట్ తోపాటు మేము కొంతమంది వెళ్ళి ఆసినిమా చూశాం. విశ్వనాధవారు, ఆయన బృందం కూడా వచ్చారు. అక్కడ నన్ను చూశారు. మర్నాడు క్లాసులో "సినిమా ఎలాగుందనుకుంటున్నావు" అని అడిగారు నన్ను. నేను నోరుమెదపలేదు. ఆక్లాసంతా ఆ నాటకం యెక్క గొప్పతనాన్ని గురించి , సినిమాకూడా ఎక్కడా మార్పుచేయకుండా ఎంత బాగా తీశారోనని మెచ్చుకుంటూ, లారెన్స్ ఒలీవియర్ ని "The greatest actor I have seen" అన్నారు. " To be or not to be" మొదలైన Soliloquies లో అతను ఎంత గొప్పగా నటించాడో పదే పదే చెప్పి, నాకు ఆ నాటకం మీద వున్న అభిమానాన్ని ద్విగుణీకృతం చేశారు. నేను ఇంగ్లీషు లెక్చరర్‌గా చేరిన తరువాత, ఆ నాటకాన్ని డిగ్రి స్టూడెంట్సుకి నాలుగైదుసార్లు చెప్పే అవకాశం దొరికింది. ఎన్నోసార్లు వారి critical comments and appreciation నా విద్యార్థులతో పంచుకునే వాడిని.

విశ్వనాధవారికి జ్ఞానపీఠం అవార్డు వచ్చిన సంవత్సరం నేను విజయవాడలో లయన్స్‌క్లబ్ (Lions club) కి అధ్యక్షుడిని. మాసభ్యులందరూ ఆయనకి సన్మానకార్యక్రమం తలపెట్టి, నన్నువెళ్ళి ఆయనని ఆహ్వానించమన్నారు. నేను, మాకార్యదర్శి టి.వి.హనుమంతరావు వెళ్ళి ఆయనతో మాక్లబ్ వారి ఆహ్వానాన్ని అందచేశాం. నాకేసి ఎగాదిగా చూశారు. "అయితే మీరు నన్ను సన్మానిస్తారన్నమాట" అన్నారు. అవునన్నాం. "సన్మానం అంటే ఏంచేద్దామనుకుంటున్నావు?" అనడిగారు. అప్పటికి ఆ విషయాన్ని గురించి మేము ఏమీ అనుకోలే దు. మామూలుగా యిటువంటి సన్మానాలన్నిటికీ ఒక పెద్దదండవేసి, ఓ శాలువాకప్పి, ఆ సన్మాన కర్తే వ్రాసిచ్చిన జీవితవిశేషాలు(Bio-data) అంతా ఏకరువు పెట్టడం ఆనవాయితీ ఈ క్లబ్బులన్నింటిలోనూ! ఏమనాలో తోచక, నేనే కొంచెం చొరవచేసి మీకు బట్టలు పెడదామనుకున్నామండీ అన్నాను. అలాగా అయితే ఓ పనిచెయ్యి. ఏలూరు రోడ్డులో పొందూరు ఖద్దరుషాపుంది. అక్కడ పంచెల చాపుతీసుకో అన్నారు. నాకు ఆఖద్దరు చాపు ఖరీదెంతో తెలియదు. అయినా సరేనండి, తప్పకుండా అలానే చేస్తామండి అనేశాను. మళ్ళీ ఆయనే ఏమిటో ఈయనకి సన్మానం చేస్తామని వస్తే, ఫలానా షాపులో ఫలానా పంచల చాపు తీసుకోమని చెపుతున్నాడే అని అనుకుంటున్నావు కదూ. నాకు తెలుసు. అది పద్ధతికాదు. కానీ, నేను నీతో ఎందుకన్నానో తెలుసా? నువ్వు నాకు బాగా తెలుసు కనుక. దానికి

కారణం ఒకటుంది. పోయినవారం గొట్టిపాటి బ్రహ్మయ్య మాయింటికొస్తానని కబురుచేశాడు. బ్రహ్మయ్య మాయింటికి ఎప్పుడొచ్చినా, ఎన్నిసార్లొచ్చినా, బట్టలు పెట్టకుండా పంపేంచను. అదీ మా యిద్దరి సంబంధం, నాకు అతని మీదున్న గౌరవం. కానీ ఆయనకివ్వడానికి యింట్లో బట్టలు లేవు. ఆయనకి సామాన్యమైన పంచెలచాపు పెట్టడం నాకిష్టముండదు. అందుకే నువ్వు పొందూరు ఖద్దరు చాపు పెడితే, ఆయన మాయింటికొచ్చినప్పుడు ఆబట్టలు ఆయనకిస్తాను, తెలిసిందా అన్నారు విశ్వనాద. అవిచాలా ఖరీదైన బట్టలు. మిగతా వాటికంటె సుమారు నాలుగింతలు ఖరీదుంటుంది. ఆసభలో ఉషశ్రీ (AIR) విశ్వనాధవారి రామాయణాన్ని గురించి మాట్లాడారు. తరువాత మాష్టారు ఒకగంటసేపు అద్భుతమైన ఉపన్యాసం చేశారు. ఆ తరువాత కొన్నిరోజులకి ఎక్కడో కలిసినప్పుడు "బ్రహ్మయ్య వచ్చాడోయి. ఆపంచెలచాపు బ్రహ్మయ్యకి పెట్టానోయి", అన్నారు. మేమేదో ఆయనని అలా అడిగినందుకు తక్కువగా అనుకున్నామేమో అనే అనుమానంతో.

ఒకసారి మాకాలేజీ నుంచి ప్రతి ఏటా వాల్తేరులో ఆంధ్రాయూనివర్సిటీ వారు నిర్వహించే ఆంధ్రవారోత్సవాల్లో పాల్గొనడానికి నిర్ణయించాం. అప్పుడు నేను Fine Arts & cultural Association Vice-Presideņt గా ఉన్నాను. అప్పుడు మా కాలేజీలో మంచి సమర్థులైన నటులున్నారు. ఏదైనా మంచి నాటకాన్ని పంపిస్తే మాకు బహుమతి వచ్చే అవకాశాలున్నాయి. అప్పుడు కరీంనగర్ నుంచి వచ్చి, విశ్వనాదవారు విజయవాడలో ఉంటున్నారు. ఆయన్ని ఒకమంచి నాటకం రాసిపెట్టమని అడుగుదామన్నారు అందరూ. నేను వెళ్ళి చెప్పాను. సరేనన్నారు. అంతతేలిగ్గా ఒప్పుకుంటారని అనుకోలేదు. అది రాసుకోవడానికి ఎవరినైనా పంపించమన్నారు. అమృతలింగశాస్త్రి అని ఒక విద్యార్థి ఉండేవాడు. కాలేజీనాటకాల్లో అద్భుతంగా నటిస్తుండేవాడు. అతన్ని విశ్వనాధ వారి వద్దకు పంపించాను. రెండు, మూడు రోజుల్లో ఒక నాటకం తయారైంది. నన్ను "దీనికి నువ్వు డైరెక్టరువి, నీకేం తెలుసు" అన్నారు. Competition Rules ప్రకారం బయటివాళ్లు ఎవరూ ఉండకూడదు. అందుచేత నాపేరు పంపించమని చెప్పాను.

"సరే, నీమొహం, నువ్వేం చేస్తావు కాని ఆ రిహార్సల్సు మాయింట్లోనే పెట్టుకోండి. నేను చూసుకుంటాను", అన్నారు. ఆనాటకానికి ప్రవాహం అని పేరు పెట్టారు. మంచినటనా సామర్థ్యం కలవారిని సెలక్ట్‌చేసి, వారింట్లో ఒకవారం రోజుల పాటు, వారి దర్శకత్వంలో రిహార్సల్సు జరిగాయి. నాది కేవలం ప్రేక్షకపాత్ర మాత్రమే. అంతా ఆయనే తయారుచేశారు. ఆ నాటకం చూస్తున్నంతసేపూ నాకు చెమటలు పట్టేవి. దీన్ని మావాళ్ళు ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులు ఎలా స్పందిస్తారో అని. బహుమతి సంగతి భగవంతుడికి తెలుసు. అయినా ఏంచేయగలను? ఎంతో భయంతోనే వాల్తేరు చేరుకున్నాం. Competition లోకి తీసుకోవాలంటే స్త్రీ పాత్రలు, స్త్రీలు మాత్రమే ధరించాలన్న నిర్ణయం మాకు అక్కడికి వెళ్ళిన తర్వాత తెలిసింది. మాకు పిడుగు పడ్డట్టయింది. ఒక్కరోజుకి ముందు Group singing కోసం తీసుకెళ్ళిన 'ఆశాలత' అన్న అమ్మాయిని పిలిచి, యీపాత్రను నువ్వువేస్తే బాగుంటుందన్నాను, ఆఖరిప్రయత్నంగా. ఆఅమ్మాయి డాక్టరు కె.అచ్చమాంబగారి తమ్ముడు కొమర్రాజు లక్ష్మణరావు గారి కుమార్తె. ఎలాగో ఒప్పించాం. నాటక ప్రదర్శన జరుగుతుంటే, ఆనాటి రిజిష్ట్రారు, నాటక కళకి ఎంతో సేవచేసిన శ్రీ.కె.వేణుగోపాల స్వామిగారి దగ్గరలోనే కూర్చున్నాను. నాటకం జరుగుతున్నంతసేపూ ఆయన కడుపుచేత్తో పట్టుకుని, పొట్టచెక్కలయ్యేలా నవ్వుతుంటే, నన్ను నమ్మలేక పోయాను. అందరూ ఎంతగానో మెచ్చుకున్నారు. కానీ అది National Youth Festival కి ఢిల్లీలో అన్నిభాషల్లోంచి వచ్చే నాటకాలతో పోటీపడడానికి తగినది కాదన్న కారణంతో, దానికి అనువైన వేరే నాటకాన్ని ఎంపికచేశారు. Best Actor గా ఆనాడు యూనివర్సిటీలో చదువుతున్న గొల్లపూడి మారుతీరావుని సెలక్ట్ చేశారు. అతను ప్రదర్శించినది "ఆడది" అన్న స్త్రీ పాత్ర లేని నాటకం. అంతా అయిన తర్వాత, గోపాలస్వామి గారితో మాట్లాడుతుంటే "మీనాటకం చాలా బాగుందయ్యా. అందులో విశ్వనాధవారి రచన ఏంచెప్పాలి? కానీ నాటకం దృష్టితో చూస్తే దానికి beginning and end లేదు" అన్నారు. వాల్తేరు నుండి తిరిగి రావటంతోటే విశ్వనాధ వారు "గోపాలస్వామి ఏమన్నాడు?" అని అడిగారు. ఆయనన్నమాటలు చెప్పాం. "అందుకే దానికి " ప్రవాహం" అని పేరు పెట్టింది", అంటూ ఆయనను తిట్టి పోశారు. మధ్యలో నేను నలిగి పోయాను.

చివరిగా అందరికీ తెలిసిన విషయమైనా, మరొక్క చాలా ముఖ్యమైన విషయం చెప్పడం అవసరం. నాకంటే చాలా ముందు ఎన్.టి.రామారావు గారు మాకాలేజీలో ఇంటర్మీడియేట్ చదివారు. ఒకసారి కాలేజీలో నాటకం వేయాలనుకున్నప్పుడు విశ్వనాథవారు నాగమ్మ నాటకం వ్రాశారట. అందులో స్త్రీపాత్ర ఎవరిచేత వేయించాలా అన్న ఆలోచనలో పడ్డారు. రామారావుగార్నిచూసి, యీకుర్రాడు అందంగా ఉన్నాడు, యితనువేస్తేబాగుంటుందనుకున్నారట. అతన్ని పిలిచి చెప్పారు. అప్పుడే రామారావు గారికి కొంచెం మీసాలు వస్తున్నాయి. మానాన్నగారితో చెప్పాలన్నాడు. వారితండ్రి మీసాలు తీయడానికి ససేమీరా ఒప్పుకోలేదు. చేసేదేమీలేక మీసాలతోటే రామారావుగారి చేత ఆడవేషం వేయించిన ఘనత విశ్వనాథవారిదే. ఈ విషయం రామారావుగారు మాకాలేజికి ఒకసారి పూర్వవిద్యార్థిగా వచ్చినప్పుడు, సత్యనారాయణగారి ముందే చెప్పాడు.

ఇలా ఎన్నో అనుభవాలు! ఎన్నో దివ్యమైన అనుభూతులు! విశ్వనాథవారికి సమకాలికులు కావడం అంతకు మించి వారి శిష్యుణ్ణి కావడం - అంతకు మించి వారితో కలిసి లెక్చరర్‌గా పనిచేయడం - పేరులో కూడా సామ్యం ఉండడం - అంతకంటే అదృష్టం ఏంకావాలి?



# అదీ, విశ్వనాథ వారంటే

డి.వి.నరసరాజు

1 9 5 2 – 5 3 ప్రాంతం. మదరాసులో – నా మొట్టమొదటి చిత్రం – వాహినీ వారి 'పెద్దమనుషులు' షూటింగు జరుగుతుంది.దర్శకుడు కె.వి.రెడ్డి గారు ఆ చిత్రంలో – జంధ్యాల గౌరీనాథ శాస్త్రి గారు మునిసిపల్ ఛైర్మన్ – ప్రధాన పాత్ర. గౌరీనాథ శాస్త్రిగారు – అంతకుముందు – 1 9 4 2 లో విడుదలయిన వాహినీ వారి 'భక్త పోతన' లో శ్రీనాధుడుగా నటించారు. ఆ పాత్రకు – ఆయన తప్ప – మరొకరు – సరితూగరు అన్నంత గొప్పగా నటించారు. మంచిపేరు వచ్చింది. చిత్రంకూడా 'గొప్ప హిట్' అయింది. దానికి కూడ డైరెక్టరు కె.వి.రెడ్డి గారే. అది – దర్శకుడుగా – ఆయన మొదటి చిత్రం.

ఆ తరువాత శాస్త్రిగారు సొంతంగా అంటే నిర్మాతగా 'గీతాంజలి' అనే సినిమా తీశారు. అందులో ప్రధాన పాత్ర పోషించి నటించారు కూడా. చిత్రం ఫ్లాప్ అయింది. ఆర్థికంగా చాలా నష్టపోయారు

పెద్దమనుషులు షూటింగ్ జరుగుతుండగా - శాస్త్రిగారికి ఒక ఆలోచన కలిగింది. గీతాంజలి చిత్రంలో కొన్ని మార్పులు చేసి - షూటింగు జరిపి - విడుదల చేస్తే కొంత ఆదాయం వస్తుందని – లాభం రాకపోయినా – నష్టమైనా కొంత పూడుతుందని ఆశపడ్డారు.

"దానికి పెట్టుబడికావాలిగదా – ప్రముఖ డిస్ట్రిబ్యూటరు – విజయాపిక్చర్స్ – పూర్ణచంద్రరావుగారిని సంప్రదించారు.

గీతాంజలి చిత్రంలో చేయదలిచిన మార్పులు – కె.వి.రెడ్డి గారి ఆధ్వర్యంలో గనక జరిగితే – తను పెట్టుబడి పెట్టగలనని పూర్ణచంద్రరావు గారు చెప్పారు."

ఆ విషయం శాస్త్రిగారు కె.వి.రెడ్డి గారితో చెప్పి సహాయం చెయ్యమని అర్థించారు.

కె.వి.రెడ్డిగారు విసుగ్గా –"నా వల్లకాదండి, తీస్తున్న 'పెద్దమనుషులు' చిత్రమే కారణాంతరాల వల్ల ఆలస్యమై ఖర్చు పెరిగిపోతుంది! అదీకాక ఒకేసారి రెండు చిత్రాలగురించి నేను ఆలోచించలేను!"అన్నారు. శాస్త్రిగారు ఆశాభంగం చెందారు.

ఒకరోజు కె.వి.రెడ్డిగారు మామూలుగా వాహినీ ఆఫీసుకు వచ్చారు. నేనూ అక్కడే వున్నాను. రెడ్డి గారు చాలా విసుగ్గా "చూడండి నరసరాజుగారూ! మంచికి పోతే చెడు అవుతుందంటారు – యిదే కాబోలు!

శాస్త్రి గారు పిక్చరు తీసి నష్టపోయామన్నారు. అదీగాక – నా మొదటి చిత్రం 'భక్త పోతన' లో నాకు కొన్ని యిబ్బందులు ఎదురయితే అప్పుడు నాకు ఆయన అండగా నిలబడ్డారు.

ఈ రెండు కారణాలే గానీ – ' పెద్దమనుషులు' లో ఛైర్మన్ పాత్రకు ఆయన బాగా సరిపోతారనే నమ్మకంతో – ఆయన్ని తీసుకున్నాను. యిప్పుడు తన 'గీతాంజలి' చిత్రానికి పని చేయమంటే నావల్ల కాదన్నానని మీకు తెలుసుకదా!

నిన్న --- తెలుగులో డైలాగులు తప్పు చెబుతున్నారు. ఒకో షాట్ నాలుగయిదు సార్లు తీయవలసి వస్తోంది.

" ఏమిటి శాస్త్రిగారు! ఏమిటి అదోలావున్నారు" అన్నాను. "నామనసేమి బాగుండటం లేదండి" అన్నారాయన. "గీతాంజలి" గురించేనా అన్నాను. "అవునండి" అన్నారాయన. అప్పుడు నాకు గత్యంతరం లేక యిష్టం, ఓపిక లేక పోయినా "యీ షెడ్యూలు కానివ్వండి, అలాగే మీపిక్చరును గురించి ఆలోచించి పని చేద్దాం" అన్నాను. అలా అనకపోతే మనపిక్చరు తినేట్టుంది అన్నారు రెడ్డిగారు.

గీతాంజలి ని సంస్కరించడానికి ఒక రచయిత కావాలి గదా. శాస్త్రిగారు విశ్వనాథ సత్యనారాయణ గారిని పిలిపించారు వాళ్లిద్దరూ మంచి స్నేహితులు పరస్పరం ఎంతో గౌరవం కలవారు.

ప్రతిరోజు–రాత్రి భోజనానంతరం – 9 గంటలతరువాత – కె.వి.రెడ్డిగారియింట్లో – గీతాంజలి గురించి చర్చలు.శాస్త్రిగారు,రెడ్డిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, నటుడు ముదిగొండ లింగమూర్తిగారు.

నాలుగురోజుల తర్వాత - మామూలుగా రెడ్డిగారు వాహినీ ఆఫీసుకు వచ్చారు. నేను అడిగాను గీతాంజలి పద్యం ఎంతవరకు వచ్చిందని. రెడ్డిగారు చిరునవ్వుతో అందుకే నేను యీ మహాకవుల జోలికి పోనండి. మొన్న హీరో,హీరోయిన్ల మధ్య ఒక రొమాంటిక్ సీన్ డిస్కస్ చేశాం, రేపు రాసుకువస్తాను అన్నారు విశ్వనాద సత్యనారాయణగారు. రాత్రి రాసుకువచ్చారు. చదవమన్నాను. ఆయన చదివారు, "మాధవీ!(హీరోయిన్ పేరు గుర్తుకులేదు) నేను చచ్చిన వెనుక నా ఆత్మ నీ చుట్టే తిరుగుచుండును".

రెడ్డిగారు పకపకనవ్వి నాతో శుభమా అని "శృంగారం రాయమంటే చావుతో మొదలు పెడతారేమిటండీ! పైగా అందులోని అంతరార్థాన్ని గురించి వివరిస్తారు. యిది మాస్ మీడియా, చూచే ప్రేక్షకులెవరూ ఆలోచించరు, మీడియం స్టడీచేయరు, ఆయన గొప్పకవే, కాదని ఎవరంటారు? మీడియం స్టడీచేయాలి గదా అన్నారు రెడ్డిగారు.

చర్చలు అలా ఒక వారం రోజులు జరిగినట్టు గుర్తు. చివరికి విశ్వనాథ సత్యనారాయణగారు "నావల్ల కాదయ్యా, మీతంటాలు మీరు పడండి" అని తిరిగి విజయవాడ వెళ్ళిపోయారు.

రెండుమూడునెలల తరువాత నేను విజయవాడ కెళ్ళాను. ఆదివారం మావూరు. రవ్వీస్ కాలువ వంతెన దాటి జీసెంటు రోడ్డులోకెళ్ళుతున్నాను. అక్కడ రాములు కిళ్ళీకొట్టు ఉండేది. రాములు కిళ్ళీలు చాలా ఫేమస్, సత్యనారాయణగారు అక్కడ కిళ్ళీలు కట్టించుకునేవారు. నేను తలవంచుకుని వెళుతున్నాను. ఆయన్ని చూడలేదు, చప్పట్లు కొట్టి పిలిచారు. "ఎప్పుడు వచ్చారు" మొదలైన కుశల ప్రశ్నల తరువాత "ఏమయ్యా? మాస్, మాస్ అంటారే వాళ్ళు నాకెక్కడా కనబడరే? అన్నారాయన. నేను వాళ్ళు పాపాత్ములకేగాని మీ వంటి పుణ్యాత్ములకు కనబడరండి అన్నాను, నవ్వుతూ. ఆయనగూడా పకపకనవ్వి బాగా చెప్పావు" అన్నారు.

ఒకసారి ఒకచిత్రనిర్మాత కథకోసం విజయవాడలో సత్యనారాయణ గారి యింటికెళ్ళాడు. "నేను రాసిన కథలు, నవలలు చాలా వున్నాయి గదా అవి చదివిచూడండి"అన్నారాయన. "అవన్ని చదివానండి, యింకా పబ్లిష్కాని కథలేమైనావున్నయ్యేమోనని"

అయితే ముందుకూర్చో అని లోపలికి వెళ్ళి ఒక మాన్యుస్క్రిప్టు తెచ్చియిచ్చారు.

ఆ సినిమా నిర్మాత కాగితాలు అటూయిటూ తిప్పి "చదివి చెబుతాను మాస్టారు" అన్నారు.

"చదివి ఏంచెబుతావు?"

"బాగుందోలేదో చెబుతాను".

"బాగుందో లేదో నీముఖం నీకేం తెలుసు? అసలు అర్థమవుతుందో లేదో చదివి చూడు " అన్నారట.

అదీ విశ్వనాథవారంటే !

# మీరెరుగని విశ్వనాథ

వడలి మందేశ్వర రావు

అంతకు ముందు విశ్వనాథ సత్యనారాయణగారి ఖండ కావ్యాలనూ, కిన్నెరసాని పాటలను చదవిన మాట నిజమే. కాని తొలిసారిగా ఆయన ఉపన్యాసం విన్నది కాకినాడ కాలేజీలో 1941 ప్రాంతాన. ఆంధ్రాభ్యుదయోత్సవాల సందర్భాన. ఈ ఉపన్యాసం తర్వాత వేరొక చోట వారు వ్రాస్తున్న రామాయణ కల్పవృక్షము నుంచి బాలకాండలోని విశ్వామిత్ర – మేనక ఘట్టం విన్పించారు. నేను వినలేదు. నువ్వుచాలా పోగొట్టుకున్నావు, అన్నాడు మిత్రుడు శ్రీమన్నారాయణ.

ఆయన కిన్నెరసాని పాటలు బహు పసందుగా ఉంటాయి. ఆయన పాడితే మరీ బాగుంటాయి. కాని 1945 తర్వాత అనుకుంటాను, కిన్నెరసాని పాటలు పాడండి అంటే, చిరాకు పడి వేదికను విడిచి వెళ్ళిపోయేవారు. చూడండి, ఆయన కెంత గర్వమో అనుకునే వారు జనం. ఆనాటి ఆయన స్థాయికి అనువైన రచన కల్పవృక్షం. దానిని వినిపించాలి కాని, అందరినీ అలరించే పాటలు పాడి, ప్రజల్లో చవకగా పేరుకోసం నాణ్యాలను ఫణంగా పెట్టను అంటాడు విశ్వనాథ.

"I hate a mawkish popularity"అన్నాడు కీట్స్ (Keats) ఒకచోట. అదీ విశ్వనాథ పందా.

1944లో అనుకుంటాను – విజయవాడ సత్యనారాయణ పురంలో నాటి బాలుడు చి.బాలమురళీ కృష్ణ సంగీత కచేరీ చేశాడు. తొడుగుకున్న కోటు మీద మెడల్సుతో ముచ్చటగా ఉన్నాడు. కచేరీ అయాక విశ్వనాథ ఆ బాలప్రతిభామూర్తిని ఆశీర్వదిస్తూ ఆనాడే ఆ బాలగాయకుని భవిష్యత్తును చూడగలిగారు. ఆయన మాటల్లో అతిశయం లేదు. వాత్సల్యం తొణికిస లాడింది.

ఆ రోజుల్లోనే విజయవాడలో ఆచంట లక్ష్మీపతిగారూ, పుట్టపర్తి శ్రీనివాసాచార్యగారూ, విశ్వనాథవారూ, కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారి సంస్మరణ సభలో పాల్గొన్నారు. లక్ష్మీపతిగారు ఎల్లోపతిలో డిగ్రీ సంపాదించి, ఆయుర్వేదానికి అంకితమైన భిషగ్వరులు. కొమఱ్ఱాజు వారికి అత్యంత సన్నిహితులు. పుట్టపర్తి వారు చరిత్రకారులు, మంచివక్త. విశ్వనాథ పండితుడు కవి. సమస్కంధులతో వారికంటె మూరెడు ఎత్తుకు ఎదిగి, విశ్వనాథ కొమఱ్ఱాజు గారుచేపట్టి అసంపూర్తిగా మిగిలి పోయిన Encyclopeedia ను గురించి మాట్లాడారు. ఆనాడు ఆయన ఆత్మవిశ్వాసం, విషయపరిజ్ఞానం ఎంత దృఢంగా ఉన్నాయో స్పష్టమైంది.

మరో పది యేండ్ల తర్వాత రాజమహేంద్రవరంలో ఆయన కల్పవృక్షం నుంచి రోజుకొక కాండలో ఒక ఘట్టాన్ని చదువుతున్నారని విన్నాను. ఆనాడు సుందరకాండ చివరకు వచ్చారు. నలుడు సేతువును కడతానంటున్నాడు. ఆ సేతువు శిల్పపాటవము అనితరమ్మై కల్పకల్పాంతములకు నిలచేటట్టు ఉంటుంది. విశ్వనాథ ఆ పద్యాన్ని చదివే ఒడుపు ఎలా ఉందంటే, కల్పకల్పాంతములకు కల్పవృక్షం నిలచే ఉంటుంది అని అర్థం వస్తోంది. దానికి సదస్సులు ప్రతిస్పందిస్తూండగా, విశ్వనాథ, "అలా అన్న శిల్పి నలుడు మహాగర్వా? అహంభావా? అంటే కానే కాదు. స్వశక్తి నెరిగిన శిల్పి" అన్నాడు. ఆమీద మరొక మాట కూడా అన్నాడు "అందుకే రామునికి నలుడంటే అంత ప్రీతి!" శ్రోతలు చలించిపోయారు. దానికి కూడా శిఖరాయ మాణంగా ఉండేటట్టు విశ్వనాథ "మీరంతా రాములు!" అన్నాడు ఆహా అనుకున్నారు శ్రోతలు నిర్విరామ హర్షాన్ని ప్రకటించారు.

ఇది ఏమి తెలియ చేస్తుంది? విశ్వనాథ అహం భావమా? ఆత్మప్రత్యయమా? సహృదయుల పట్ల ఆయనకు గల అభిమానమా గౌరవమా?

హైదరాబాదులోని మరో సమావేశంలో విశ్వనాథ యుద్ధకాండలోని అతికాయుని యుద్ధఘట్టాన్ని చదువుతున్నారు. చదువుతున్న పద్యాలను వేదికమీద ఉన్న ఆచార్య వి.కె.గోకాక్ కు ఆంగ్లంలోకి అనువదించి పాటిబండ మాధవ శర్మ చెపుతున్నాడు. గోకాక్ సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ (CIE) డైరెక్టరే కాదు స్వయానా కవీ, విమర్శకుడు. తర్వాతి కాలంలో కేంద్ర ఎకాడమీకి ఛైర్మన్ కూడా.కావ్య పరనం అయిపోగానే ఆ రచనకు గోకాక్ అద్భుతంగా ప్రతిస్పందించాడు. పాత్రచిత్రణకు శబ్ద చిత్రాలకు

ఉప్పొంగిపోయాము. "హనుమయందయిన గమనించిడి వచ్చిన గాలి కరడు సౌమిత్రి చెక్కింట రివ్వున మూయగా", (శేషుని అవతారమైన లక్ష్మణుడు) వానిని కసివాటు వేయగా, వాయువు అతనితో బ్రహ్మాస్త్రానికి వాడు లొంగుతాడని చెపుతాడు. అనితర సాధ్యమైన అవధానం ఉన్న కవే ఇలా చెప్పగల్గుతాడని అన్నారు ఆచార్య గోకాక్.

నేనూ అప్పుడు సభలో ఉన్నాను. (C I E లో ఉద్యోగం చేస్తున్నాను) సమావేశమైపోగానే, నేను ఆచార్య గోకాక్‌తో తిరిగి వస్తుండగా, విశ్వనాథ ఎంతటికవో చెప్పుపూనుకొని, సుందరకాండలో నలునిరాళ్లను సీత మీద వేల్చే శిల్పాన్ని గురించి దాని శాశ్వతత్వాన్ని గురించీ, ఆయన ఏమన్నాడో చెప్పాను. గోకాక్ మరీ ఆశ్చర్యపోయాడు "ఇది ఆశ్చర్యకరంగా ఉంది. ఈయన మా పుట్టప్ప వంటి వాడే" అన్నాడు. (అయితే గౌతమరావుగారి ఇప్పుడసీ చదివిన భావుకులు విశ్వనాథ దే పై చేయి అంటారు).

విశ్వనాథుడికి ఆషామాషీ జనరంజకత్వం అక్కరలేదు. మొగమాట పడి ఎవరినీ పొగడడు. పిన్నవాడని ప్రతిభను మరుగు పరచడు. సహృదయుడంటే అభిమానమే కాదు, "నా యెద నీతో రాచెద" అంటాడు.



# విరాట్పురుషుడు

కోవెల సుప్రసన్నాచార్యులు

జీవితం ఒక సుదీర్ఘయాత్ర. నిరంతర అన్వేషణ. ఒక అభ్యాసం. అపరిపూర్ణతనుంచి పరిపూర్ణత వైపుగా చేసే ప్రయాణం. ఈ పరిమిత జీవితానికి అపరిమితమైన శక్తిని కలిగించేదీ, వెలుగును విస్తరింపజేసేదీ విలువనుకలిగించేదీ మహాపురుష సందర్శనం. ఈ మహాపురుషుడు గురువు కావచ్చు, ప్రాణదాత కావచ్చు, జీవన పరమార్థాన్ని విప్పిచెప్పే వ్యాఖ్యాత కావచ్చు. ఒక ఆశ్చర్యం కలిగించే ప్రభావ పరిధిలో నీ చైతన్యాన్ని పరిపాలించే ప్రభువు కావచ్చు. తాత్త్వికుడు కావచ్చు. సాత్త్వికుడు కావచ్చు. కవియో, కళాకారుడో, శిల్పియో, గాయకుడో కావచ్చు. యోగి కావచ్చు. ఎవరైనా ఒక విలక్షణమైన శక్తి స్పందంచేత సన్నిహితుడైన వాని పాత్రతను బట్టి ఊర్ధ్వముఖంగా, దివ్యముఖంగా పరిణమింపజేసే వాడై అతని జీవనరథానికి సారథి అవుతాడు.

మహాపురుషుల పరిచయం, సాన్నిహిత్యం, అత్యంతం ఆశ్చర్యాన్ని కలిగించే అతని వ్యక్తిత్వ పార్శ్వాలను దర్శించగలుగటం, బ్రతుకులో, అన్నివిజ్ఞియార్థకూ, భావలోకంలో, ఇంద్రధనూవర్ణశబలతకూ నడుమ వైరుధ్యాలు అసంపూర్ణతలు కూడా ఎంతో విలువైనవి.

ఆ మహాపురుషుని నిర్యాణం తరువాత పాతికేండ్లు గడచిన తరువాత కూడా ఆ వ్యక్తిత్వంలోని మణిభంగదీప్తులు ఇంకా ప్రకాశిస్తూనే ఉండటం ఎంత అద్భుతమైన అంశమో ఆలోచిస్తే ఆశ్చర్యం కలుగుతుంది.

ఆ మహాపురుషుని ముద్ర జీవితంతో విడదీయరానిదై ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ వుండటం మన బ్రతుక్కు ఒక విలువను సంపాదించటం, స్మరించుకోవటం మనకు ముఖ్యమైన అంశమే.

నా జీవితంలోనూ ముగ్గురు మహాపురుషుల సంసర్గం లభించింది. ఒకరి పరిచయం కేవలం పరోక్షమైంది. భావరూపమూ, వాఙ్మయరూపమైంది. ఇరువురైతే భౌతికంగా నాజీవిత పథంలో నడిచిపోయారు, పోతున్నారు.

అలా నాజీవన పరిధిలో సాగిపోయిన మహనీయులు శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు. ఆ సాగిపోయిన సన్నివేశాలు, అవిస్మరణీయములైన ముద్రలూ చెప్పుకోవటం ప్రారంభించితే అది ఒక గ్రంథమే అవుతుంది.

ఆజానుబాహుడై చూపులతో వాక్కులతో ఎవరినైనా ఆకర్షించగల ఆమహాత్ముణ్ణి 1951లో తొలిసారి వరంగల్లు'ఆంధ్రసారస్వత పరిషత్తు వార్షికోత్సవాలకు వచ్చినప్పుడు చూడటమే. అప్పటికి ఆయన సాహిత్యాన్ని గురించి కొంచెం కొంచెం తెలుసు. ఆరాధన కానంత అభిమానం. చిట్టిగూడూరులో ప్రాచ్యకళాశాలలో 1949 నుంచీ చదువుతున్న మా చిన్నాయన శ్రీసంపత్కుమారాచార్యుల గారి వల్లనే ఈ పరిచయం. అప్పుడు రెండో మూడో ఉపన్యాసాలు వినటం జరిగింది. ఆయన భౌతిక వ్యక్తిత్వమూ, సారస్వతవ్యక్తిత్వమూ జమిలిగా అవిభాజ్యంగా తోచి రసప్రపంచంలోకి సాగిపోయే అవకాశము లభించింది.

అమృతసమమైన ఆ రసప్రపంచంలో నన్నయ తిక్కనలూ, శ్రీనాథ పోతనలూ, రాయలు పెద్దనలూ సంగమించిన విలక్షణత దర్శనమిచ్చేది. అయినా ఇన్నింటినీ మించిన, మనకు వ్యక్తావ్యక్తంగా అతీతమైన చైతన్య శిఖరం కనిపించేది. ఒక రవీంద్రుని, ఒక వాల్మీకినీ చూడలేదన్న కొరత ఎప్పుడూ అనిపించలేదు. నా ప్రపంచంలో ఆయన ఒక మిన్నుల వాన, తేనెలమబ్బు, తట్టుకోలేని తుఫాను.

వ్యక్తిగతంగా ఆయనలో పసిపిల్లవాడికుండే అమాయికత, అమృతమయమైన హృదయం, తొందరలో కటువుగా మాట్లాడినా ఎవరినీ ద్వేషింపలేని హృదయం, ధనాన్నీ కీర్తినీ వద్దనకపోయినా అంతస్సులో నెలకొని ఉన్న నిజమైన వైరాగ్యం, అలిప్తత, సమానానాం ఉత్తమ శ్లోకత్వం – ఇవన్నీ ఆయనలోని మరొకపార్శ్వం.

ఈ రెండు వ్యక్తిత్వాల మధ్య ఆత్యంతికమైన వైరుధ్యం ఏమీలేదు. మానవసహజములైన కొన్ని బలహీనతలు ఉండటం వాస్తవమే అయినా జీవితానికి మకుట ప్రాయాలైన ఔదార్యము, క్షమ, దాక్షిణ్యము ఆయనను నడిపించిన ప్రధాన లక్షణాలు.

ఇక్కడ ఆయనలో ప్రతిఫలించేది రజోముఖమైన సత్త్వము. సత్త్వము జీవుని చింతనలోని గాఢతకు వేదనకు కారణం కాగా రజస్సు అనితర దృశ్యమానమైన సృజన శీలానికి హేతువుగా రూపొందింది.

ఆంధ్ర సారస్వత పరిషత్తులో శ్రీసత్యనారాయణగారి ఉపన్యాసాలు మూడూ వినటం నాకు అరుదైన సన్నివేశం. మనస్సులోని సంస్కార సంపుటి కుదురుకొనే ప్రాయం. మాతృభాషాభిమానం, ఆంధ్రసారస్వతం మీద అభిరుచి, కవితాస్వాదవైఖరి ఈ మూడు నాలో బీజభూతంగా కుదురుకున్నాయి. ఒక ఉపన్యాసం చమన్ దగ్గరలోని, మాధ్యమిక పాఠశాలలోనూ, ఒకటి వేయిస్తంభాల గుడిలోనూ జరిగాయి. వేయిస్తంభాలగుడికి మేం నడిచిపోతున్నాం. సత్యనారాయణగారూ, ఆయన సోదరులూ(వేంకటేశ్వరులుగారు) టాంగాలో పోతూవుండగా చూచాము- వారు ఇంద్రావరుణుల్లాగా కనిపించారు.

మర్నాడు మేం చదువుకునే పాఠశాల - ఆంధ్రవిద్యాభివర్ధనీ పాఠశాలకు సోదరులిద్దరూ వచ్చారు. శ్రీవేంకటేశ్వరులు గారు అదే పాఠశాలలో తెలుగు పంతులుగా అప్పుడే కుదురుకున్నారు. శ్రీ సత్యనారాయణగారు పాఠశాల విద్యార్థులనుద్దేశించి అతిసరళంగా ప్రసంగించారు. ఎంతసరళంగా ఉందో ఆ ప్రరోచకమైన ప్రసంగం. "ఊరెది చీపురుపలి, పేరో సూరయ్యాకవి" అన్న అడిదం సూరకవి పద్యమూ, చెళ్లపిళ్లవారి "అభినవరామలింగ బిరుదాంకుడ", "కలనన్ తానక ఖడ్గ ఖండిత" , "శరసంధాన బలక్షమాది" అన్న పద్యాలూ వారి ప్రసంగంలో వచ్చినట్లు జ్ఞప్తి. పద్యవిద్యాసౌలభ్యపార్శ్వం యిక్కడ ఆవిష్కృతం చేశారు వారు.

శ్రీవేంకటేశ్వరులుగారి నీడలో నేను పద్యవిద్యాభ్యాసం చేశాను. అప్పటికి నేను వ్రాసిన పద్యాలన్నీ చూచి ఏది ఏమైనా లోకంలో వ్యక్తిని పొగిడే పద్యాలు వ్రాయవద్దు అన్నారు. ఆమాట నాకు ఇప్పటికీ మార్గదర్శకంగా రూపొందింది. ఆయన గొప్ప అధ్యాపకులు. వ్రాసే పద్యంలో ప్రౌఢిమ, జిగి ఉండేది. శ్రీసత్యనారాయణగారి వాఙ్మయంతోనూ పరిచయం పెరుగుతూ వచ్చింది. కావ్యమును చూడటంలోని గాఢత్వం, ఆస్వాదలక్షణం, వస్తువులో ప్రత్యక్షంగా గూఢంగా ఉన్న శాస్త్రాంశాలను గమనించే నేర్పు అప్పుడే అలవడుతున్నది. శ్రీసంపత్కుమారగారు నేనూ కలిసి రచించిన తొలి పద్యరచన హృద్గీత కు వేంకటేశ్వరులుగారే ముందు మాట సత్యనారాయణ గారితో వ్రాయించారు.

1951 ప్రాంతాలలో ఆంధ్రపత్రికలో సీరియల్‌గా ప్రచురితమైన 'స్వర్గానికి నిచ్చెనలు' అప్పుడు చదివిన గుర్తైతే లేదుకాని 1954-55లలో ప్రచురితమైన తెరచిరాజు(వారానికి రెండు సార్లు వచ్చేది) చదవటం గుర్తే. ఆరోజుల్లోనే విశ్వనాధవారు కరీంనగరం జగిత్యాలలో సాహిత్యయాత్ర చేశారు. శ్రీ జువ్వాడి గౌతమరావుగారి ప్రేరణతో. వరంగల్లులో వారి విడిది శ్రీవేంకటేశ్వరులు గారింట్లోనే. అప్పుడు వారిని కలుసుకోవటం ఆయన చేసే ప్రసంగాలకు శ్రోతలుగా ఉండటం గొప్ప. తొలిసారి విమాన ప్రయాణం చేసినంత విస్మయకరభావన.

1955 ఫిబ్రవరిలో కాలేజీలో ఇంటర్ చదువుతున్న మిత్రులం శ్రీపేర్వారం జగన్నాథం ప్రభృతులం - సాహితీ బంధు బృందం అనే సంస్థను స్థాపించుకున్నాం. దాని ప్రారంభోత్సవానికి విశ్వనాథ వారు వచ్చి సరస్వతీ తత్త్వాన్ని గురించి చక్కని ఉపన్యాసమిచ్చారు. స్థాపకాధ్యక్షుణ్ణి కావటం వలన నేను వేదిక మీదనే ఉన్నాను. ఆ నాటి వారి ఆశీస్సు గాఢత, బలమూ నాటి నుంచీ సాహిత్య స్ఫూర్తి రూపంలో నా [illegible] ది.

ఆరోజుల్లోనే వరంగల్లులో శ్రీమగదల రామచంద్రరావు అనే మిత్రుడు ఉండేవారు. ఆయనా ఐనాల హరీంద్రబాబు, నేనూ మా సంపత్కుమార గారూ అందరం కలసి విశ్వనాథను, కాటూరి వారిని చూచేందుకు విజయవాడ వెళ్లాము. రామచంద్రరావుకు కాటూరి విజయసారధి ఆత్మీయ మిత్రుడు. అప్పుడు శ్రీ సత్యనారాయణగారితో రెండు మూడుసార్లు ప్రసంగించే అవకాశం లభించింది. ఇరవయ్యేళ్ళు నిండీ నిండని నాతో వారు ఆత్మీయంగా ప్రసంగించటం, సాహిత్య జీవితాన్ని గురించి తెలియజేయటం ఈనాడు తలుచుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. వారి సౌలభ్యమూ, సౌహార్దమూ అప్పుడే తెలిసివచ్చాయి. ఆయాత్ర మాకు ఒక అరుణాచల శిఖరాన్ని, మీనాక్షి దేవాలయాన్ని చూచి వచ్చినంత గొప్ప అనుభవం.

1956 ప్రాంతాలలో వరంగల్లులో శ్రీ చిలుకమర్తి రామానుజాచార్యులు అనే గొప్పకవి ఉండేవారు. ఆయన పరమ మధురంగా పద్యంచెప్పేవారు. ఆ రోజుల్లో ఆంధ్రవిద్యాభివర్ధనీ పాఠశాలలో పోతన జయంతి

సంవత్సరంలో కవిసమ్మేళనం జరిగింది. శ్రీసత్యనారాయణగారు అధ్యక్షులు. నేనూ రామప్పగుడి అని కొన్ని పద్యాలు చదివాను, మెప్పుగా చూచారు. అయితే శ్రీరామానుజాచార్యులుగారు దశావతార వర్ణన మాలిక చదివారు. విశ్వనాథవారు అదివిని పులకించిపోయారు. ఆతనిని ప్రశంసిస్తూ ఆయన కవిత్వాన్ని పెద్దన కవితతో పోల్చినారు. తెల్లవారి తమ విడిది దగ్గరకు రమ్మని వారి 'కల్యాణరాఘవం'లో పద్యాలు విని, కల్పవృక్షం నుంచి సీతాకల్యాణ ఘట్టం చదివి వినిపించారు. తరువాత కల్యాణరాఘవం ప్రచురిస్తానని ఉల్లాసపడ్డారు.(అది తరువాత అలాగే వారికావ్యం విని పులకరించిన కాటూరివారి ప్రేరణతో త్రివేణి పబ్లిషర్స్(మచిలీపట్నం) అచ్చువేయించారు).

ఈ సన్నివేశం శ్రీసత్యనారాయణగారి భావుకతకు, పద్యం స్పందనకు సాక్ష్యం ఇచ్చేది. 1940 ప్రాంతాలలో విశ్వనాథవారు కాళోజీ సోదరులకు అతిథిగా ఒక పర్యాయం ఉన్నారు. శ్రీవానమామలై వరదాచార్యులు గారూ, శ్రీ గార్లపాటి రాఘవరెడ్డి గారూ తమ పద్యాలు వినిపించటానికి వచ్చారు. భోజనానంతరం మంచంమీద పడుకుని విశ్రాంతి తీసుకుంటున్న విశ్వనాథగారు అలాగే ఉండి వారి ప్రక్క కుర్చీలో కూర్చోని వినిపించమన్నారు. శ్రీరాఘవరెడ్డిగారు పద్యాలు చదువుతున్నారు. రెండుమూడు పద్యాలు చదివేసరికి లేచి కూర్చున్నారట. మరికొన్ని పద్యాలు చదివేసరికి మంచం మీదనుంచి దిగి నేలమీద ఉన్నారట. ఇదివారి యందున్న కావ్యానుభవ పారమ్యాన్ని తెలియజేసే సన్నివేశం. దీన్ని శ్రీకాళోజీ పదేపదే గాద్గద్యంతో వివరించేవారు.

శ్రీసత్యనారాయణగారు శ్రీవేంకటేశ్వర్లుగారి అమ్మాయి వివాహానికి వరంగల్లు వస్తున్నారని తెలిసింది. నాకూ మాచిన్నాయనగారికీ ఒక సాహితీ సమర్పణ చేయాలని అనిపించింది. అంతకు పూర్వమే శబరిని గూర్చిన కొన్ని పద్యాలు ఉండనే ఉన్నవి. అదనంగా కొన్ని అటూ ఇటూ చేర్చి ఆనందలహరి అనే పేర వారికి అంకితం చేశాము. ఆత్మీయులతో చిన్న సమావేశం. ఆయన ఎంత సంతోషించారో చెప్పలేము. నారచనాశిల్పం ఈ పద్యరచనలో ఉన్నదనీ, వీరు నా కవితా సంతానమనీ ఆదరంతో సంభావించారు.'కవితచెప్పి ఉభయకవిమిత్రు మెప్పింప నరిది' అన్న కేతన మాటకు అర్థం అప్పుడు తెలిసి వచ్చింది.

ఈ సంఘటనకు కొంచెం ముందే కరీంనగరంలో 1955 మార్చి 31, ఏప్రియల్1 తేదీలలో విశ్వనాథ షష్టిపూర్తి జరిగింది అత్యంతవైభంగా. వారిని గురించి నేను వ్రాసిన పద్యాలను విడిదిలో మా మాస్టారు శ్రీవేంకటేశ్వరులు గారికి నేను వినిపిస్తున్నాను. ప్రక్కగదిలో మేల్కొని ఉన్నారేమో విశ్వనాథవారు వాటిని వింటున్నారు. ఒక పద్యంలో తార్తీయమూర్తి అనే ప్రయోగం ఉన్నది. ఆ ప్రౌఢప్రయోగానికి మెప్పుగా అక్కడినుంచే ఊ అని దీర్ఘంగా పలికారు. తరువాత ఆ పద్యంలో ఒకటో రెండో ఆనందలహరి అంకితంలో చోటు చేసుకున్నాయి.

. ఆంధ్రప్రదేశ్ శాసనమండలి ఏర్పడ్డది. దానిలో శ్రీసత్యనారాయణ గారిని సభ్యులుగా ప్రభుత్వం నామినేట్ చేసింది. ఇంతలోనే కరీంనగరంలో ప్రారంభమైన కాలేజీకి ప్రిన్సిపల్ అయ్యారు. రెంటిలోనూ కాలేజి ప్రిన్సిపల్ పదవిని ఎన్నుకొన్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వచ్చింది, దానికి ఉపాధ్యక్షులయ్యారు.

కరీంనగరం కాలేజిప్రిన్సిపల్గా, సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులుగా విశ్వనాథవారు తరచుగా హైదరాబాదు వస్తుండేవారు. అంతలో 'జయంతి పత్రిక శ్రీజువ్వాడి గౌతమరావు గారి ఆధ్వర్యంలో ప్రారంభమయింది. ఖమ్మంలో, హైదరాబాదులో, వరంగల్లో, రాజమహేంద్రవరంలో రామాయణకల్పవృక్ష పఠనోత్సవాలు రెండుమూడు రోజుల పాటు నిర్వహిస్తూవుండేవారు.

సృజనాత్మకరీతిలోను, సాహితీతత్త్వ ప్రచారంలోనూ శ్రీసత్యనారాయణగారు అధికంగా క్రియాశీలంగా ఉన్నకాలం యిది. మ్రోయుతుమ్మెద, సముద్రపుదిబ్బ, పురాణవైరగ్రంథమాల ఇంకా ఎన్నో నవలలు, కల్పవృక్షంలో సుందర యుద్ధకాండలు, కాళిదాసాదుల రచనలపై విమర్శలు. ఇలా ఎన్నోరచనలు వెలుగులోనికి వచ్చిన కాలం ఇది. విశ్వనాథ మధ్యాక్కరలు ఈ కాలపురచనయే.

ఒకసారి ఖమ్మంలో కల్పవృక్షోత్సవాలు జరుగుతున్నవి. విశ్వనాథ వారు ఆనాడే ప్రారంభం చేసిన కులస్వామి మధ్యాక్కరలు వినిపించారు. శ్రీసత్యనారాయణ గారికి ఒక అలవాటు మొదటినుంచీ ఉన్నది.

ఇంటికి వచ్చిన వారికి తత్కాలంలో వ్రాస్తూవున్న రచన తప్పకుండా వినిపించటం. ఆ విధంగా అతిధిరూపంలో ఉన్న సరస్వతికి సమర్పించటం. ఆస్వాదశక్తి యొక్క వివిధస్తరాలను అంచనా వేసుకోవటం, తన రచనలో మార్పుపొందుతూవున్న భాషాపరమైన, అభివ్యక్తి శిల్పరూపమైన అందాలకు సహృదయుల ఒప్పుదలను సంపాదించడం – వ్యాఖ్యాన సహితంగా వినిపించటంతో, పాఠకులు అత్యంతసన్నిహితులు కావటం ఇదీ దీనివల్ల కలిగిన ప్రయోజనం.

ఆయన రచనా ప్రపంచ పరిణామం గమనించినవారికి సాహిత్య ప్రక్రియా నిర్వహణలో, పద్యరచనలో, తెలుగుపలుకుబడిని పెంపొందించటంలో, భాషాశక్తికి పదును పెట్టడంలో అనంతమైన ప్రయోగలక్షణం, నూతనాంశాల ఆవిష్కారం ప్రత్యేకంగా అధ్యయనం చేయదగిన అంశం. విశ్వనాధ ప్రతిభా స్ఫూర్తికి ఏ ప్రక్రియగూడా దాని పరిమితులలో అది నిలచివుండలేదు. అన్నీ విస్తరించి నూతనములైన సరిహద్దులను నిర్మించుకొన్నాయి.

కరీంనగరం కాలేజీ ప్రిన్సిపల్గా సుమారురెండు సంవత్సరాలు ఉన్నారనుకొంటాను. ఆయన రచన అప్రతిహతంగా సాగుతూనే ఉన్నది. పురాణ వైరంలో రెండవదో, మూడవదో రచన సాగుతున్నది. ఆయన చెప్పుతున్నారు, శ్రీగౌతమరావుగారు వ్రాస్తున్నారు. రచనా వ్యగ్రమైన చిత్తంలో శ్రీసత్యనారాయణగారు ఉన్నప్పుడు ఆయన నిజంగా బ్రాహ్మీమయమూర్తి. ఆతని చూపుకు మరోలోకంలోని అన్ని తలుపులూ తెరువబడి ఉండేవి. విశ్వచైతన్యంతో తాదాత్మ్యాన్ని ఆయన సాక్షాత్కరించుకుని ఉండేవారు. ఆసన్నివేశాన్ని చూచే అవకాశం రెండుమూడుసార్లు నాకు లభించింది.

ఒకసారి కరీంనగరం నుంచి హైదరాబాదు వచ్చారు. అప్పుడు కల్పవృక్షంలో యుద్ధకాండ సాగుతున్నది. నాగపాశబంధంనుంచి శ్రీరామలక్ష్మణులు విముక్తులయ్యే ఘట్టం. ప్రయాణంలో ఇరవై ముప్పై పద్యాలు ధారణచేసి వచ్చారు. శ్రీపిశుపాటి రమణయ్యగారింట్లోచేరి సేదతీరిన తరువాత పద్యాలన్నింటినీ కాగితం మీద పెట్టారు. మాకు వినిపించారు. అప్పుడనిపించింది – మనం ఏ వేద వ్యాసుణ్ణో, భవభూతినో చూడలేదని బెంగపడనక్కరలేదని, మన ఎదుట ఆ సరస్వతీ విభూతి సజీవంగా సంచరిస్తున్నదని.

1960–61లలో హైదరాబాదు ఆకాశవాణి వారి కోసం ఆంధ్రసాహిత్యచరిత్ర రూపకాలు రచించి యిస్తున్నారు. అప్పుడు రెండో మూడో చివరి రూపకాలు హైదరాబాదులోనే వ్రాయించారు –మల్లాది శివరాంగారింట్లో. అప్పుడూ నేనూ సాక్షినే.

ఆయన విజయవాడలో ఉన్నా, కరీంనగరంలో ఉన్నా హైదరాబాదులో ఉన్నా, వరంగల్లులో ఉన్నా, సహృదయుల మధ్య, అభిమానుల మధ్య కూర్చున్నప్పుడు అదొక విస్తృత సహృదయగోష్ఠి. అక్కడ సుకుమారమైన హాస్యముండవచ్చు, గంభీరమైన శాస్త్రాంశం ఉండవచ్చు, జీవనానుభవం కావచ్చు, కాల్పనిక ప్రపంచం కావచ్చు, ఆర్తిపొందు కావచ్చు, ఆనందోల్బణం కావచ్చు. అక్కడ ఆయన ప్రసంగం విలక్షణంగా సాగేది. విశిష్టమైన వ్యాఖ్యానం, సమకాలీన కవులగురించి, సాహిత్యోద్యమాల గురించీ, తాముకలుసుకున్న మహాత్ములగురించి, విశిష్టులైన అనామకులు గురించి ఏంచెప్పినా ఒకజీవన రహస్యం విశదం అయ్యేది. విస్ఫుటం అయ్యేది. ఆయన ప్రసంగించేప్పుడు ప్రాణమయ ప్రపంచం – ఉద్వేగాల సంపుటి – సమగ్రంగా మేల్కొని ఉండేది. కోపమైనా, దుఃఖమైనా, ప్రీతియైనా, అత్యాసక్తియైనా వ్యక్తం చేయటంలో ఆయన ధోరణియెవేరు. ప్రత్యేకమైనది. ఈ మిత్రులందరూ ఒక వలయం అయితే ఆయన తరగిపోని ఆకర్షణ శక్తిగల ఒక అయస్కాంతం.

1958లో నేనూ, శ్రీరామకోటి శాస్త్రిగారూ, శ్రీమాదిరాజురంగారావు గారు కలసి రసధుని పేర హైదరాబాదులో విశ్వనాథ శ్రీశ్రీల సాహిత్యంపై రెండు రెండు రోజుల సాహిత్య గోష్ఠులు నిర్వహించాము. విశ్వనాథ గోష్ఠి సందర్భంలో యాదృచ్ఛికంగా విశ్వనాధ వారు అక్కడికి వచ్చారు. చివరి సమావేశానికి ఆయన వచ్చి పాల్గొన్నారు. శ్రీఅనుముల కృష్ణమూర్తిగారు ఆసమావేశం అధ్యక్షులు. ఆయన విశ్వనాథ వస్తూవుంటే భావోద్వేగంతో ఈ క్రింది పద్యంచదివారు –

అతిథిగ వచ్చె నేడు ఋషియంతటివాడు, హిమాద్రియంత ఉ
న్నతమయి శుభ్రమైనదియు, నాకధునీ జలజాతమంత సు

న్నితమయి స్వచ్ఛమైనదియు, నిర్మలమైన యెడందవాడు ఆ
కృతి శివుడై మనోజ్ఞత నుపేంద్రుడునై సృజనావిధాతయై.

తాదాత్మ్యభావంతో ఆ పద్యం చదువుతూ వున్నప్పుడు మెల్లిగా విశ్వనాద సభావేదిక మీదకురావటం మరపురాని సన్నివేశం. ఈగోష్ఠి పత్రాలన్నీ స్రవంతిలో క్రమంగా ప్రచురితం అయ్యాయి.

శ్రీ పిశుపాటి రమణయ్య గారింట్లో విశ్వనాధవారు విడిదిచేసినప్పుడు సాయంకాలాల్లో సాహితీగోష్ఠులు జరిగేవి. తమ రచనల గురించియో, కాళిదాసాదుల రచనల గురించియో ప్రస్తావన ప్రసంగాలు జరిగేవి. ఆ గోష్ఠులలో రెండు మూడు గంటలు గడిచిపోయేవి. వాటిల్లో శ్రీకురుగంటి సీతారామయ్య ప్రభృతులు పాల్గొనేవారు.

1958లో హైదరాబాదులో జయంతి ప్రారంభం అయింది. విశ్వనాధ, మల్లంపల్లి ప్రభుతులు సంపాదకులుగా ఉన్నా అసలు సంపాదకత్వం శ్రీ గౌతమరావు గారిదే. శ్రీసత్యనారాయణగారి సంపాదకీయం, శాకుంతలము యొక్క అభిజ్ఞానత వంటి వ్యాసపరంపర ఉండేవి. మిగతా పత్రిక అంతా శ్రీ గౌతమరావుగారే తీర్చిదిద్దేవారు. ఐదారు సంచికల తరువాత శ్రీగౌతమరావు గారు 'సాహిత్యధార' పేర సమకాలీన సాహిత్యం- ముఖ్యంగా పత్రికలలోని రచనల గురించి ఘాటైన విమర్శలు ప్రచురించటం ప్రారంభం అయింది 'సమవర్తి' అనే పేర. అది విశ్వనాధ విషయంలో కొందరు శత్రుత్వం పెంచుకునేందుకు దోహదం చేసింది.

వాస్తవపరిస్థితులను అనుసరించి పోవటంలో ఆయనకు స్పష్టమైన దృష్టి ఉండేది. తాము హైదరాబాదులో స్థలం కొంటున్నామని అన్నారు. నేను చాపల్యంతో రెండు మూడేండ్ల క్రితం కొని ఉంటే బాగుండేది అన్నాను. వెంటనే ఆయన అన్నారు - ఇప్పుడు కొనటం రెండుమూడేండ్ల తరువాత కొనటం కంటే మేలుగదా అని.

ఒకసారి 'భారతీయ కవిత' సంపుటంలో తెలుగు విభాగానికి వారు సంపాదకులు. నా కవిత ఒకటి దానిలో స్వీకరించారు. అట్లాగే నేషనల్ బుక్ ట్రస్టువారి ఆరంభ తెలుగు కవితా సంకలనంలోనూ నా కవిత ఒక టి చేర్చుకున్నారు.

1965లో తొలిభారతీయ జ్ఞానపీఠ్ వారి పురస్కారం విశ్వనాధ వారికి వేయిపడగలకు వస్తుందనే అనుకున్నాము. అవార్డు పురస్కార నిర్ణయ సంఘం సమావేశానికి వెళ్లేముందు మా ఆచార్యులు శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు నాకొక లేఖవ్రాశారు. ఈ సారి అవార్డు విశ్వనాధ వారికే వస్తుందనీ తమకు సమావేశంలో ప్రసంగించటానికి వీలుగా శ్రీసత్యనారాయణగారి బిబ్లియోగ్రఫీ పంపిచమని, నేను వరంగల్ నుంచి వారికి పంపించాను. అయితే కొంతమంది తెలుగువాళ్ల ప్రయత్నం వలన అప్పుడు 'వేయి పడగలకు' అవార్డు రాలేదు.

1974లో శ్రీభండారు సదాశివరావు, శ్రీప్రసాదరాయకులపతి, శ్రీముదిగొండ శివప్రసాద్, శ్రీకొత్తపల్లి ఘనశ్యామలప్రసాద్ ప్రభృతులం జాతీయ సాహిత్యపరిషత్‌ను స్థాపించాము. పూర్వరంగం చాలా వరకు విజయవాడలో 2,3రోజులు విస్తృత చర్చలలో సిద్ధమైంది. అందరమూ కలసి విశ్వనాధవారింటికి వెళ్లి సంస్థ ఉద్దేశ్యాలు కార్యప్రణాళిక వివరించాము. నిర్వహణలో ఉండే ఇబ్బందులను, పరిమితులను వారు కాస్త కటువుగానే చెప్పారు. అప్పుడు కొంతకటువుగానే తోస్తాయి ఆ మాటలు. ఆమాటల్లోని వాస్తవాంశాలు తరువాత తరువాత మాకు అనుభవంలో సత్యంగా తోచాయి.

వరంగల్ 1960 జూన్‌లో కొందరు మిత్రులం కులపతి సమితి అనే సాహిత్యసంస్థను స్థాపించాము. దీని పక్షాన కల్పవృక్షోత్సవాలు రెండుమూడు సంవత్సరాలు విస్తృతంగా జరిగాయి. ఆ సందర్భంలో 'శాకుంతలము యొక్క అజ్ఞానత', 'అల్లసాని వాని అల్లిక జిగిబిగి' మొదలైన విమర్శలను పుస్తకరూపంలో అచ్చువేసి వారికి సమర్పించటం జరిగింది.

ధ్వన్యనుకరణ సమ్రాట్ శ్రీ నేరెళ్ల వేణుమాధవ్‌కు విశ్వనాధవారి గ్రంధం ఒకటి అంకితం పొందాలని కోరికగా ఉండేది. నాతో ఆయన ఆవిషయం ప్రస్తావించేవారు. ఒకసారి నేనూ ఆయన కలిసి విజయవాడ వెళ్లాము. వారితో ఈ విషయంప్రస్తావించి - వారి రచనలో తమరచనను గురించినవి 'నేను-నా రచన'

[illegible] పుస్తకంగా [illegible] [illegible] అన్నాము. వారు సరే అన్నారు. అప్పుడు వారు శివాజీ పట్టాభిషేకోత్సవ [illegible] వారి కోరిక మేరకు '[illegible]' అనే కావ్యం వ్రాస్తున్నారు. ఆ సాయంకాలం మేం వెళ్ళేప్పటికి వ్యాసాలప్రతి ప్రచురణ విషయంలో తొందర ఏమీలేదు. వేణుమాధవ్‌కు శివార్పణం అంకితం చేస్తాను అన్నారు. అది వాళ్ళే అచ్చువేయిస్తారనీ నీవు పుస్తకం అచ్చువేయించే డబ్బు సన్మానంగా ఈయవలసినదీ [illegible]. శ్రీవేణుమాధవ్‌తో నీవు చాలా అదృష్టవంతుడవని నేను ప్రశంసించాను. మరువాత శివార్పణం అచ్చువేసేముందు వారి వ్రాత ప్రతితో అచ్చుకు సిద్ధం చేసిన ప్రతిని పోల్చుకుంటూ నేనూ శ్రీ [illegible] రాత్రంతా మేలుకొనే ఉన్నాము

శివార్పణం అంకితోత్సవ విజయవాడలో కోటక్ ఆడిటోరియంలో వైభవంగా జరిగింది. దానిలో గ్రంథమధ్యంలో శివాజీ పూజాగృహంలో భస్మాయుధాది దేవతలప్రసక్తి ఉన్న సీసపద్యం ఉన్నది. గ్రంథాంతఘట్టం ఆ విశిష్ట దేవతానమస్కారంతో పూర్తవుతుంది. ఈ రహస్యం గూఢంగా నిక్షేపించారు విశ్వనాథవారు గ్రంథంలో. నేను నా ప్రసంగంలో ఆ రహస్యాన్ని వెలికి త్రవ్వి వ్యాఖ్యానించగలిగాను. దానిలోని తాత్త్వికతను వివరించాను. దాంతో శ్రీసత్యనారాయణ గారు చాలా సంతృప్తితో నన్ను అభినందించారు.

1 9 7 1లో నా సాహిత్యవివేచన ఆధునిక కవిత – ముఖ్యంగా వచనకవిత – గురించిన విమర్శగ్రంథం. దానికి సాహిత్య అకాడమి పురస్కారం లభించింది. అప్పుడు విశ్వనాథవారికి ఛందోరహితమైన కవితారచన అంటే అనిష్టంగా వుండేది. వచనకవిత వ్రాయటమేకాకుండా దాన్ని గురించి విమర్శ కూడా వ్రాశానని నన్ను కోప్పడ్డారు. ఆ కోపం ఆయన నాలుక చివరనే కరిగి పోయింది.

నేను శ్రీ సంపత్కుమారగారూ 1 9 5 4 ప్రాంతాల నుంచీ శ్రీసత్యనారాయణగారి రచనలను, వారిరచనలపై పత్రికలలో వచ్చే వ్యాసాలను, వారి ఉపన్యాసాల రిపోర్టులను శ్రద్ధతో సమకూర్చుకునేవారం. 1 9 6 7 – 6 9లలో వరంగల్లులో స్నాతకోత్తర కేంద్రం ఏర్పడింది. శ్రీసత్యనారాయణ గారి సాహిత్యాన్ని అమితంగా అభిమానించే శ్రీరామకోటిశాస్త్రిగారు వస్తు సంపాదనలో వచ్చిచేరారు. విశ్వనాద సాహిత్య విషయంలో ఒక క్రమపద్ధతిలో పరిశోధన చేయాలనీ మేము భావించాము. శాస్త్రీ నేనూ కలిసి విశ్వనాథ వాఙ్మయ జీవిత పరిశోధనా కార్యక్రమం పేర ఒక ప్రాజెక్టు ప్రారంభించాము. క్రమంగా వ్రాతప్రతులూ, డైరీలు, ఉత్తరాలు చేరాయి. ప్రశ్నావళిలో అనేక వ్యక్తుల నుంచి సమాచారసేకరణ చేశాము. పత్రికలలోనూ విస్తృత ప్రచారం జరిగింది. అధికారికంగా ఉండేందుకు శ్రీశాస్త్రి డైరెక్టరుగా, నేను జాయింట్ డైరెక్టరుగా పేర్కొనటం జరిగింది.

1 9 7 2లో జ్ఞానపీఠపురస్కారం తరువాత శ్రీసత్యనారాయణగారికి వరంగల్లులో సన్మానం జరిగింది. ఆసందర్భంలో స్నాతకోత్తర కేంద్రానికీ వచ్చి వారు ఆ ప్రాజెక్టు ప్రారంభించారు. ఆ పద్ధతి – సామగ్రీ సేకరణ – పాశ్చాత్యపద్ధతిగా ఉన్నదని వ్యాఖ్యానించారు. అప్పుడు బిరుదురాజు రామరాజుగారు స్నాతకోత్తర కేంద్రం ప్రిన్సిపల్‌గా ఆ కార్యక్రమాన్ని ప్రోత్సహించారు. అందుకు మమ్మల్ని ముగ్గురినీ ఆశీర్వదిస్తూ శ్రీసత్యనారాయణగారు సభలో ఒక పద్యం చెప్పారు.

రామరాజుగారు, రహిసుప్రసన్నయు, రామకోటిశాస్త్రి ఈ మువురకు
అస్మదీయములను ఆశీర్వచనముల నెన్ని ఈయవలెనొ అన్ని యిత్తు.

ఈ ఆశీర్వచనం మాజీవితాలను గొప్పగానే ప్రభావితం చేసింది.

ఈ కార్యక్రమ ఫలితంగా పి.జి.సెంటర్ పక్షాన విశ్వనాథ వాఙ్మయ సూచిక ప్రచురించాము. తెలుగులో ఏ రచయితను గురించైనా ఇది తొలి బిబ్లియోగ్రఫీ ప్రయత్నం. కాకతీయ విశ్వవిద్యాలయం విమర్శిని, రెండవ సంచిక నాల్గు వందల పేజీలతో విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచికగా వెలువడింది. అపూర్వమైన పరిశోధన సామగ్రి దీనిలో ప్రచురితమైంది.

కొన్ని వ్యక్తిగత కారణాలవల్ల ఈ కార్యక్రమం తరువాత ఆగిపోయింది. అయితే అందులోని సామగ్రిలో కొంతభాగం 1 9 9 4 – 9 7లలో విశ్వనాథ అసంకలిత సాహిత్యం పేర ఆరు సంపుటాలుగా ప్రచురించటం జరిగింది. దీనికోసం విశ్వనాథ భారతి అనే సంస్థను స్థాపించి అనేకులైన సహృదయుల సహాయం, సహకారం పొందినాము.

శ్రీ జువ్వాడి గౌతమరావు గారికి తమ ఖండకావ్యసంపుటం భ్రష్టయోగి అంకితం చేశారు విశ్వనాథ వారు. ఈ ఉత్సవం జగిత్యాల కళాశాలలో దాని ప్రిన్సిపల్ శ్రీ వి.కొండలరావు గారి అధ్యక్షతలో జరిగింది. ప్రసంగాలు జరిగినాయి. శ్రీ సత్యనారాయణ గారు వ్యక్తులను సత్కరించినారు- నూతన వస్త్రాలతో. సభముగించి అందరు శ్రీ కొండలరావు గారింటికి వచ్చాము. అక్కడ విశ్వనాథవారు 'వక్తలకు పెట్టటానికి ఒట్టలు తెచ్చాను అయితే సంఖ్య పెరగటం వలన నీకు పెట్టలేదు' - అని తమకు కళాశాల వారు పెట్టిన శాలువను తీసి నాకు కప్పారు. 'అప్పుడే కప్పుదామను కున్నాను. అయితే కాలేజీ వాళ్లు తమ శాలువ విలువైనది కాదని మరొకరికి కప్పారనుకుంటారు'. వారిని నొప్పించవద్దని అక్కడ కప్పలేదు అన్నారు. ఇక్కడ రెండంశాలు. ఎంత చిన్న వాణ్ణైనా సంభావించటం. రెండు ఒకరిని నొప్పించక పోవటం. ఇంత సూక్ష్మంగా ప్రవర్తించే లలిత మర్యాద సత్యనారాయణ గారిది. శ్రీ కొండలరావు గారు వేరే శాలువ తెచ్చి వారికి కప్పారు.

ఆయనలోని మరొక గుణం మెచ్చితే ఏనుగు ఎక్కించటం. శ్రీ జీర్ణోడి ప్రసన్న అనే కవి రచన అంటే ఎంతో మెచ్చుకున్నారు. ఆయన రచనకు పీఠిక వ్రాశారు. కోరి ఆయనతో పృథ్వీభాగవతమనే కావ్యాన్ని అంకితం పుచ్చుకున్నారు. హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సమావేశాల సందర్భంలో సమావిష్టులైన అఖిలాంధ్ర సాహితీ వేత్తల సమక్షంలో అంకితం గ్రహించి ఆతన్ని ఘనంగా సత్కరించారు.

ఆయనది జాలిగుండె. ఆశ్రయించిన వారి కోరికను కాదనలేక పోయేవారు. కొందరు ఎం.ఏ.విద్యార్థులు మంచి మార్కుల కోసం పరీక్షకులకు చెప్పమని ఉత్తరాలు వ్రాయించుకొనే వారు ఆయనతో. ఆసిఫారసు లేఖలో ఈ తాత్పర్యం ఉండేది. 'ఈతడు నాకు చాలా కావలసిన వాడు. నేను నిన్నింత వరకు ఏమీ కోరలేదు. ఈతని పని పూర్తిచేస్తే నాకు ఉపకరించినటు' అని. కొన్ని సందర్భాలలో ఇవి చాలా ఇబ్బంది కలిగించేవే.

శ్రీసత్యనారాయణగారు నిరంతర జపశీలి. ఆయన ఆధ్యాత్మిక సాధన గురించి బయట తెలిసింది చాలా తక్కువ. ఆయన ఎక్కువగా ఆవిషయం చర్చించే వారు కాదు. "స్వప్న సుషుప్తుల గూడ రామనామగ్రహణంబె నావయిన మానసజిహ్వలు సేయు" అన్నస్థితి ఆయనది. కాటూరి వారు 1943లో గుడివాడలో గజారోహణ సందర్భంలో - ఆయనను మంత్రమయ వాణీ అని ప్రశంసించారు. భ్రష్టయోగి అన్నది తమను వర్ణించుకున్నమాట. అమృతపదార్థమున్ తెలిసినట్టిరు యోగులు - అన్న అనార్కలీ లోని నాందీ పద్యం మొదలైన చోట్లల్లో ఆయన సాధన రహస్యాలు గర్భితమయ్యే ఉన్నవి. విశ్వనాథ మధ్యాక్కరలు ఈ సాధన పథాన్ని ఎంతో కొంత పట్టియిచ్చే మహాగ్రంథం.

శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులు గారి కుమారుడు వేణుకు జబ్బుచేస్తే మాస్టర్ సి.వి.వి.యోగ చికిత్స నిమిత్తం వారు తిరుపతిలో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారి వద్ద ఉన్నారు. ఆ రోజుల్లో ఆయోగ మార్గాన్ని గురించి వారితో విస్తృతంగా చర్చలు జరిగాయి. మృత్యుంజయం గురించి ఇరువురి నడుమ ఏకాభిప్రాయం కుదురలేదు. ఆ చర్చలు 1967 ప్రాంతాలలో రచించిన రురుచరిత్రలో ప్రతి ఫలించాయి. రురువు ప్రతిపాదించిందీ సి.వి.వి. యోగమే. అయితే విశ్వనాథ వారు వేటూరి వారిని గురువులుగానే సంభావించేవారు.

1958 ప్రాంతాలలో ఒకసారి నాతో అన్నారు. నేను ఇక్కడ పడుకుని పైనుంచి నా శరీరాన్ని చూడగలనని. ఈ సాధన యోగంలో ఒక పురోగతి దశ అని సిద్ధపురుషులు అంటున్నారు. ఒకానొక మహాత్మునితో శ్రీ విశ్వనాథవారు తమ జపసాధన గురించి చెప్పగా - వారు మీరు పలకటం కాదు ఆ జపంలోనించి మీకు వినిపించాలి అని. ఆ సాధన చేసి ఆ సిద్ధిని కూడా శ్రీ సత్యనారాయణగారు పొందారని వారు చెప్పారు.

వారి కోపప్రసంగాలను గురించి తరచు వింటుంటాము. అది ఆయనలోని ఒకానొక పైనున్న పులి వేషం మాత్రమే. లోమున్న వ్యక్తిని గురించి మనకు తెలిసింది చాలా తక్కువ.

లేని కోపంబు వీరికై పూనుచుంటి లేని కామంబు వీరికై పూనుచుంటి
కృతకమయ్యెన యీ బ్రతుకెల్ల వల్లరీ మనోజ్ఞ జటా శశిభృచ్ఛులాట

అసలు వ్యక్తి అంతస్సులో నికామభవత్ పదచింతనానలో జ్వలిత సనాథంగా లిప్తలను గడిపిన వాడు. ఆలిప్తలు నిరంతరాలుగానే గడిచాయి చివరి రోజుల్లో.

# మా మాష్టరు గారూ

చుమ్మపూడి కోటేశ్వరరావు

సీ॥భ్రుకుటీస్థలాగ్రమున నిద్దపు వెన్నెల వెల్లి బళ్ళలో
సు భ్రువు - ఎవ్వరో పరమ సుందరతా జని భూమి చారుదీ
ప్తా భసుమధ్య పద్మగతయైనను ప్రేశలవీణ మీటుచున్
శుభ్ర మయూఖపుంజమయి చొచ్చెను మద్భ్రు కుటీస్థలాగ్రమున్

అవి ఉస్మానియాలో నేను తెలుగు ఎం.ఏ చేస్తున్న రోజులు. 1956-58 నడుమ. ఒకసారి గురువుగారు హైదరాబాదు వచ్చారు. శ్రీ కృష్ణదేవరాయ గ్రంథాలయంలో పెద్దనగారి కథా-కథనం గురించి కాబోలు ఉపన్యాసిస్తున్నారు. నేను ఆలస్యంగా వెళ్ళినందువల్ల సభ క్రిక్కిరిసివుంది. వెనక ఎక్కడో నిలబడి వింటున్నాను. హఠాత్తుగా పద్యంలో వింత జరిగింది. అర్ధరూపాయి బిళ్ళంత చంద్రబింబాల నడుమ శ్వేత పద్మాసీన సరస్వతి వీణ మీటుతూ వారి భ్రుకుటిలో బయల్వెడు నా భ్రుకుటిదాకా. కిటికీ సందుల్లో వెలుగుదాగులో ధూళికణాలు తేలాడినట్లు - ఒక వెలుగు దారిగా చంద్రబింబ సమూహం - నా కన్బొమల నడుమ ప్రవేశించటం. ఒక నిప్ప మాత్రకాలంలో జరిగిన ఒక వింత.

తరువాత సెలవుల్లో మావూరు (ఈమని) వెళ్ళటం అక్కడ మా కుండలినీయోగవిద్యా సమ్రాట్టు ఆరుమండ్ల రామకోటయ్య గారికి విషయం విన్నవించి వివరించమని కోరటం - వారు గురుశిష్య సంప్రదాయమిలాగే దైవనిర్ణీతమౌతుందని చెప్పటం - తల్లి నిర్ణయించిన గురువు 'వీరు' అని స్పష్టపడ్డది.

1954-56లో నేను బెజవాడ SRR & CVR కళాశాలలో గురువుగారి కోసమనే బి.ఎ చదివాను. తెలుగు ప్రత్యేకాధ్యయనంగా నాతో పాటు నల్గురుండేవారు. మొత్తం ఐదుమందిమి. మాష్టరుగారు పాఠం వినాలని కోరిక. వారు ఎవరెవరినో పంపేవారుతప్ప వచ్చేవారు కాదు. మేము పట్టు పట్టి వారిని పాఠం చెప్పేటట్లు చేసుకోగలిగాం. మొదటిరోజు పాఠం. గురువుగారు తరగతిలో అడుగుపెడుతూనే - మీకు చెప్పినా ఒకటే ఆగాడిదలకు చెప్పినా ఒకటే- నన్న దీవెనతో ప్రారంభం. గాడిద విషయమేమంటే కళాశాలో ఆరుబయట తిరుగుతూ వుండేవి. వాటిని చూపిస్తూ.

మాకు నన్నయ్య గారి సభాపర్వం ద్వితీయాశ్వాసం పాఠ్యం. అప్పటికి వారి నన్నయ్య గారి ప్రసన్న కథాకలితార్థయుక్తి పుస్తక రూపంలో వచ్చింది కనక వారి పాఠం వినాలని తపన. ఇంటికి రండి వారాని కొక రోజన్నారు. వెళ్ళటం- వారేదో నవల డిక్టేట్ చేస్తూ వుండటం వారి చుట్టింట్లో పాలావఝ్ఝల రామశాస్త్రి గారని మాకు లెక్చరరుండేవారు. వారు వ్రాస్తూ వుండటం -రివాజు. అదయిపోయినాక మా పాఠం గంటో, గంటన్నరో కాలపరిమితి లేదు. మాష్టరుగారు కాలబద్ధులు, టైంటేబుల్ బద్ధులు. పోర్షన్సు ఫలానా అప్పటికి పూర్తి చేయాలన్న నియమాలకు వారతీతులు. ఒక్కరోజు పాఠం చెబితే నెలదాకా మననాహారంగానుండేవి. బోధనలో అంతా చమత్కారమే. నీరసంగా వుండేదికాదు. పాఠం చెబుతూ 'తెలిసిందా' అని అడగటం వారికలవాటు. నాతోపాటు అరిపిరాల విశ్వమొకడు సహవిద్యార్థి. ఇంకా లుకాలు చంద్రమోహన్(ప్రస్తుతం హైదరాబాదులోనే వున్నాడు), ఆంజనేయశర్మ(ఈమధ్యనే పోయాడు), హనుమంతరావు - ఇది తరగతి విద్యార్థి సమూహం. 'తెలిసిందా' అనగానే ఒకరోజు విశ్వం 'తెలిసింది' అన్నాడు చటుక్కున. ఏం తెలిసింది? నీ బొంద! మాట్లాడకుండా విను? మాష్టారుగారి తిట్టు శిరిడీబాబా బొట్టులాంటిది. లోపల అంతా అశీర్మయం. హృదయ మాధుర్యం గూడు కట్టుకొన్న శబ్దం. వారి పద్యంలాగానే. లోపలకు వళితే చంద్రమండల శైత్యం. అమృతనీరధి స్నానం. అదొక రసప్రపంచం.

సాధారణ తెలుగు తరగతి వారానికొకసారి. కీ.శే.జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కావ్యమేదో పాఠ్యాంశంగా వుండేది. పద్యం చదవటం -విమర్శించటం - ఇంతే పాఠం సాగేదికాదు. నడుమ నడుమ -'కానీ పద్యం మధురంగా వ్రాస్తాడోయ్ పాపయ్యశాస్త్రి - లోపల ఏముంది అంటే ఏమీవుండదనుకో '- ఇదీ వరస.

నల్గురైదుగురం విద్యార్థులం కలసి ఒక ఇంట్లో వుండేవాళ్ళం. మా యింటిముందు మాష్టారుగారిల్లు. వెనక ప్రక్క కీ.శే.ధూళిపాళ శ్రీరామమూర్తిగారిల్లు. వారు మా కలంకార శాస్త్రం చెప్పేవారు. గుప్తాగారని వ్యాకరణ బోధకులు -శ్రీరామమూర్తిగారూ మాష్టరుగారింటికి వెళ్ళటం చూచి ఎదురుగా ఇంట్లోవున్న

నేనూ - వెళ్ళేవాణ్ణి. మాష్టరుగారు నీవెందుకు వచ్చావోయ్ అని గద్దించినట్లనేవారు. వారిమాట తీరే అంత కదా. మిమ్మల్ని చూడటానికంటే - చూచావుగా సరేపోయిరా లని నవ్వేవారు. నాకెంతో బ్రహ్మానందంగా వుండేది.

తరగతిలో వారు పాఠం చెబుతుంటే వారిని చూస్తున్న నాకు అప్రయత్నంగా పద్యాలు వచ్చేవి. నేనప్పటికే తాజ్మహల్, అనార్కలీ అన్న కావ్యఖండికలు వ్రాసాను. నాపై భావకవితా ప్రభావ మెక్కువగా వున్నరోజులనుకుంటా. ఎం.ఏ చదవటానికని హైదరాబాదు వస్తే దాశరథి గారితో పరిచయం.(నిజానికి నాకు ఎం.ఏ సీటిప్పించిందా మహానుభావుడే) వారికి తాజ్మహల్ పద్యాలు వినిపిస్తే - ఓహో! భలే బాగుందయ్యా నీ పద్యరచన అనేవారు. తర్వాత అపద్యాలెక్కడో పోయినయి. ఒకటిప్పటికీ గుర్తే.

సెలరాలన్ నగిషీలు చెక్కియును రాణీమంజులంబైన చె
క్కల లావణ్యముతోడ - తీర్చియు చెమక్కుల్ మిక్కిలిన్ పండు వె
న్నెల చెన్నుల్ బలికించి కట్టిన మహల్ నిద్దంపుటందంబు, వె
న్నెలరేలన్ గని షాజహాను మదిలో నిర్మించులే స్వర్గంబుల్.

ఈ పద్యోదాహరణ ప్రసక్తి దేనికంటే -

1. మాష్టరుగారికి చూపించాలంటే మహా భయం. (ఇది నేను జీవించివున్నంత వరకూ నేను భద్రంగా దాచుకొన్న భక్తి విశేషం).

2. మాష్టరుగారి దగ్గరకెళ్ళాక ఈ భావకవితా శైలి పోవటం. మా యోగవిద్యా గురువులన్న మాటేఇది. "విశ్వనాథవారి దగ్గరకు పోయినాక మీ కవితా శైలిలో మాధుర్యం పోయింది" అని.

3. కళాశాలల్లో ఆ రోజుల్లో పద్యరచనలో పోటీలు జరిగేవి. నేనూ మా విశ్వం పద్యాలు వ్రాస్తే ఇద్దరకూ బహుమతులు ఇస్తామంటే - నేను అప్పుడే వచ్చిన కల్పవృక్షం-అరణ్యాకాండను కోరుకోవడం జరిగింది. ఒక తమాషా ఏమంటే నేటికీ కల్పవృక్షంలో ఆ కాండే నాకు నచ్చిన భాగం కావటం. ఇదేమాట ఒకసారి గురువుగారప్పుడు కరీంనగరం కళాశాలాధ్యక్ష పదవినలంకరించిన రోజుల్లో నేనూ, మా శ్రీరామ్మూర్తిగారు ఉపన్యాసకులుగా వుండేవారం. అప్పుడు గురువుగారితో అన్నాను. ఆయన చాలా ముచ్చటపడ్డారా మాటలు విని.

బెజవాడ కళాశాలలో మాష్టరుగారి షష్టిపూర్తి ఉత్సాహం చేశాం. విద్యార్థులందరం కలసి 2000 రూ.లు జమచేసి వారికివ్వటం జరిగింది. ఐతే ఆ మహాసముద్రుడు తీసుకొంటాడా? తిరిగి ప్రిన్సిపాలుకిచ్చి విద్యార్థుల డబ్బు నేను తీసుకోవటం న్యాయంకాదు. ఫస్టున పాసైన వారికి బహుమతివ్వండని - ఎదో చెప్పారు. అప్పడొక సంచిక వేశారు కళాశాలవారు. అందులో నేను మొదటిసారిగా తెలుగు ఋతువులపై వ్యాసం వ్రాస్తే మాష్టరు చదివి నన్ను పిలిచి "ఈ అర్థం ఈ మాటకు నే నూహించలేదోయ్. నీవు చెప్పింది తమాషాగా వుంది" అని మెచ్చుకోవటం జరిగింది. ఎవరేది వ్రాసినా మెచ్చుకోవటం, చిన్నా,పెద్దా బేధం లేకుండా. వారి మహోదారతకు చిహ్నం.

ఆషష్టిపూర్తి ఉత్సవానికి కీ.శే.తెలుగులెంక తుమ్మల వారు వచ్చారు. నేనెప్పుడూ వారిని చూడలేదు. వారి రాష్ట్రగానం అప్పటికే చదవటం మాత్రం జరిగింది. వారు వస్తుంటే చూచి అనుకొన్నాను. వీరు బహుశా తుమ్మల వారై వుంటారని. తర్వాత వేదిక పై చెప్పగా విన్నాను. ఆ సభలో కీ.శే.జమ్మల మడక వారూ వున్నారు. వారు మాట్లాడిన తర్వాత మాష్టరుగారు సభ్యులతో అన్నారు "ఆయన మాట్లాడింది మీకేమైనా అర్థమైనదా? ఎందుకంటే నాకేమి అర్థం కాలేదు లే అందుకని" అని 'నేనెన్నోసార్లు చెప్పానాయనతో మాధరరాయశర్మ నీ ధోరణి మార్చుకో" అని. సభలో అంతా నవ్వుల వాన.

ఆ రోజుల్లోనే బి.న్ రెడ్డిగారు సుప్రసిద్ధ సినిమా దర్శకులు కళాశాలకు వస్తే మాష్టరుగారే అధ్యక్షులు. అయనేదో మాట్లాడుతూ "విశ్వనాథ ఏకవీరను తెరపైకి ఎక్కించాలనుకొన్నాను. కాని కుదురలేదు" అని - ఆ మహాదర్శకుని చూడటం. నేటికీ వారు తీసిన మల్లీశ్వరి వంటి సినిమాలే నాకిష్టం , మాష్టరుగారి పుణ్యమే.

బెజవాడలో వున్నంత కాలం మాష్టరు గారిని చూడటమే, వినటమే, తర్వాత వారి మాట ప్రకారమే ఎం.ఏ చదవటానికి హైదరాబాదు రావటం తటస్థించింది. ఇక్కడ వేరే కథ.

# అపరిణామ ప్రాప్తము

విశ్వనాథ పావనిశాస్త్రి

మన్మహాయోగ నిష్ఠా సమాధి నుండి
వి క్రియోపేత బ్రహ్మ భావించువేళ
పట్టరాని సౌందర్యపిపాస పగిలి
భ్రష్టయోగిని కవిజన్మ బడసినాడ.
మన్మహా యోగ నిష్ఠా సమాధినుండి
బ్రహ్మ బదులుగ వాక్స్వరూపమ్ము నెంచి
బ్రహ్మకును వాక్కున కభిన్న భావ మెంచి
భ్రష్టయోగిని కవిజన్మ బడసినాడ.
మన్మహా యోగ నిష్ఠా సమాధినుండి
బ్రహ్మ జగదతీతమను భావమ్ము లేక
ఈ జగత్తత్త్వమున బ్రహ్మయోజచేసి
భ్రష్టయోగిని కవిజన్మ బడసినాడ.

"భ్రష్టయోగి" అనే శీర్షికతో, యీ పద్యాలు వ్రాసేనాటికి మా నాయనగారి వయస్సు సుమారు ఇరవై ఏళ్ళు. అనగా అది 1916 ప్రాంతాలు. మా నాయనగారు పుట్టినది 1895 సెప్టెంబరు 10. తెలుగు లెక్కలో చెప్పాలంటే - కలిశకం-4997 మన్మధనామ సంవత్సర భాద్రపద బహుళ షష్ఠి.

గోదావరీ పావనోదార వాఃపూర
మఖిలభారతము మాదన్ననాడు
కృష్ణాతరంగ నిర్ణిద్రగానము తోడ
కవుల గానము శ్రుతి కలయునాడు
తుంగభద్రా సముత్తుంగ రావము తోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు
పెన్నానదీ సముత్పన్న కైరవ దళ
శ్రేణిలో తెన్గు వాసించునాడు
అక్షరజ్ఞాన మెరుగదో ఆంధ్రజాతి!?
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపు పాట పిచ్చుక గూండ్లు కట్టి,
నేర్చుకొన్నది పూర్ణిమా నిశల యందు.

ఈ పద్యం "ఆంధ్రపౌరుషము" అనే ఖండకావ్యంలోది. ఆ కావ్యరచన 1914. అదేవారి తొలిరచన. ఆనాటికే వారి భావనలో స్పష్టతా, స్థిరతా, పద్యపునడకలో శైలీ ప్రౌఢస్థాయిని పొదుచేసుకున్నాయి.

ఆ తరువాత 1924 వరకూ....

మదన మహీపతి ప్రసవ మార్గణభిన్న శరీర, దీనతా
స్పదపరిపాండురానన, విసర్పిత నీల పటాభిరామ, స
మ్మద మధులిట్పదాహృత తమాల నికుంజ లతాంత శయ్యపై
మదగజ యాన పండుకొనె మాధవరాధిక వేపమానయై.
అని "శృంగారవీధి" లో వ్రాసినా,
యదువుల యందుచుట్టము, లతాంగులయందున భర్త, ద్వారకా
స్పదులగు వారికిం బ్రభువు, భక్తుల పాలిటి కామధేను, వ
య్యదుకుల మౌళి యేదియగు? యన్నియునౌ , మరియేది కాడు? యె

య్యదియును కాడు, తత్ప్రభువ్యగంతపు వెన్నెల సర్పమై చనన్.
అని "శ్రీకృష్ణదేవుని నిర్వేదము" లో వ్రాసినా,
ఆరబ్దేశ్వర తాండవభ్రమణ పాదాంభోరుహస్రస్త మం
జీరంబో, గగనేందిరా కరపత చ్ఛ్రీ కందుకంబో, పున
స్స్వారాజ్యచ్యుత భుక్త పుణ్యమగు నక్షత్రంబొనా, పశ్చిమా
శా రత్నాకర మందు గ్రుంకెను, వివస్వద్‌జింబ మల్లంతలో.
అని "ప్రోలరాజు వధ" లో వ్రాసినా,
ఏమి కిన్నెరసాని !
ఏమి కిన్నెర తోగు !
బంగారు తీగలో పానకమ్మై పోయె
కొబ్బరిపాలు వాకలు కట్టినట్లయ్యె
మెయ్యావు లొకసారి పిదికి నట్లయిపోయె.

అని "కిన్నెరసాని పాటలు" లో వ్రాసినా .. ఆ స్పష్టతా, ఆనడకా అలాగే ఉన్నాయి.....

ఇటుప్రక్క మా నాయనగారు ఇంత వ్రాస్తున్నా .. అటు ప్రక్క మా తాతగారు శోభనాద్రి గారు, "ఏమయ్యా! ఆ రామాయణం ఎప్పుడు మొదలు పెడతావు? " అంటూనే ఉండేవాడు.మానాయనగారు, " దానికోసం చేస్తున్న సాధనేగదా యిదంతా" అని సమాధానం చెప్తూనే ఉండేవారు.

అంతకు ముందే వీరిద్దరికీ ఒప్పందం లయింది..." వ్రాస్తే రామాయణం వ్రాయాలి. ఈ అర్థం పర్థం లేని వ్రాతలు వృధా " అని మా తాతగారు కోపపడితే " నేను తప్పకుండా రామాయణం వ్రాస్తాను. కాని యీ లోపల దానికి సాధనగా, నేను వ్రాసే యీ పద్యాలను నువు కాదనకూడదు" అని మా నాయనగారు.... ఇదీ ఒప్పందం.మాతాతగారు 1927-28 ప్రాంతాలలో దివంగతులయ్యారు. మానాయనగారు 1932 లో " రామాయణ కల్పవృక్ష" రచనకు శ్రీకారం చుట్టారు.

ఆత్మనిత్య మ్మకాలా ద్యవచ్ఛిన్నమ్ము
సచ్చిదానంద సంపచ్చయమ్ము
అద్వితీయ మ్మేక మపరిణామ ప్రాప్త
మపరి మేయమ్మది "యచ్చ తెలివి" ---

"ఆత్మ" -లేదా "బ్రహ్మపదార్థం" అనే పరమవైదిక శబ్దానికి, పరమమైన తెలుగు మాట "అచ్చ తెలివి". ఇది ఆత్మపదార్థానికి దీటయిన మాట, ఈ విధంగా మరే భాషలోనైనా సాధింపబడిందేమో తెలియదు.

ఆ రామాయణ రచన చేస్తున్న రోజుల్లో మా కుటుంబం బందరులో ఉండేది. ఒక వేసవి రోజుల్లో బందరులో అగ్నిప్రమాదాలు జరుగుతున్నాయి. చుట్టుప్రక్కల యిళ్ళు కూడా అంటుకున్నాయి. అంతా, యిళ్ళల్లోని విలువైన వస్తువులు బయటకు తెచ్చుకుంటున్నారు. మానాయన గారు మాత్రం, రామాయణ కల్పవృక్ష వ్రాతప్రతినీ, కుటుంబ సభ్యులినీ తీసుకుని బయటకు వచ్చారట. కుటుంబ సభ్యులంటే - మా అమ్మగారూ, మా అన్నగారూ, మా అక్కగార్లిద్దరు. అప్పుడు మా అన్నగారు అచ్యుతదేవరాయలు గారు అడిగాడట, "అదేమిటి నాన్నా? సామాన్లేమీ తేవద్దా? " **అని.** మా నాయనగారు, "నాయనా, ఈ కల్పవృక్షం ఉంటే, అన్నీ ఉన్నట్టేనోయ్!" అని అన్నారట.. ఔను, తండ్రికి మాట యిచ్చి, సాగుతున్న జీవుని వేదన అది! అది ఉంటే, అంతా ఉన్నట్టే.

ఆ రామాయణ కల్పవృక్షం 1962 లో పూర్తి అయింది. ఈ మధ్యకాలంలో ఋతుసంహారము, ఝాన్సిరాణి, శ్రీకుమారాభ్యుదయము వంటి పద్యకావ్యాలు; వేయిపడగలు, చెలియలికట్ట, మాబాబు వంటి నవలలు; నర్తనశాల, వేనరాజు, అనార్కలి వంటి నాటకాలు పుంఖాను పుంఖంగా వ్రాస్తూనే ఉన్నారు.

1962 లో కల్పవృక్షం పూర్తిచేసి,

"దొరగారు దివాన్‌జీ" పెద్ద కుటుంబాల్లో ఎటువంటి రహస్యాలు వుంటాయో, ఆ రహస్యాల మూలంగా ప్రజలకు కలిగే యిబ్బంది, వివరించబడింది.

"వెలుగుమెట్లు" లో మనస్ఫూర్తిగా సన్యసించిన సన్యాసులకు, సన్యాసం వృత్తిగా స్వీకరించిన వారికి తేడా చెబుతూ ఎంతో అందంగా చిత్రీకరించిన కథ.

"జూ" కథ చిత్రమైన కథ. నన్నయగారు, కవిసమ్రాట్ ఓ జూను సందర్శించడం. వారి సంభాషణ - జూ లోని విచిత్ర సంఘటనలు. ఆంధ్రులకు గతంలో ఎటువంటి గుర్తింపు వుండేదో చెప్పారు విశ్వనాధ సత్యనారాయణగారు యీ కథలో.

"ఇంకొక విధము" చక్కని గల్పిక. ఒక మంచినటుని భావన. కొత్త నటుని భయం చిత్రించిన గల్పికయిది.

"సప్తాశ్వము" కథలో మానవచరిత్ర విప్లవముల యొక్క సమాహారమే అంటారు. ఏడుగురు విప్లవకారులు తమతమ చివరి వాఙ్మూలములే యీ కథలోని ప్రత్యేకత.

"చామర గ్రాహిణి" అంటే వింజామర వీచేది. అతి అంతఃపుర ఉద్యోగం. విదేశీ చామర గ్రాహిణి ఆంధ్రదేశానికి వచ్చి ఒక ఆంధ్ర చక్రవర్తి ఆస్థానంలో చేరింది. ఆమె ఎంత అందగత్తె అయినా ఆ చక్రవర్తి చలించలేదు. చక్రవర్తి నిగ్రహశక్తిని చాటి చెప్పిన కథ.

"అల్లాకేఫకీర్" మంచి కనువిప్పు కలిగించే కథ. బయటకు పరమ భాగవతోత్తములుగా కనిపిస్తూ లోలోపల ఎంతటి దుర్మార్గానికి ఒడికట్టేవాళ్ళుంటారో వివరించడం జరిగింది యీ కథలో.

మొత్తంగా పరిశీలిస్తే - ముప్పై కథలు వేరువేరు కథావస్తువులపై రచించారు కవిసమ్రాట్. గొప్ప వస్తు వైవిధ్యం, శిల్ప వైవిధ్యం, విషయవైవిధ్యం కనిపిస్తాయి యీ కథల్లో. ఈ కథలన్నీ చదవడం వల్ల కథలు ఎన్ని రకాలుగా రాయొచ్చో కూడా అవగతమౌతుంది. కవిసమ్రాట్ ఈ కథలు రాయడంలో ఎంత సర్వస్వతంత్రులో గోచరమౌతుంది.

వ్యాససూచి అనే గ్రంథంలో నేల నూతల శ్రీ కృష్ణమూర్తిగారు వ్యాసం అంటే విస్తరణ, విశదీకరణ అని వివరించారు. అందుచేత నేను యిదివ్యాసం అనుకోవడం లేదు. ప్రతి ఒక్క కథగురించి ఓ వ్యాసం రాయొచ్చు నిజానికి.

యీ రచన కేవలం - కవిసమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారి కథలు చదివాక నేను పొందిన రసానుభూతినీ, సాహితీ విందు మాధుర్యాన్ని మీకు కూడా పంచి పెట్టడానికి చేసిన ప్రయత్నమే యిది.

# గురు-ప్రశంస

గంధం నాగేశ్వరరావు

నేనున్ నేనుగ మిమ్మెఱుంగుదును తండ్రీ! విశ్వనాథాన్వయ
శ్రీనైష్ఠిక పరంపరానుగత కర్మిష్ఠాద్యనేకవ్రత
జ్ఞానానందతపః ప్రభావమయ తేజఃపుంజ దీవ్యత్కళా
ధీనప్రాభవ సంచితాకృతిగ, మద్దివ్యైకదైవంబుగా
నేనున్ నే నయి మిమ్మెఱుంగుదును తండ్రీ!సంస్కృతాంధ్రాంగ్ల భా
షానిక్షేప సుధారహస్యకలనా సాంగత్య చాతుర్యలే
ఖానైపుణ్య కళాప్రపూర్ణ పదవీ కల్యాణ మూర్తిచ్ఛటా
స్థానంబౌ నిధి, ఋక్కిటన్‌గను యగస్త్యస్వామి సారూప్యగా
నేనున్ మీరుగ మిమ్మెఱుంగుదును తండ్రీ! దానధర్మప్రియా
నూనోదంచిత యాశ్రితార్ధ్యతిథిబంధు వ్రాత తీర్థోల్బణ
ఖ్యానోదార దధీచి కర్ణ శిబి ప్రత్యామ్నాయ నిత్యాగ్నిహో
త్రానుష్ఠేయుని శోభనాద్రి సుతుగా రామాయణాఖ్యాతగా
నేనున్ శిష్యుడ మిమ్మెఱుంగుదును తండ్రీ! శిష్యవాత్సల్య సం
ధానోత్సాహ పరాపరార్ధసుఖ విద్యాదాన సంవర్ధ స
న్మానానేక కటాక్ష వీక్షణ కళా పారీణ దక్షత్వ దీ
క్షానీరంధ్రుగ, సద్గురూత్తమునిగా సాక్షత్ పరబ్రహ్మగా
బాహిరము కాకయుండెడి భక్తి లెస్స
యీ శరీర ధారులు లౌకికేచ్ఛు లగుచు
పార మొందక యుక్తులు పన్నుగాక
పార మార్థిక బుద్ధి నాపాలి కిడుడు.

# "అతిథిగ వచ్చినాడు"

డా.పేర్వారం జగన్నాథం

అది 1959-60 విద్యాసంవత్సరం. నేనప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ(తెలుగు) రెండవ సంవత్సరంలో ఉన్నాను. హాస్టలు 'ఏ' లో ఉండేవాణ్ణి. అందువల్ల చాలామంది తోటి విద్యార్థులతో పరిచయాలుండెడివి. అందునా కోవెల సుప్రసన్నాచార్యులు, మాదిరాజు రంగారావు వంటివాళ్ళతో అతిసన్నిహితంగా ఉండేవాణ్ణి. హాస్టళ్ళలో ఉండకున్నా, పరిశోధనచేస్తున్న కేతవరపు రామకోటిశాస్త్రిగారూ, ఎం.ఏ ఇంగ్లీషు చదువుతున్నా మొదలి నాగ భూషణ శర్మగారూ అప్పుడప్పుడు మా హాస్టలుకు వచ్చి మాతో సాహిత్య విషయాలు చర్చిస్తుండేవాళ్లు. అట్లాగే విశ్వవిద్యాలయంతో సంబంధంలేకున్నా అప్పుడప్పుడు కోవెల సంపత్కుమారాచార్యులుగారు కూడా మాకోసం హాస్టలుకు వస్తుండే వారు. అప్పట్లో జువ్వాడి గౌతమరావుగారు సుల్తానుబజారులో కార్యాలయం పెట్టి తన సంపాదకత్వంలో జయంతి మాసపత్రికను వెలువరిస్తుండేవారు. ఇది సాహితీ లోకంలో బాగా సంచలనం కలిగిస్తుండెడిది. సుప్రసన్నాచార్యులూ, రంగారావుగారలతో కలిసి నేనూ గౌతమరావుగారిని కలువడం కోసం జయంతి కార్యాలయానికి వెళ్లుతుండేవాళ్లం. ఇట్లా మాచుట్టూ చక్కని సాహిత్యవాతావరణం అల్లుకొని ఉండెడిది. పైన పేర్కొన్న మిత్రులంతా విశ్వనాథ సత్యనారాయణగారిని గాఢంగా అభిమానించే వాళ్లు. ఆరాధించే వాళ్లు. వారి సాహిత్యాన్నంతా బాగా అధ్యయనం చేస్తున్నవాళ్లు. నాకు విశ్వనాథపై గౌరవభావం ఉండేకాని వారి సాహిత్యాన్ని లోతుగా అధ్యయనం చేసిన వాణ్ణికాను. నేనా సంవత్సరం విశ్వవిద్యాలయంలోని తెలుగు "సారస్వత సమితి" కి అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాను. దానితరపున అనేక సాహిత్యకార్యక్రమాల్ని నిర్వహిస్తుండేవాళ్లం. తెలుగు సారస్వత సమితి ప్రారంభోత్సవానికి త్రిపురనేని గోపిచంద్, డా.సి.నారాయణ రెడ్డిగారల్ని ఆహ్వానించాము.

ఆ సంవత్సరం మేము నిర్వహించిన అతిపెద్ద కార్యక్రమం కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్యగానం. ఇది రెండురోజులు అంటే 24,25 అక్టోబరు 1959 తేదీలలో కోఠీలోని విశ్వవిద్యాలయ మహిళాకళాశాల దర్బార్ హాలులో జరిపించినాము. నగరంలోని సుప్రసిద్ధ సాహితీవేత్తలూ, సాహిత్యాభిమానులంతా పెద్ద సంఖ్యలో సభలకు హాజరైనారు. చాలామందికి సీట్లు లభించకున్నా, కార్యక్రమం చివరిదాకా నిలబడే ఉండి విన్నారు. ఆజనసమ్మర్దంలో దర్బార్ హాలులోని అతివిలువైన శాండిలేర్స్ ధ్వంసమైనాయి. అప్పుడా కళాశాల ప్రిన్సిపాలు శ్రీమతి శ్రీదేవిగారు నష్టపరిహారం చెల్లించవలసిందిగా నాకు నోటీసు ఇచ్చినారు. అదివేరే సంగతి. ప్రారంభసభకు అప్పుడు తెలుగు శాఖాధిపతులుగా ఉన్న ఆచార్యఖండవల్లి లక్ష్మీరంజనంగారు అధ్యక్షత వహించినారు. నేను సభకు స్వాగతం పలుకుతూ....

అతిథిగ వచ్చినాడు ఋషియంతటివాడు హిమాద్రియంత ఉ
న్నతమయి శుభ్రమైనదియు నాకధునీజలజాతమంత సు
న్నితమయి మెత్తనైనదియు నిర్మలమైన ఎడందవాడు ఆ
కృతి శివుడై మనోజ్ఞత నుపేంద్రుడునై సృజనావిధాతయై.

అనే పద్యంచదివినాను. అప్పుడు విశ్వనాథవారు నన్ను ఎగాదిగా చూసి అభినందించినారు. సభికులు కరతాళధ్వనులతో హర్షం వెలిబుచ్చినారు. ఇంతకూ ఆ పద్యరచయితను నేను కాదు. దాన్ని రచించినవారు 'రసబ్రహ్మ' సరస్వతీసాక్షాత్కారకర్త అనుములకృష్ణమూర్తిగారు. వారుకూడ అప్పుడా సభలోనే ఉన్నారు. సదస్సు చాలా రసవత్తరంగా రాత్రిదాకా సాగింది. ఐనా సభికులెవ్వరూ మధ్యలో లేచిపోకుండా శ్రద్ధాసక్తులతో కార్యక్రమం ముగిసేదాకా ఉండి విన్నారు. అట్లాగే మరునాడు రెండు సదస్సులు జరిగినాయి. ఒక సదస్సుకు పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించగా, మరొక సదస్సుకు నాయని సుబ్బారావుగారు అధ్యక్షత వహించినారు. నాగేశ్వరావుగారప్పుడు హైదరాబాదునుంచి "సంజయ" వారపత్రికను వెలువరిస్తుండేవారు. ప్రజాప్రభ పేరుతో కొంతకాలం ఒకదిన పత్రికను కూడ నడిపినారు. అప్పట్లో నా రచనల్ని ఈ పత్రికల్లో ప్రచురిస్తు నాగేశ్వరరావుగారు నన్నెంతో ప్రోత్సహించినారు. ఇట్లా ఈ

రామాయణ కల్పవృక్షకావ్యగాన సభలు నగర ప్రజల్ని అలరించినాయి. కావ్యరసానందంలో ముంచెత్తినాయి. విశ్వనాథవారు పద్యాన్ని శ్రావ్యంగాచదువుతూ రసవత్తరమైన ఘట్టాలకు చక్కని వ్యాఖ్యానంచేసేవారు. మధ్యమధ్య హాస్యమూ, వ్యంగ్యమూ కలసిన వారిచెణుకులు, చతురోక్తులూ సభికుల్ని బాగా ఆకట్టుకునేవి. వారేవిషయం మీద మాట్లాడినా సభారంజకంగా రసవత్తరంగా ఉండెడిది. ఈ కావ్యగాన సదస్సులు విజయవంతంకావడానికి మిత్రులు మాదిరాజు రంగారావుగారెంతో సహకరించినారు. తెలుగు సారస్వతసమితి సభ్యులు ఉత్సాహంతో తోడ్పడినారు. ఈ సమితిలో శ్రీమతి రావిభారతి మహిళా ప్రతినిధిగా ఉండేవారు. వీరు తెలంగాణా రైతాంగ సాయుధపోరాటాన్ని విప్లవపథంలో నడిపిన వీరయోధులు రావి నారాయణరెడ్డిగారి కూతురు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో నేను విద్యార్థిగా ఉన్నకాలంలోనే విశ్వనాథ నవలలపై వారి సమక్షంలోనే ఉపన్యాస కార్యక్రమమొకదాన్ని శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయంలో మిత్రులు ఏర్పాటుచేసినారు. మొదలి నాగభూషణశర్మగారు "ఏకవీర" నవలపై విశ్వనాథ వైపు అప్పుడప్పుడు భయపడుతూ చూస్తూ ప్రసంగించినారు. వేదికమీదున్న విశ్వనాథవారు ఆతని బుజంతట్టి ప్రోత్సహించినారు, కాని మేమూహించినట్లు దుయ్యబట్టలేదు.

వరంగల్లులోనూ, ఖమ్మంలోనూ అభిమానులు కొందరు పందొమ్మిది వందల అరవైలలో విశ్వనాథవారి రామాయణకల్పవృక్షకావ్యగానంతో పాటు ఉపన్యాసాల్ని కూడ ఏర్పరచినారు. వాటికీ నేను హాజరై మహదానందం పొందినాను. వారి ఉపన్యాసమైనా, కావ్యగానమైనా ఎంతోరక్తి కట్టేది. అదొకమధురానుభూతి.

నేను వరంగల్లులోని ఆర్ట్స్అండ్ సైన్స్ కళాశాలలో అరవైలలో అధ్యాపకునిగా పనిచేస్తున్నప్పుడు తరచుగా నేను విద్యార్థి సంఘానికి హితవరిగా ఉంటుండే వాణ్ణి. అట్లా ఒకసారి విశ్వనాథను మాకళాశాలకు ఆహ్వానించినాను. వారు దయతోఅంగీకరించినారు. వారిని స్వాగతించడం కోసం నేను రైల్వేస్టేషనుకు వెళ్లినాను. వారు రైలుదిగగానే ఎంతో వాత్సల్యంతో నన్ను పలుకరించినారు. నాతో ఉన్న పూర్వపరిచయాన్ని గుర్తుచేసుకున్నారు. మరునాడు అంటే 15-2-1967నాడు మా కళాశాలలో విద్యార్థులూ, అధ్యాపకుల్ని ఉద్దేశించి రసవత్తరమైన ప్రసంగం చేసినారు. మాకళాశాల ప్రిన్సిపాలు పి.ఎల్.ఎన్.శర్మగారు సభకు అధ్యక్షత వహించినారు. నేను స్వాగతం పలికినాను.

మనంకొంతవెనక్కి వెళ్లితే నేను ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.ఏ.లో చేరిన కొత్తలో, ఒకానొక మిత్రుని వివాహానికి నేనూ సుప్రసన్నాచార్యులూ కలిసివెళ్లి, తిరుగు ప్రయాణంలో విశ్వనాథను దర్శించడం కోసం విజయవాడలో ఆగినాము. వారి ఇంటికివెళ్లి వారితో కాసేపు సంభాషించినాము. వారెంతో ఆదరంతో మమ్మల్ని పలుకరించినారు. ఎన్నో విలువైన విషయాల్ని తెలిపినారు. సుప్రసన్నాచార్యులుగారు వారికి పూర్వపరిచితులే, నేను కొత్తవాణ్ణి.

మనం మరికొంత వెనక్కివెళితే నేను హనుమకొండలో ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల్లో కొంతమంది విద్యార్థులంకలిసి సాహితీ బంధు బృందం అనే సంస్థను స్థాపించినాము. దానికి కోవెల సుప్రసన్నాచార్యులు గౌరవాధ్యక్షులు. నేను ఉపాధ్యక్షుడిగా ఉంటిని. ఏ.లక్ష్మణ రావనే మరో తోటి విద్యార్థి కార్యదర్శిగా ఉండేవాడు. ఈ సంస్థను విశ్వనాథవారే ఫిబ్రవరి 1955 లో ప్రారంభించి ఆశీర్వదించినారు. సభకు ప్రజాకవి కాళోజి నారాయణరావుగారు అధ్యక్షతవహించిరి. ఈ సంస్థ తరఫున ఎన్నో గొప్పగొప్ప సభలు, సమావేశాలు, సదస్సులు జరిగినాయి. ఆధునికాంధ్రసాహిత్య చరిత్రను ఒక మలుపుతిప్పే సుప్రసిద్ధకావ్య సంచలనాత్మక వ్యాససంకలనాల్ని ఈ సంస్థ ప్రచురించింది. వాటిలో "చేతనావర్తం" రెండుసంపుటాలు, అభ్యుదయకవిత్వానంతర ధోరణులు వంటివి ప్రసిద్ధములు.

ఇట్లా కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారితో నాకీ కొద్దిపాటి పరిచయభాగ్యం కలగడం నాఅదృష్టంగా భావిస్తుంటాను. తెలుగు సాహిత్య క్షేత్రంలో వారొక ఉత్తాలహిమశిఖరం.

# కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి చిన్నకథలు - నా అనుభూతి

సి.ఎస్.రావు

ఒక రోజు ఉదయాన్నే ప్రముఖవిద్యావేత్త, సాహితీవేత్త డాక్టరు కొండలరావుగారు నాకు ఫోన్ చేశారు. "చెప్పండిసార్" అన్నాను. "విశ్వనాథ సత్యనారాయణగారి చిన్నకథలు మీరు చదివారా" అన్నారు "ఎప్పుడో రెండుమూడు కథలు చదివి ఉంటాను కాని విపులంగా తిరిగి చెప్పేటంత గుర్తులేదు" అన్నాను.

"పోనీలెండి, వారి చిన్నకథల పుస్తకం మీకు నేనిస్తాను. చదివి ఆకథల గురించి మీరో వ్యాసం రాయాలి" అన్నారు. నాకు ఒక పక్క ఆనందం మరోపక్క ఒకవిధమైన భయం. సత్యనారాయణగారి ముప్పైచిన్నకథలు చదివే అవకాశం వచ్చినందుకు ఆనందం. అంతటి మహోన్నత సాహితీమూర్తి కథల మీద నేను వ్యాసం రాయగలనా అన్న భయం. ఒక్క క్షణం నిశ్శబ్దం తరువాత కొండలరావుగారి ఆదేశానికి జవాబుగా "నేను" అని మాత్రం అనగలిగాను. సహృదయులైన కొండలరావుగారు "అవును మీరే. మీరు కథకులు. మీకథలు నేను చదివాను. మీరు సత్యనారాయణగారి కథల మీద వ్యాసం రాస్తే కొత్తగా కథలా అందరిచేత చదివించేలా ఒక కథలా సాగిపోతుందని నా విశ్వాసం" అన్నారు.

నాకు పాతికేళ్ళ క్రితం నాటి ఓ సంఘటన గుర్తుకు వచ్చింది. ప్రముఖ నాటక రచయిత డాక్టర్ కొర్రపాటి గంగాధర్ రావుగారు "ఆరనిపారాణి" నాటక వ్రాతప్రతిని, దానితో పాటు ఆనాటకానికి ముందు మాట రాయమని కోరుతూ నాకొక ఉత్తరం పోస్ట్‌లో పంపించారు. చదువుకుని వెంటనే డాక్టర్ గంగాధరరావుగారికి ఒక ఉత్తరం రాశాను. ఉత్తరంలోని సారాంశం ఏమిటంటే, ఒక్క "ఊరుమ్మడి బతుకులు" నాటిక మాత్రమే నేను రాశాను. మీరు ఎన్నో నాటికలు, నాటకాలు రాశారు. నేను కాలేజీ విద్యార్థిగా ఉండగానే మీ నాటకం "గుడ్డిలోకం" లో నటించాను. మీ నాటకానికి ముందు మాట రాయాలనుకొన్నది ఈ సి.యస్.రావు కాదేమో బహుశా ప్రముఖ చలనచిత్ర దర్శకులు సి.యస్.రావు గారిని అడగాలనుకున్నారేమో అంటూ డాక్టరు గారికి ఉత్తరం రాశాను.

ఆయన ఒక్క వాక్యంలో జవాబిచ్చారు. నా నాటకానికి ముందు మాట రాయమని కోరింది –ఊరుమ్మడి బతుకుల రచయిత సి.ఎస్.రావు గారినే. ఆనాడు డాక్టరుగారి నాటకానికి ముందుమాట రాయడానికి ఎంతో ఇబ్బంది పడ్డాను.

అలాగే ఈనాడు విశ్వనాథ సత్యనారాయణగారి చిన్నకథల మీద వ్యాసం రాయడానికి మరింత ఇబ్బంది పడుతున్నాను. ఎందుకంటే ఎక్కడ విశ్వనాథ సత్యనారాయణ ఎక్కడ సి.ఎస్.రావు. కాకపోతే ఒక గొప్ప ఆనందం. ఒకటి, రెండు కథలు కాకుండా ఒక మహారచయిత యొక్క ముప్పై కథలను చదివి అర్థం చేసుకుని ఆస్వాదించి ఆ అనుభూతిని పొందే అవకాశం నిజంగా ఒక అరుదైన అవకాశం. ఆ అవకాశం నాకు కలిగినందుకు మనసునిండా ఏదో ఆనందం. మెదడునిండా ఏమి రాయాలి ఎలా రాయలి అన్న ఆలోచన.

చదివాను. ముప్పై కథలు నాలుగు రోజుల్లో చదివాను. ఆ కథలు చదివిన నాలుగు రోజుల్లోనూ నాకు తెలీని ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గురించి కొంతవరకూ అవగాహన చేసుకున్నాను. వ్యాసం రాయడానికి పూనుకోబోయే ముందు ఎందుకో మరొక్కసారి ఆ కథలను చదవాలనిపించింది. పరిశీలనా దృష్టితో చదివాను. ప్రతికథ కొత్తగానే తోచింది. నిజానికి అవి కథలు కావు. కావ్యాలు. కావ్యలక్షణాలు గల చిన్నకథలు. ఆవగింజంత మర్రిగింజనుంచి మహావృక్షము ఉద్భవించినట్టు ఒక్కొక్క కథనించి ఒకో కావ్యమే రూపు దిద్దుకోవచ్చు. చిన్న గుమ్మడిగింజ నాటితే పాదుగా పాకి పుష్పించి గుమ్మడి పళ్ళను కాసినట్టు ఒక్కొక్క కథనించి సాహితీ కుసుమాలు పూసి సాహితీఫలాలే కాయచ్చు.

ఈ చిన్నకథల సంపుటిలో తొలికథ "విస్మృతి" లో సుఖములు మరిగి సాధనను విస్మరిస్తే ఎంతటి గొప్ప కళాకారులైనా తమకళను మరిచిపోతారనే సందేశాన్ని అందించారు కవిసమ్రాట్. ఆదరణ ఒక్కసారి ఉపకారమే అయినా ఒకేసారి అది మరీ ఎక్కువైతే శాపంగా మారే ప్రమాదం కూడా ఉందని తెలుస్తుందీకథలో.

అసలు కథను ఎక్కడ మొదలు పెడతారో ఎలా నడిపిస్తారో ఎలా ముగుస్తుందో పాఠకుని ఊహకందదు. వారికాలంలో బాల్య వివాహాలు పరిపాటి. చాలా కదల్లో పెళ్ళి కూతుళ్ళందరూ పది, పదమూడు సంవత్సరాల వయస్సు కలవారే.

''భావనాసిద్ధి'' కథలో ఊర్మిళా లక్షణ స్వాములు మేనత్త మేనమామ బిడ్డలు. దగ్గర పోలికలుగల వాళ్ళు. ఊర్మిళకు తాను అందగత్తెననే నమ్మకం. లక్షణస్వామికి తాను అందంగా ఉన్నానని ఊర్మిళ చేత అనిపించాలనే తాపత్రయం. చాలా విచిత్రంగా ఈ కథను నడిపి స్త్రీగా అలంకరించుకున్న లక్ష్మణస్వామిని చూసి ఊర్మిళ ఎంత అందంగా ఉన్నావే అంటుంది. ఆనాటి నుంచి ఊర్మిళా లక్ష్మణస్వాముల మధ్య మరింత ప్రేమ పెరిగినది. ఊర్మిళ తన ఓటమిని ఒప్పుకుంది. ఇదొక చిత్రమైన కథ. పురుషునిలో కొన్ని స్త్రీ లక్షణములు, స్త్రీలో కొద్దిపాటి పురుషలక్షణములు ఉండడం. అందమేమో అనిపిస్తుంది.

''పరిపూర్తి'' కదలో సత్యనారాయణగారు చంద్రశేఖరరావు అనే ఒక గొప్ప మానవతావాదిని సృష్టించారు. రాధ అనే ఒక గుడ్డిపిల్లను చంద్రశేఖరరావు పెళ్ళిచేసుకుంటారు. వారిద్దరి మధ్య అనురాగం పెరుగుతుంది. ఒకరిని విడిచి ఒకరు ఉండలేరు. తాను గుడ్డిదానినని, తాను నలుపని అనుకునే రాధకు ఆ బాధను తొలగించాలని చంద్రశేఖరరావు సర్వవిధాలా ప్రయత్నిస్తారు. రాధ తల్లి అవుతుంది. బిడ్డను కంటుంది. అబ్బాయి కళ్ళు మీకళ్ళలాగే ఉన్నాయటగా అంటుంది చంద్రశేఖరరావు భార్య. చంద్రశేఖరరావు నవ్వుకుని ''అబ్బాయి నీకు కళ్ళు తెచ్చినట్లున్నాడు'' అన్నాడు. ఈ చిన్న వాక్యంలో ఎంతో భావం ఇమిడివుంది. రాధ చూడలేని లోకాన్ని రాధబిడ్డ చూడగలడు. రాధబిడ్డ లోకాన్ని చూస్తే రాధ చూసినట్టే ఆలోకాన్ని. ఇంత భావగర్భితంగా కథను ముగించడం కవిసమ్రాట్‌కే చెల్లిందేమో అనిపిస్తుంది.

''రోధము'' కథ చాలా చిన్నకథ. ఒక బిచ్చగత్తె అందమైనది. ఒక కలిగిన కుర్రాడు ఆమె అందాన్ని చూసి ఒక రూపాయి ఇవ్వబోతే ఆమె తిరస్కరించి వెళ్ళిపోతుంది. స్త్రీ బిచ్చగత్తె అయినా తన గౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని ఎంత చక్కగా కాపాడుకుంటుందో ఈ కథలో స్పష్టమవుతుంది.

''జమిందారు కొడుకు'' కథలో పేదింటి పిల్ల పున్నమ్మ రాజారావు అనే ఒక చదువుకున్న కుర్రవాని భార్య కావడం, అతను ఇంగ్లాండుకు వెళ్ళిపోవడంతో పున్నమ్మ కష్టాలు ప్రారంభం కావడం, రాజారావు మేనమామ ఇంట్లో ఉంటున్న పున్నమ్మ యింటినుంచి గెంటివేయబడడం.. ఈ కథలో పెళ్ళిచేసుకుని భార్యలను వదిలేసి విదేశాలలో స్థిరపడిపోయిన ఈ తరం యువత మనకు గుర్తుకు వస్తుంది. కాని కథ ముగింపులో సత్యనారాయణగారు ఒక జమిందారు కొడుకు ఆదరణను పొందిన పున్నమ్మ ఒక బిడ్డకు తల్లి కావడం, తన భర్త రాజారావును చూడగానే జమిందారు కొడుక్కి తనకీ పుట్టిన బిడ్డను కూడా మరిచిపోయి భర్తతో వెళ్ళిపోవడంతో కథముగుస్తుంది. ఈ కథలో పున్నమ్మ అనే స్త్రీ పాత్ర ఎంతో స్వేచ్ఛగా వ్యవహరిస్తుంది. ఎక్కడా సనాతన ధర్మోద్ధారకుడు అనిపించుకున్న సత్యనారాయణగారు ఈ పాత్రను విమర్శించలేదు. తప్పుపట్టలేదు. కవిసమ్రాట్ విమర్శకులకు యిది మింగుడు పడని కథ.

''నీరుణం తీర్చుకున్నా'' కథలో పిల్లలులేని దంపతులకు యిరుగుపొరుగు వారి పిల్లల పట్ల ఎంత ప్రేమ పుట్టుకొస్తుందో, పొరుగింటి పిల్లలను తమ పిల్లలుగా భావించడం వలన వచ్చే యిబ్బందులు, ఎదురయ్యే సమస్యలు స్పష్టమవుతాయి. కన్న ప్రేమకంటే పెంచిన ప్రేమ ఎంత గాఢమైందో ఈ కథలో స్పష్టం చేశారు సత్యనారాయణగారు. పరాయిబిడ్డను తమ చేతుల మీదుగా పూడ్చిపెట్టి తాము బిడ్డను కని బిడ్డను పోగొట్టుకున్న తల్లిదండ్రులకు అందివ్వడం జరుగుతుంది. పసిపిల్లల మరణాలు పాఠకునికి బాధగానే వున్నా స్నేహబంధం ఎంత గొప్పదో ఈ కథలో స్పష్టమవుతుంది.

''తిరోధానము'' కథలో మహాశ్వేత, నీలలోచనులు దంపతులు. మహాశ్వేతకు అలంకరణలంటే ఇష్టములేదు. నీలలోచనుడికి అలంకరణలంటే ఇష్టం. వారి విభిన్నమైన అభిరుచులు. నీలలోచనుడు మహాశ్వేతకు పదహారేళ్ళు వచ్చేసరికి మరణించాడు. మహాశ్వేత అన్నగారి మిత్రుడు రాధారామ్ ఆమె జీవితంలోకి ప్రవేశిస్తాడు. వారి ఇరువురి అభిరుచులు కలుస్తాయి. నీలలోచనుడిని మరచి మహాశ్వేత రాధారామ్‌కి చేరువై భార్య అవుతుంది. ఈ కథలో కవిసమ్రాట్ వితంతు వివాహాన్నే ప్రోత్సహించారు. సమాజంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా కవి కూడా మారడం ఒక సహజ పరిణామం. ఈ కథ ద్వారా సత్యనారాయణ గారిలో ఒక సంస్కర్త కూడా కనిపిస్తాడు.

మచ్చుకి కొన్ని కథలు వివరించాను గాని, అన్ని మచ్చుతునకలే యీసంపుటిలో.

కర్మసిద్ధాంతాన్ని నొక్కిచెప్పే కథ ''పుణ్యప్రేమ''. తల్లిదండ్రులప్రేమ నిష్కల్మషమైతేనే వారిశిశువులు దీర్ఘాయువులగుదురని వివరిస్తారీ కథలో.

''పరిశోధకులు'' వ్యంగ్యకథ. ఆరోజుల్లో యింగ్లీషు భాషమీద జనానికి ఎంత మమకారం వుండేదో చాటి చెప్పిన కథ. ఇంగ్లీషు నేర్చిన వాళ్ళే మహామేధావులు, గొప్పవాళ్ళు అనుకొనే ధోరణి మీద సెటైల్.

''య్యో-ర్లీషీఖెయ్'' కథ చదివితే సత్యనారాయణగారు ఎంతటి పరనా సక్తి గలవారో స్పష్టమౌతుంది. వారికి విదేశీ సంగీతం పట్లగల అవగాహన, నీగ్రోజాతివారి జీవిత విధానాలూ, సంగీతమునందు వారి ప్రతిభ, వారిదేశభక్తీ మొదలైనవాటి పట్లగల అవగాహనా తేటతెల్లమైనాయి యీ కథలో.

తన దేశాన్ని తాను ప్రేమించడం సహజమే. తన దేశాన్ని ప్రేమించే మరో దేశభక్తున్ని గౌరవించడం ఆ వ్యక్తిని కథావస్తువుగా తీసుకోవడం ''కవిసమ్రాట్'' ప్రత్యేకత. ఆ దేశభక్తుడు పాడిన గీతాన్ని కూడా యీ కథలో పొందు పరిచారు సత్యనారాయణగారు.

''డయాన్థస్'' గ్రీకుకథ. సత్యనారాయమగారి కాల్పనిక శక్తికీ - ఈర్ష్య ఎంత చెడ్డదో చెప్పడానికి యీకథ నిదర్శనం.

కాళిదాసు అపకీర్తి చాలా గొప్పకథ. యుగయుగాల సాహితీ ఉద్దండులను వివరించడానికి యీ కథలో సత్యనారాయణగారు ప్రయత్నించారు.

బ్రహ్మ, వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు నాలుగు యుగాలకు వాఙ్మయ లోకాలకు బ్రహ్మలైనారు అంటారు సత్యనారాయణగారు.

మాక్లీ దుర్గంలో కుక్క! వర్ణసంకరాన్ని నిరసిస్తూ - జాతి సంకరం, కులసంకరం జరిగితే సంభవించే పరిణామాన్ని వివరిస్తూ సాగిన కథయిది.

''జీవుని యిష్టము'', ''గోల్‌మహల్'' నియంతలను నిరసిస్తూ - నియంతలను ఎదిరించే సాధారణ వ్యక్తుల్ని అభినందిస్తూ సాగిన కథలు. చావు సహజంగా రావాలని, ఆత్మహత్యను నిరశించే కథ గోల్‌మహల్.

''ద్విజాత'' ఒక సినిమానటి పై కథ. సినిమా నటీమణులలోను, నటనలోనూ ఎంత కృత్రిమత్వం అసహజం వుంటాయో వివరించారీ కథలో సత్యనారాయణగారు.

''కపర్ది'' ఓగొప్పకథ. అభ్యుదయ వాదం, మానవతావాదం కలబోసిన కథ. నీవు మహాపురుషుడవని ప్రశంసించవలయునో, కులభ్రష్టుడవని నిందింపవలయునో నాకు తెలియుటలేదంటాడు రచయిత.

''ఏమి సంబంధం'' మరో గొప్పమానవతా బంధాలకు, సంబంధాలకు సంబంధించిన కథ. మనుషులు ఎప్పుడు, ఎందుకు ఎలా కలుస్తారో ఎలావిడిపోతారో, చివరకు ఎలాకలుస్తారో తెలియజెప్పేకథ.

అలాగే విప్లవకారుడి భార్యకు అత్తింటిలో వుండే గౌరవం - ఆమెపై కుటుంబ సభ్యుల అమానుష ప్రవర్తనా - భర్తలేకపోతే స్త్రీ కి దక్కే గౌరవ మర్యాదలు శకుంతల విధికి ఎవరు కర్తలు? కథలో చిత్రించారు, ఎంతో సహజంగా కవిసమ్రాట్.

''ఆద్యంతములు'' మరోగొప్పకథ. కవిసమ్రాట్‌కు ఎంతటి వైదిక వాఙ్మయ అవగాహనగలదో స్పష్టమవుతుంది. అంగిరశ్శీలి ఒక విధంగా నాస్తికుడు. మృత్యువును జయించినవాడు. కాని చివరకు మరణిస్తాడు. దేవుడున్నాడన్న వాదనను బలంగా చెప్పిన కథయిది.

''ఉరి'' కథలో సామాన్యుడికి, పేదవాడికి యీ సమాజంలో బతకడం కంటే జైలే సుఖమని, ఉరిశిక్ష పేరున కొన్నాళ్ళైనా తిండికి లోటులేకుండా బ్రతకవొచ్చని సారాంశం. ఇది ఒక వ్యంగ్యకథ.

''ముగ్గురు బిచ్చగాళ్ళు'' గమ్మత్తైన కథ. మాఫియా గేంగ్‌ల గురించి, అండర్‌గ్రౌండ్ డాన్స్ గురించి చాలా గుంభనంగా చెప్పబడిన కథ. మధ్య తరగతి సంసారులు తప్పమిగిలిన వాళ్ళంతా ఏదో రకమైన బిచ్చగాళ్ళేనని, బిచ్చగాళ్ళ యీ వ్యవస్థను నిర్దేశిస్తున్నారని నిరూపించిన కథయిది.

''దొరగారు దివాన్‌జీ'' పెద్ద కుటుంబాల్లో ఎటువంటి రహస్యాలు వుంటాయో, ఆ రహస్యాల మూలంగా ప్రజలకు కలిగే యిబ్బంది, వివరించబడింది.

''వెలుగుమెట్లు'' లో మనస్ఫూర్తిగా సన్యసించిన సన్యాసులకు, సన్యాసం వృత్తిగా స్వీకరించిన వారికి తేడా చెబుతూ ఎంతో అందంగా చిత్రీకరించిన కథ.

''జూ'' కథ చిత్రమైన కథ. నన్నయగారు, కవిసమ్రాట్ ఓ జూను సందర్శించడం. వారి సంభాషణ - జూ లోని విచిత్ర సంఘటనలు. ఆంధ్రులకు గతంలో ఎటువంటి గుర్తింపు వుండేదో చెప్పారు విశ్వనాథ సత్యనారాయణగారు యీ కథలో.

''ఇంకొక విధము'' చక్కని గల్పిక. ఒక మంచినటుని భావన. కొత్త నటుని భయం చిత్రించిన గల్పికయిది.

''సప్తాశ్వము'' కథలో మానవచరిత్ర విప్లవముల యొక్క సమాహారమే అంటారు. ఏడుగురు విప్లవకారులు తమతమ చివరి వాఙ్మూలములే యీ కథలోని ప్రత్యేకత.

''చామర గ్రాహిణి '' అంటే వింజామర వీచేది. అతి అంతఃపుర ఉద్యోగం. విదేశీ చామర గ్రాహిణి ఆంధ్రదేశానికి వచ్చి ఒక ఆంధ్ర చక్రవర్తి ఆస్థానంలో చేరింది. ఆమె ఎంత అందగత్తె అయినా ఆ చక్రవర్తి చలించలేదు. చక్రవర్తి నిగ్రహశక్తిని చాటి చెప్పిన కథ.

''అల్లాకేఫకీర్'' మంచి కనువిప్పు కలిగించే కథ. బయటకు పరమ భాగవతోత్తములుగా కనిపిస్తూ లోలోపల ఎంతటి దుర్మార్గానికి ఒడికట్టేవాళ్ళుంటారో వివరించడం జరిగింది యీ కథలో.

మొత్తంగా పరిశీలిస్తే - ముప్ఫై కథలు వేరువేరు కథావస్తువులపై రచించారు కవిసమ్రాట్. గొప్ప వస్తు వైవిధ్యం, శిల్ప వైవిధ్యం, విషయవైవిధ్యం కనిపిస్తాయి యీ కథల్లో. ఈ కథలన్నీ చదవడం వల్ల కథలు ఎన్ని రకాలుగా రాయొచ్చో కూడా అవగతమౌతుంది. కవిసమ్రాట్ ఈ కథలు రాయడంలో ఎంత సర్వస్వతంత్రులో గోచరమౌతుంది.

వ్యాససూచి అనే గ్రంథంలో నేల నూతల శ్రీ కృష్ణమూర్తిగారు వ్యాసం అంటే విస్తరణ, విశదీకరణ అని వివరించారు. అందుచేత నేను యిదివ్యాసం అనుకోవడం లేదు. ప్రతి ఒక్క కథగురించి ఓ వ్యాసం రాయొచ్చు నిజానికి.

యీ రచన కేవలం - కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి కథలు చదివాక నేను పొందిన రసానుభూతినీ, సాహితీ విందు మాధుర్యాన్ని మీకు కూడా పంచి పెట్టడానికి చేసిన ప్రయత్నమే యిది.

# మధ్యాక్కఱల్లో విశ్వనాథ

డా. ఆచార్య తిరుమల

ఒక నాస్తికుడు పరిపూర్ణ కవి కాలేడు. కవి అనేవాడు తప్పక వేదాంత విషయ పరిజ్ఞాని కావాలి. గొప్ప తాత్త్వికాభినివేశ సంపన్నుడై ఉండాలి. అతనికి లోకంతో బాటు "అలోకంబగు పెంజీకటి కవ్వల నెవ్వండేకాకృతి వెలుగు, నతని" తో నిత్య సంబంధం కలిగి వుండాలి. అలా కాకుండా, వేద పురాణోపనిషత్ శాస్త్రగత విజ్ఞానం లేకుండా తన కాలాన్ని, తన చుట్టూవున్న సమాజాన్ని మాత్రమే వర్ణించే కవి. ఎంతటి ప్రతిభావంతుడైనా అతని కవిత్వం పాక్షిక సత్యమే అవుతుంది కానీ పరిపూర్ణ సత్యం కాలేదు. ఎందుకంటే, అటువంటి కవిలో తెలియని విషయాలే ఎక్కువగా ఉంటాయి కాబట్టి. ప్రాచీనుల్లో నాస్తిక కవులెవరూ కనిపించరు. కవులే కాదు రాజులు కూడా ఏదో ఒక మహాశక్తిని విశ్వసించి, పూజించి, ప్రోత్సహించిన వారే. అందుకే, అటువంటి వారి రచనలు, నిర్మాణాలు నేటికీ శిరోధార్యమవుతున్నాయి. కారణం వాటిలో వుండే శాశ్వత ధర్మ ప్రతిష్ఠ, అప్రతిహతమైన ఆత్మ శక్తి. అటువంటి సంప్రదాయ కవికోటికి చెందిన చివరి ఆంధ్రమహాకవి శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు. ఆయన రచనలన్నిటా ధర్మధ్వని ప్రతిధ్వనిస్తుంది. భారతీయ ఋషిసంప్రదాయం ప్రతిఫలిస్తుంది. ఆయన జీవితంలో, వ్యక్తిత్వంలో, కవిత్వంలో ఇహ-పరాలు సంగమించాయి. వాక్కు - బ్రహ్మవాక్కు అయ్యింది. దానికి చమత్కారం ఊపిరి అయ్యింది. ఆ పరిపూర్ణ మేధాసంపద తన పాఠకుల్ని తానే సృష్టించుకుంది. విశ్వనాథ సాహిత్యం అందరికీ కాదు. అందరిదీ. అదో జీవనది. ఎవరి అవగాహనం వారిది. నిజానికి ఏ మహావిషయమైనా అంతే! అదే ఆధునికాంధ్ర సాహిత్య రంగంలో విశ్వనాథ వారి విశిష్టత, ప్రత్యేకత!

ధరణీ సురుడు ప్రశాంతుడు<br>
గురుభక్తుడు శుచియు గల్పకుడు పూర్వకవీ<br>
శ్వర వాక్ప్రయోగ దక్షుడు<br>
కరుణామతి యెవ్వడతడు కవియన బరగుర్!!

అనే అప్పకవి/కవినిర్వచనానికి చక్కని ఉదాహరణ విశ్వనాథవారు. ఆయన తాత్త్వికాభినివేశాన్ని, భక్తి పారవశ్యాన్ని, దైవంతో ఆయనకు గల బాంధవ్యాన్ని, జనన మరణాల మీద ఆయనకు గల సాధికారిక భావాన్ని, సంసార-నిస్తారాల మీద ఆయనకు గల అవగాహనాన్ని- ఆయన రచించిన మధ్యాక్కఱ కావ్యసంపుటి ద్వారా తెలుసుకోవచ్చు.

మధ్యాక్కఱ ఛందస్సులో విశ్వనాథ వారు రచించిన పది శతకాల సంపుటి విశ్వనాథ మధ్యాక్కఱలు. ఇందులో శ్రీగిరిశతకం, శ్రీకాళహస్తి శతకం, భద్రగిరిశతకం, కులస్వామిశతకం, శేషాద్రిశతకం, ద్రాక్షారామశతకం, నందమూరు శతకం, నెకరుకల్లు శతకం, మున్నంగి శతకం, వేములవాడ శతకం - అని 10 శతకాలున్నాయి. అంటే 1000 పద్యాలు. వీటిలో 4 వైష్ణవపరంగాను, 6 శైవపరంగానూ ఉన్నాయి. విశ్వనాథ వారికి శైవ, వైష్ణవ మత భేదం లేదనటానికిదే ఉదాహరణ. అందుకే ఒకసారి నేను

శైవ వైష్ణవ దేవాది దేవ సేవ<br>
జేయ బ్రహ్మవతారుడై క్షితిగవీంద్రు<br>
డయ్యెనో! తనయింటి పే రయ్యె విశ్వ<br>
నాథ, సత్యనారాయణ నామ మయ్యె

అని విశ్వనాథ వారిని త్రిమూర్త్యాత్మక స్వరూపులు గా కీర్తించాను. మధ్యాక్కఱ పద్యాలు, శతకాలు ఆయన ఆస్తిక్య భావాలకు అక్షర దర్పణాలు.

దృశ్యమానమైన యీ విశ్వసంస్థ అధిభూతం, ఈశ్వర సంస్థ అధిదైవతం, జీవ సంస్థ ఆధ్యాత్మం. అధి దైవం నుండి అధిభూతం, ఈ రెండింటి నుండి ఆధ్యాత్మ సంస్థ వెలుస్తాయి. ఆధ్యాత్మ సంస్థ ద్వారానే ఈశ్వర. విశ్వ సంస్థల్ని గూర్చి తెలుసుకోవలసి వుంది. అంతకంటె గత్యంతరం లేదు. నా న్య : పంథా! అందకే మానవుడి కెంత తెలివున్నా, భగవత్తత్త్వం ఏమిటో తెలియకపోతే పరమ చరమ

లక్ష్యం సిద్ధించదు. ఆ విషయం రూఢిగా తెలియటం వల్లనే విశ్వనాథవారు పరతత్త్వం వైపు మ్రొగ్గి రచనలు సాగించారు.

ఈమేని త్రాసుతోదూచుచున్నాన యీవైపు మొగ్గ
స్వామి క్రమముగా దగ్గిపోయె భవద్దిశ క్రొగ్గి
యీమేను కాకీక బరువు లేదాయె నీవె తూగెదవు
సోమ కిరీట శ్రీ శైల మల్లికార్జున మహాలింగ!

ఇదో శరీర తులాభారం. ఈ శరీరంతో ఈశ్వరుని తూచటం. ఈశ్వరుడే తూగాడి శరీరం కాకీకలా తేలికైపోయింది. దాంతో అయ్యిందా? మరో సందేహం పట్టుకుంది -

"హరా! నన్ను నే నీకు సర్వమర్పించి నప్పటినుండి
బరువు దించిన యట్టులుండి దేలిక పడితినుమేశ!"

ఇక్కడ వరకు పర్వాలేదు - వెంటనే "బరువు నాయది నాకు నెత్తిన పాపమ్ము కలదా యరయంగ నేర శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవా!" ఈ విచికిత్సలో కంఠ దఘ్నంగా పశ్చాత్తాప భావం వెల్లువెత్తింది. "అయ్యయో! పాపపుటూహలందు పుణ్యపు టూహ లేరుటయ్యె నా బ్రతుకు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ!" అనటమే కాదు

కాళ్లను బద్ధ పామెట్టు లైనను గరవకపోదు
గూళ్లయ్యె నామేను పాముల కటంచు గూర్చుండబోకు
సుళ్లైన నామన్కి జేయ బోకువె సున్నకు సున్న
హళ్ళికి హళ్ళి శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ!

అని శారీరక విషబంధాల్ని వెల్లడిస్తూ వేడుకుంటారు. గూళ్లయ్యె నామేను పాముల కనటంలో ఈశ్వరాద్వైత స్థితి ద్యోతకమవుతుంది. అందుకే -

ఈ విలక్షణమైన దేహమున్ నాకు నిచ్చితి నేను
నీ వెంబడి వచ్చువేళ నన్ను క్షణింపగా నే మొ
దైవమా! దూకిరావచ్చు మరియడ్డు దారులు గలవు
కావలెనన్న, భీమేశలింగ! ద్రాక్షారామ సంగ!

ఇది విలక్షణమైన శరీరం. దీనిలో అన్నీ సాధ్యం కావు. దీనికి పరిమితి వుంది. ఈశ్వర శక్తి అపరిమితం కాబట్టి ఏదారినైనా దూకిరావచ్చు - ఇక్కడ జాగ్రత్తగా పరిశీలిస్తే -

యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం
మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః!!

శ్లోకం సుళ్లు తిరిగింది. ఈశ్వరునికి అడ్డదారుల్లో దూకి రావచ్చునని విశ్వనాథ వారి సలహా! ఈశ్వరుడంత వెర్రివాడా? ఇటువంటి సలహాలు అతనెందుకు వింటాడు? కథ మళ్లీ మొదలై, విశ్వనాథ వారిలో నిరాశా నిస్పృహలు చోటు చేసుకోవటం సామాన్యమయ్యింది - ఇంక ఈశ్వరుని దుయ్యబట్టటం మొదలు పెట్టారు-

నన్ను గాదనుటకు వీలులేదురన్నా! లోకమందు
నెన్ని దుర్గుణముల వుండవలయు దండ్రి! యన్నియుండి
అన్నిటికిం దలకట్టుగా నున్నదయ్య పట్టుదల
యన్నలా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి!!
"అపిచేత్ సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః !!"

గీతార్థమైన తానొక దుర్గుణాల పుట్ట. తలకట్టుగా పట్టుదల. అది, దేన్నయినా సాధించటానికి కావల్సిన అర్హత. అందుకే, ముందు మంచిగా – "మృడ! జీవగత భవదూహ సంస్కారమిది తొలగింపు మని" తర్వాత కొంచం కరకుగా "నను స్వీకరించి యీ పీడ వదిలించు కొమ్ము హరహరా!" అని సలహాయిస్తారు. అంతేకాదు

ఒక్కదాసికి మై కొకిబికి సరిజేయుటొక గొప్ప గాదు
కక్కసించిన సుయోధనుని మనసు వంకర దీర్చలేదె
ఒక్కడా! నాయెద వేయిమంది దుర్యోధనుల్ గలరు
చిక్కించుకోరాదె, వేంకటేశ్వరా! శేషాద్రినిలయ!!

అంటారు.... ఇలాగే పూర్వసాహిత్యంలో కవిరాక్షసుడొకడు మహాచమత్కారంగా –

కరినేలింది హుళక్కి, ద్రౌపదికి కోకల్ మెచ్చి యిచ్చింది ద
బ్బర కాకాసురునిం గటాక్షమున జేపట్టిం దబద్ధం బహో!
శరణన్నన్ బగవాని తమ్మునికి రాజ్యంబిచ్చుటల్ కల్లయి
త్తరి నన్నేలిన నిక్కమీ కథలు, కృష్ణా! దేవకీ నందనా!!

అంటూ భగవంతుని నిలేశాడు. విశ్వనాథవారి పక్షం కూడా అదే! ఏవిధంగానూ మాట వినకపోయే సరికి విరక్తి.

"నమ్మితి నుపనిషదర్థముల్ నిన్ను నమ్మితి, నిన్ను
నెమ్మెయి నమ్మనో నీవు చేసెడి దేమియు లేదు"

అనటమేకాదు – "నీవు నా మనసులో నుండి యెపుడు కంరే కాల! తొలగి పోవను నొక తృప్తి విడిచి నీవల్ల పొందినదేమి? పావనంబైన నీ వెల్గు చూపించు పాపాన బోవు" అని కూడా అంటారు. ఇందులో నిస్స్వార్థమైన, అనన్యమైన యీశ్వర చింతన వుంది. ఈ అనన్య చింతనా విశేష నిస్పృహతోనే విశ్వనాథ మరో అడుగు ముందుకు వేసి యిలా అంటారు .

బొట్టు కాటుక పెట్టి నీవు పిలిచిన పొలుపేమి లేదు
వట్టి నాయంతనే నిన్ను పట్టుక ప్రాకులాడెదన
యిట్టె నన్ సరిగ పొమ్మన్న జేసెడి దేమియు లేదు
రట్టగు, నందమూర్నిలయ!విశ్వేశ్వరా! కులస్వామి!!

జీవేశ్వర సంబంధం మానసిక వ్యవహారమే కానీ లౌకికమైన పేరంటం కాదు. లోకంతో సూర్యుని కేమిపని? కానీ సూర్యుడు లేకుండా లోకం ఉంటుందా? ఈశ్వర జీవస్థితి కూడా యింతే. భాగవతంలో గజేంద్రుడు కూడా "కలడు కలండనెడు వాడు కలడో లేడో!"అని సందేహించటం లోని ఆర్తి చాలా గొప్పది. విశ్వనాథ వారి స్థితి కూడా అదే.

నీవు లేవన లేవంచు వాదించు నిర్భయ దైత్య
భావంబె మేలనిపించు, నీవు కన్పడుట నిశ్చయము
భావించి యున్నావటంచు మేమేమి బావుకొన్నాము?
సేవోరు మతి దక్క, వేంకటేశ్వరా! శేషాద్రినిలయ!!

అని నిర్భయ దైత్య భావమే సరియైన దేమో అనుకుంటూ
"ఎంచి నీవిట్టులుందువని యంచును, నిచ్చోటనుందు
వంచును నియమంబు లేని యపుడు, లేవనిన దప్పేమి?
వంచన యెవరికి?" అనికూడా [illegible]రు.

"కొలువులోని కంబము చీల్చి గుండె చించి రా నీపని–" అని తదాగత రహస్యాన్ని కూడా ఆవిష్కరిస్తారు. ఈశ్వర విద్య అంతా హృదయ విద్య. "భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః" గుండె చీల్చుకుని చూస్తేనే గానీ పావనమైన ఆ వెలుగు కనిపించదు.

ఈశ్వర ప్రాప్తికి శరీర మీమాంస మాత్రమే చాలదు. మృత్యులక్షణం కూడా తెలియాలి." మృత్యోర్మా అమృతంగమయ" అని కదా ఉపనిషత్సూక్తి. విశ్వనాథ వారికి మృత్యుస్థితి మీద చాలా గొప్ప వైజ్ఞానిక అవగాహన ఉంది.

చచ్చిపోయిన వారి గూర్చి యేమి యోజన చేసినాను
ఇచ్చట వార్తేక యేమి? యిచ్చట నే నుండి యేమి?
యిచ్చట నిదియంచు దెలియు దెలియరాదిచట నదేమొ
యచ్చట నందమూర్నిలయ!

– అంటూ జీవితం మీద సింహావలోకనం చేసుకుంటూ "పులిమీది పుట్రనా నిత్య మృత్యువు భయమికేమి? ముక్తి వ్రతంబు నిత్రుపవాసముల్" అని ఆ మృత్యు భయాన్ని సమీక్షించుకుంటూ –

మృతి గల్గు నన్న దానికి భయంపడ నేనింతయైన
మృతి వేళలో భయంపడుదునో యన్నదే భయంబయ్యె
మృతి యెన్ని పూర్వ జన్మములయందు నయ్యెనో యలవాటు
శ్రితరక్ష! కాలేద, వేంకటేశ్వరా! శేషాద్రినిలయ!!

చావటమనేదొక అలవాటుట! ఎన్ని పుట్టుకలు తెలిస్తే యీ మాట అనగలుగుతారు? అందుకే తరుణోపాయాన్ని తెలియజేస్తూ –" మృత్యువు నాడెదరేల? ఉన్న మృత్యువు కంటె మిత్రమున్నదే యున్నన్ని నాళ్లు నిన్నెంచుచున్నచో, భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ!" అని తారక మంత్రోపదేశం చేస్తారు. ఇది సంసార చక్రం. చావు పుట్టువులనేకం తిరిగి పోతూనే వుంటాయి. దీనికి మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః , మనస్సేకారణం. అందుకే విశ్వనాథ –

నీయీ శరీరముల్ నడుమ మనసు వంతెన కట్టియుండె
నాయీ మనస్సుతో రాకపోకలు నడచుచునుండె
నాయయ్య! నన్ను నీ కడకు లాగుక నడిమి వంతెనను
రాయించు, నందమూర్నిలయ విశ్వేశ్వరా! కులస్వామి!!

అంటూ ఇహ-పరాలకు మనసుని వంతెనగా అభివర్ణిస్తారు. ఈ రాకపోకల్లో సాధించినదేమిటో తెలియదు. ఏ మానరక్షణకు ఏ వస్త్రం వేసుకున్నామో తెలియదు.

పలపల పుట్టుకల్ చావు లాసులోపలి కండె వోలె
సిలుగులై తిరిగితి గాని సుంత నేసిన బట్టలేదు
చలమొప్ప నేటి కీమాత్ర నేతగా సాగెడు నిద్ది
జలుగవో మన్నదో, నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి!!

ఇది శ్రీకాళహస్తిలోని 'శ్రీ' సంచార విశేషం. ఒకానొక ఉపనిషదర్థసారం. ఇది క్షర-అక్షర – అవ్యయుల్లో క్షర బ్రహ్మోపాసనకు సంబంధించిన విషయం. ఆసులోపల కండె కావటం విశ్వనాథ వారి విశిష్ట వ్యక్తిత్వం. అది నేస్తుంది కానీ నేయబడదు. క్షర తత్త్వమంతా నశించి పోతుంది. కాబట్టి, జన్మ ప్రాప్తించిన తర్వాత మృత్యుంజయత్వాన్ని సాధించటానికి యీశ్వరోపాసన చేయాలి. విశ్వనాథ ఈశ్వరునితో సాధర్మ్యాన్ని చెందుతూ –

అంతయు నశించిపోవునని రూఢియైనట్టి దాని
వింతలు చూచి రమించునంత యోపిక లేదు నాకు
వింతలో వింత బ్రతుకుట తప్పని విధియు, నీవలె గ్ర
సింతు చేదును నేను నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి!!

ఈ వింతలో వింత వెనకాల ఉపనిషత్తు ఉంది. దాన్ని

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం ఆశ్చర్యవద్వదతి తథైవచాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యః శ్రుణోతి – శ్రుత్వాప్యేనం వేదనచైవ కశ్చిత్!!

అంటూ భగవద్గీత ఆవిష్కరించింది. విశ్వనాథ వారంత ఈశ్వరీయ జ్ఞానసంపన్నులు కనుకనే -

నినుగూర్చి చదివితి దెలియ వచ్చెను నీ స్వరూపంబు
ఘనులైన పెద్దల వలన విన్నాను గడగి యన్యులకు
వినిపింప వలతినిగూడ, ననుభూతి విభవంబులేదు
వెనుకొని నందమూర్నిలయ సంతాన వేణు గోపాల!!

అని తనకు అనుభూతి విభవం లేదని వినయాన్ని ప్రకటించుకున్నా - ''ఈ విద్యలెల్ల నీ దరహాసముల్ గాన జిక్కితి వీనికి'' అనిన సకల విద్యాసనాథులు వారు. ఈశ్వరుని గూర్చి యెంత తెలిస్తే - మనసులోపల ద్రవ్వినిన్ను మనోదర్పణంబునను గనుపించు నేరుపు కలుగునట్లుగా గనిపింపవే కరుణ కాల్వకట్టి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!'' అనగలుగుతారు? అంతేకాదు, ప్రకట మత్వాలంబు ఘట్టు మంచును బగిలి రావలయు అని కూడా అనగలుగుతారు? ఇక్కడే వుంది ఆత్మవిద్యారహస్యమంతా. మనోదర్పణంలో భాసించటం వెనక ఉపనిషత్ప్రమాణం ఉంది.

ప్రతిబోధ విదితం మతం అమృతత్త్వం హి విందతే
ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతే మృతమ్!!

అమృతత్వమేమిటో తెలియబడిన తర్వాత మనో దర్పణం లో ఈశ్వరుడెలా సాక్షాత్కరిస్తాడో -

క్రిందినుండియు బైదాక శ్వాస దీర్ఘీకరించి తెరు
ణెందు చూడామణీ! పాము తోకపై నిల్చు చందమున
బొందు వెన్నెముక వెంబడి బినాకంబు పూనియుంటివని
యందునా, నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి!!

అంటూ విశ్వనాథ వెల్లడించారు. ఇది పరమ రహస్యమైన కుండలినీ యోగ విద్యాస్వరూపం. విశ్వనాథ వంటి కవియోగులు తప్ప సాధారణులెవ్వరూ దీన్ని దర్శించి, ఆవిష్కరించలేరు.

సోపాధికంగా, నిరుపాధికంగా, సాకారంగా, నిరాకారంగా ఈశ్వర విభూతిని అర్థం చేసుకుని, మనోనేత్రంతో దర్శించిన విశ్వనాథ వారు-

ఏది కవ్వడికిని జెప్పినావొ మున్నెప్పుడో మనువు
నూది చెప్పితి నంటిగాదె యప్పుడెట్లున్నావు? మూర్తి
వాదంబు లేదిందు నీదైన పరమాత్మ వాదంబు గాక
శ్రీదీప్తి జలరాశి వేంకటేశ్వరా! శేషాద్రినిలయ!!

అంటూ దిగ్దేశ కాలావచ్ఛిన్నమైన పరాత్పర తత్త్వాన్ని అపౌరుషేయంగా ఆవిష్కరించారు. దీని వెనుక-

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవే బ్రవీత్!!
ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః
సకాలే నేహ మహతా యోగో నష్టః పరంతప!!

అనిన గీతాచార్యుడు. నష్టమైపోతున్న యీ ఋషి విద్యనుద్ధరించటానికే కవిగా ఒక నారాయణుడుద్భవించి, మధ్యాక్కఅల్లో విశ్వనాథుడయ్యాడు.

ఉద్ధరే దాత్మనాత్మానం
ఆత్మానమవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు
!!

*****



Vishwanatha Satyanarayana, Gunturu Seshendra Sharma and others



Vishwanatha Satyanarayana, Gunturu Seshendra Sharma, Indira Devi and others

# విశ్వనాథ కవిత - జానపద మూలాలు

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

నాగరికమైన జాతిలో సంస్కృతి రెండురకాలుగా ఉంటుంది. జానపద సంస్కృతి, శిష్టసంస్కృతి. ఈ రెండూ పరస్పరం ప్రభావితమౌతూ ఉంటాయి. పల్లెపట్టులలో నిరక్ష్యరాస్యులుగా ఉండే రైతుల కూలీల సంస్కృతి జానపద సంస్కృతి. దీనిసే 'గ్రామీణ సంస్కృతి' అనీ 'కర్షక సంస్కృతి' అనీ కూడా పిలువవచ్చు. జానపద విజ్ఞానం(Floklore) అన్నా ఇదే.

'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు మూర్తీభవించిన 'ఆంధ్రత్వం' లేక 'తెలుగుదనం'. అంటే ఆయన ఆంధ్రుల గ్రామీణ సంస్కృతిని అతి సూక్ష్మంగా ప్రదర్శించే మహాకవి అని అర్థం. అసలు తెలుగుదనాన్ని ప్రదర్శించడం కోసమే ఆయన రచనలు చేశాడు. ఆంధ్రపౌరుషము, ఆంధ్రప్రశస్తి, ఋతుసంహారము లేక తెలుగు ఋతువులు, కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెండ్లి మొదలైన లఘుకావ్యాలలోనే కాకుండా, రామాయణ కల్పవృక్షము వంటి మహాకావ్యంలో కూడా తెలుగుదనాన్ని లేక తెలుగు జానపదసంస్కృతిని పుష్కలంగా ప్రదర్శించారు విశ్వనాథ. అందుకే "నాది తెలుగు రామాయణం" అనీ ప్రకటించున్నారు విశ్వనాథ.

కావ్యంలో మూడు ముఖ్యాంశాలుంటాయి: 1. ఇతివృత్తం, 2. ఛందస్సు, 3.భాష. విశ్వనాథలో ఈ మూడింటిపైనా జానపద విజ్ఞాన ప్రభావం ఉంది. విశ్వనాథవారు అసంఖ్యాకంగా రచనలు చేశారు. కావ్యం, నాటకం, నవల, కథానిక, వ్యాసం - విమర్శ మొదలైన అన్ని ప్రక్రియల్నీ చేపట్టారు. కావ్యప్రక్రియల్లో కావ్యఖండికలు, ఖండకావ్యాలు, లఘుకావ్యాలు, మహాకావ్యమైన రామాయణకల్పవృక్షం - అన్నీ వ్రాశారు. వీటన్నింటి మీదా జానపద విజ్ఞాన ప్రభావం ఉంది.

1. ఇతివృత్తం - 1925 మార్చినెల భారతిలో విశ్వనాథవారు బావకత్తె అనే ఒక జానపద గేయాన్ని ప్రచురించారు. అందులో ఒక జానపద గృహిణిని ఆమెభర్త జానపద భాషలోనే ప్రశంసించడం విషయం.

"మొల్లపూలంటేను - ముడుసుకు పోతావు
బంతిపూలంటేను - గంతేసి వత్తావు
ఎంత సోకులాడివే - నీకాడ - ఎంత బావమున్నదే!"

•అంటూ ప్రారంభమవుతుంది ఈ జానపదగేయం.

'భ్రష్టయోగి' ఖండకావ్యంలో ఏఱువాక అనే ఖండిక ఉంది. దీంట్లో - విశ్వనాథ కర్షక సంస్కృతిని ఎంతో ఆత్మీయంగా వర్ణించారు. ఏఱువాక రైతులు జరుపుకొనే ఒక పండుగ - భూమిపూజ వ్యవసాయ ప్రారంభోత్సవం. తొలకరి వానలు పడగానే పాలేర్లు కొత్తబట్టలు కట్టుకొని, గుండెలకు గంధం పూసుకొని, నుదుట తిలకం దిద్దుకొని, ఎద్దుల్ని చక్కగా అలంకరించి, వాటి ముఖాలకు గంధం పసుపు కుంకుమలుపూసి, కోటేరు ఎత్తివెళ్లి, తూరుపు పొలాల్లో దున్నడం వర్ణించారు విశ్వనాథ. తెలుగు దేశంలోని అత్తాకోడళ్ల పోట్లాట, వారి మధ్య భర్త నలిగి పోవడం 'కిన్నెరసాని పాటల'లో చిత్రించారు. 'ఋతుసంహారం' లేక 'తెలుగు ఋతువులు' ఆంధ్రదేశ గ్రామీణ ప్రకృతికి, తెలుగు సంస్కృతికి ఎత్తిపట్టిన మణిదర్పణం. జానపద సాహిత్యంలో ధర్మాంగద చరిత్ర అనే స్త్రీల పాట ఉంది. దీనిని ఆధారంగా చేసికొని విశ్వనాథ వారు 'పాముపాట' అనే గేయరూపకాన్ని రచించారు. ఆంధ్రప్రశస్తి లో 'చంద్రవంకయుద్ధం' అనే ఖండిక ఉంది. దీని ఇతివృత్తం పల్నాటి వీరచరిత్రలో ఒక ముఖ్యమైన అపూర్వమైన విషయం.

అలరాజు మరణానికి నాగమ్మ నిమిత్త మాత్రురాలు మాత్రమే. అసలు కారకుడు బ్రహ్మనాయుడే. అలరాజు తనకన్నా, తన అన్నపెద్దన్న బాదంరాజుకన్నా కూడా మహాబలశాలి అనీ, అతన్ని ఏవిధంగానైనా సరే కడతేర్చాలనీ నిశ్చయించుకొన్న బ్రహ్మనాయుడు,కేవలం బ్రాహ్మణులు భట్లు వెళ్లవలసిన రాయబారానికి సుక్షత్రియుడైన అలరాజును పంపించాడు. ఒక చిన్న పట్టుదల కారణంగా అలరాజుకు, పెద్దన్న బాదంరాజులకు, చంద్రవంక ఒడ్డున ద్వంద్వయుద్ధం జరుగుతుంది. బ్రహనాయుడు వెళ్లి వారిని వారిస్తాడు. అప్పుడు అలరాజు శక్తిని గ్రహించి అతన్ని మట్టుపెట్టడానికి పన్నాగం పన్నుతాడు. అదే అలరాజును

గురజాలకు రాయబారిగా పంపడం. ఈ కథను మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి నుండి విని తాను ఈ కావ్యఖండికను రచించానని విశ్వనాథ వారు నాతో స్వయంగా చెప్పారు.

ఇక, రామాయణ కల్ప వృక్షంలో అడుగడుగునా తెలుగుదనం లేదా తెలుగు జానపద సంస్కృతి ప్రత్యక్షమవుతుంది. అహల్య రాయిగా పడి ఉండడం, రాముడు శబరి పెట్టిన ఎంగిలి పళ్లు తినడం, ఊర్మిళ పాత్ర చిత్రణ మొదలైన ఎన్నో అవాల్మీకాంశాలను విశ్వనాథ జానపదులనుండి గ్రహించారు.

2. ఛందస్సు: ఛందస్సును పరిశీలించినట్లయితే, విశ్వనాథ అనేక గేయాలు, గేయకావ్యాలు వ్రాశారు. జాతి ఉపజాతి దేశిచ్ఛందస్సులు ప్రయోగించారు. కందం, ఆటవెలది, తేటగీతి, సీసం మాత్రమే కాకుండా జానపద ఛందస్సులయిన ద్విపద, మంజరీద్విపద, మధ్యాక్కర, మొదలైనవి తన మహాకావ్యమయిన రామాయణకల్పవృక్షములో కూడా వాడారు.

3. భాష: జీవవంతమైన తెలుగుభాషను ప్రయోగించిన కవి, తిక్కన తరువాత విశ్వనాథ ఒక్కడే, జాను తెనుగు, అచ్చతెనుగు, గ్రామీణుల నోళ్లల్లో నానే సామెతలు, జాతీయాలు, పలుకు బళ్లు, తెలుగు వాక్యవిన్యాసం, ఒడుపు,కాకువు మొదలైనవన్నీ మనకు విశ్వనాథ భాషలో ప్రత్యక్ష మవుతాయి.

అలంకారాలు – జానపద సంస్కృతి: ఇతివృత్తం, ఛందస్సు, భాష – అనే మూడు అంశాలలోనే కాకుండా అలంకారాలను ప్రయోగించడంలో కూడా విశ్వనాథపై జానపద సంస్కృతి ప్రభావం కొట్టవచ్చిన ట్టుగా కనబడుతుంది. తన కవిత్వంలోని అలంకారాలన్నీ గ్రామీణ సంస్కృతి లేక కర్షక సంస్కృతి లోంచే తీసుకుంటారు విశ్వనాథ. నిజానికి విశ్వనాథ ''పండితకవి'' కాదు ''మట్టికవి''. అందులోనూ ''తొలకరి వానలతో పులకరించే తెలుగు మట్టికవి! ''. ''ఝాన్సీరాణి'' కావ్యంలోంచి ఒక చిన్న ఉదాహరణాన్ని చూద్దాం. ''ఝాన్సీరాణి'' 9 అశ్వాసాల కావ్యం. దీంట్లో యుద్ధం చేస్తున్న వీరనారి లక్ష్మీబాయిని పంటలక్ష్మి తో పోలుస్తారు విశ్వనాథ. ఇక్కడ ఉపమానాలన్నీ రైతులకు సంబంధించినవే ప్రయోగిస్తారు.

సీ. ''కరవాలమును బట్టి కంఠముల్ తఱుగుచో
ఎడనీటి బొండంబు లెగచినట్లు;
బల్లెమ్ముతో గుండె పగిలించినప్పుడు –
ధృతి గట్టునకు గడ్డతీసినట్లు;
గుఱ్ఱమ్ము దూకించి కూలించినప్పుడు –
అడవి చెట్టును పడనడచినట్లు;
తలపైన డాలుతో తాడించినప్పుడు –
క్ష్మాత్రవ్వి పాఱతో సర్దినట్లు;
కెలకులకు చిత్రముగను లంఘించునపుడు–
తూగునడకల నేతాము త్రొక్కినట్లు;
విజయలక్ష్మి విధంబున వెలిగె రాణి!
పంటలక్ష్మి విధంబున ప్రబలె రాణి!''

మాస్వామి శతకంలో మొత్తం ఈశ్వరుని ఒకపంట పొలంగా – వాళ్ల నాన్నగారు అమ్మివేయని పంటపొలంగా భావించారు విశ్వనాథ:

''పునుకల్ చూచిన కాజగడ్డలు, పసుల్ పొల్పారు కాజాకు, లే
మననౌ జాబిలి కాజపూ వెరువుపెల్లై సారమౌదుబ్బు ల
ల్లిన ఉండల్, మెయి బూదిపూత తెలిఢిల్లీ భోగముల్, చేను నీ
వనెదన్, మాపితృపాదులమ్మని పొలం బీవౌదు, విశ్వేశ్వరా!''

విశ్వనాథ వారి ఋతుసంహారం తెలుగు ఋతువుల వర్ణన. ఆంధ్రుల గ్రామీణ జీవితానికీ, ఆంధ్రదేశ సుందర ప్రకృతికీ అద్దంపట్టిన అద్భుత రచన. ఇందులో కర్షక జీవితం పుష్కలంగా వర్ణింపబడింది. జానపదుల ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, పెండ్లి ఊరేగింపులు, బాలక్రీడలు, ఈ కావ్యంలో చోటు

చేసుకున్నాయి. జాన పదుల భాషా ప్రయోగాలు అంటే సామెతలు, జాతీయాలు, పలుకుబళ్ళు అడుగడుగునా దొర్లుతూ ఉంటాయి. కొన్నిపద్యాలు పూర్తిగా వీటితోనే వ్రాయబడ్డాయి. వర్షఋతు వర్ణనలో మొత్తం సామెతలతోనే వ్రాయబడిన ఈ సీసపద్యాన్ని వినండి

సీ. ''వెన్న కొట్టిన వారి వెసజాల గొట్టుమ-న్నట్లు మేషుడు హేళి కడ్డు వచ్చె
మున్నువచ్చు చెవులకన్న కొమ్ముల వాడియన - వరికిని కలపథిక మయ్యె
మొ అిగిన కుక్క తాకఅవదన్నట్లు - గర్జించిన మొగిలు వర్షించకుండె
దివము మంచిదటంచు పవలె దొంగిలినట్లు - కాలి బాటలకూడ గడ్డి మొలిచె

తడిసి మఱికాని గుడిసె కట్టడును, త్రాగి
గాని మొగ్గడన్నట్లు, మున్ కాంత పుట్టి
నింటి తడి యెల్లయును లాగి, ఇప్పుడినుడు
ముగుద తమ్మికన్పడుటకే మొగము వాచె.''

ఇలాగే కేవలం జాతీయాలు, పలుకుబళ్ళు గుప్పిస్తూ వ్రాసిన పద్యాలు కూడా ఉన్నాయి. గ్రీష్మఋతువర్ణనలోని ఈ పద్యం చూడాలి.

సీ. ''ఉదయ సూర్యుని తోడ ఒడ లెల్ల చితచిత
లైఎండ కొఅకొఅలాడ దొడగె
ఇదియేమి నడుమింటి ఎండయో వే నిప్పు
చేతుల తాకిన రీతి నుండె
ఇనుడస్తమించి నాడని పేరు ఎదురెండ
గొట్టిన వడ గూబగుంయి మనియె
సొక్కు జాబిలి వలి గ్రుక్కత్రిప్పు కొను పే
ళకురేయి రెండు జాల్పాకులాడె

ఆపసోపాలు పడి నిద్రయనుచు తెప్ప
రాచునంతలో దీర్ఘ దీర్ఘమను పగలు,
దుము కొన్నరేయి చివళ్ళు పాదిపి పాదిపి
అట్టె ధారుణి సర్వమ్ము పట్టు కొనియె''

ఈ పద్యంలో - ఎండ కొఅకొఅలాడు, నిప్పుచేతులతాకిన రీతినుండు, గూబ గుంయి మను, గ్రుక్కత్రిప్పుకొను, తెప్పరాచునంతలో మొదలైన ప్రయోగాలు తెలుగు వారి జాతీయాలు లేక నుడికారాలు. అలాగే - ఇదియేమి ఎండయో, ఇనుడు అస్తమించినాడని పేరు, నిద్రయనుచు, అట్టెపట్టుకొనియె, సాగినట్టె సాగి మొదలైన ప్రయోగాలు తెలుగు ప్రజల పలుకు బళ్ళు(Usages)

ఉపమానాలు కూడా జానపద జీవితానికి సంబంధించినవే సృష్టిస్తారు విశ్వనాథ. వర్షఋతువులో ఉదయిస్తున్న సూర్యుణ్ణి పండిముగ్గిన తాటిపండుతో పోల్చడం, శరదృతువులో ఆకాశంలో ఎగురుతున్న కొల్లేటి కొంగల్ని, ఆకాశమనే పాముల చిన్నదాని మెడలోని నత్తగుల్లల పేరుతో పోల్చడం ఇందుకు ఉదాహరణలుగా చెప్పవచ్చును. కొల్లేటి కొంగలు రెక్కలపై భాగంలో జిగురు రంగు, పొట్టమీద తెల్లరంగు కలిగి, అచ్చంగా నత్తగుల్లల్లాగే ఉంటాయి.

తెలుగు దనానికి, గ్రామీణ సంస్కృతికి, జానపద విజ్ఞాన ప్రభావానికి పట్టం కట్టిన మహాకావ్యం రామాయణ కల్పవృక్షం. తెలుగుదనం అంటే తెలుగు సంస్కృతి. మనది ప్రధానంగా గ్రామీణ సంస్కృతి లేక కర్షక సంస్కృతి (Folk culture). 'కల్పవృక్ష రహస్యములు' అనే గ్రంథంలో విశ్వనాథ వారే తన మహాకావ్యంలోని ప్రాణభూతమైన విషయం ఏమిటో స్పష్టంగా చెప్పారు." ఈ గ్రంథమంతటను ప్రధానముగా తెలుగు జీవితము, తెలుగుల ఆచారములు నుండును. అన్ని పాత్రలు తెలుగువారి వలె నటింతురు'' అన్నారు. బాలకాండలో ముఖ్యంగా ఇష్టిఖండం, అవతారఖండాలలో, తెలుగుదనం ఎక్కువగా చూపించారు

విశ్వనాథ. గర్భవతులైన జానపద స్త్రీలు మట్టిబెడ్డలు తినడం జనపదాలలో సాధారణ విషయం. దీనిని మహారాణులకు అన్వయిస్తారు విశ్వనాథ. మహారాజు దశరథుని అంతఃపురం రత్నస్థగిత మందిరం. అక్కడ మట్టి దొరకదు. అది నగర సంస్కృతి(Urban culture). అక్కడ జానపద సంస్కృతి (Folk culture) ఉండడానికి వీల్లేదు. అయినా ఆ రాణులదాసీలు జానపదులు కాబట్టి మట్టిబెడ్డలు దొంగిలించి తెచ్చి రహస్యంగా ఆ రాణులకు ఇస్తున్నారట.

రత్నస్థగితమైన యవని నాథ
సౌధముల మన్ను దొరకుటసాధ్యమగుట
ముగురు రాణుల దాసీలు ముచ్చిలించి
మట్టి బెడ్డలు తెచ్చుచు మఱుగు గొండ్రు''

రామాయణ కల్పవృక్షంలో జానపదవిజ్ఞానాంశాలు ప్రధానంగా ఐదురకాలుగా కనబడతాయి. 1. సీతారాముల జానపద తత్త్వం(Folkishness), 2. రాముని జానపద హావభావాలు(Folk gesture), 3. కార్యకారణ సంబంధాలు చూపడం, 4. కథాకథనంలో మూలాంశాలు(Motifs) ప్రవేశపెట్టడం, 5. జానపద భాష(Folk language) ను ప్రయోగించడం.

ఆపదమొక్కులు మొక్కుకోవడం జానపద లక్షణం. సీతారాములు అరణ్యవాసానికి వెడుతుంటే - రాముడు అయోధ్యానగరానికి, దానిని పాలించే దేవతలకు నమస్కరించి, తాను క్షేమంగా తిరిగి వస్తే వారందరికీ బలులు ఇస్తానని మొక్కుకుంటాడు. గంగానది దాటుతూ సీత తాముక్షేమంగా తిరిగి వస్తే ఆ నదికి బలులిస్తానని, పొంగళ్లు పెడతానని, కల్లుపోస్తానని మొక్కుకుంటుంది. ఒక్క గంగానదికే కాదు ఆ తీరంలో ఉండే ఋషులకు, దేవతలకు బలులిస్తానంటుంది. అలగే యమునానదిని దాటేటప్పుడు, ఒక పెద్ద మర్రి చెట్టును చేరినప్పుడు సీత ఆపద మొక్కులు మొక్కుకుంటుంది.

జానపదుల హావభావాలు నాగరికుల హావభావాలకన్నా భిన్నంగా ఉంటాయి. మాండలికంలో మాట్లాడటం, మాట్లాడేటప్పుడు ఆంగికాభినయం ఎక్కువగా చేయటం, గట్టిగా మాట్లాడటం, గట్టిగా అట్టహాసంగా విరగబడి నవ్వడం జానపదుల్లో ఉంటుంది. రామాయణ కల్పవృక్షంలో పట్టాభిషేకం జరుగబోయేముందు రాముడు గంభీరంగా నాగరికుడు (Stiff)గా ఉంటాడు. పట్టభంగం జరిగి అరణ్యాలకు వెళ్లేటప్పుడు జానపదుడుగా మారిపోతాడు. అందరినీ వేళాకోళం చేస్తాడు. గట్టిగా నవ్వుతాడు. విరగబడినవ్వుతాడు. సీతాలక్ష్మణులు అతని వింత ప్రవర్తనను చూచి ఆశ్చర్యపోతారు.

కార్యకరణ సంబంధాలు చూపడం జానపద సాహిత్య ముఖ్యలక్షణం. లక్ష్మణ శత్రుఘ్నులు ఒక తల్లికి పుట్టిన కవలపిల్లలైనప్పటికీ, లక్ష్మణుడు రామునితోనూ, శత్రుఘ్నుడు భరతునితోనూ ఎక్కువ సన్నిహితంగా ఉండటానికి కారణం ఏమిటి? వాల్మీకిలో దీనికి సమాధానం లేదు. జానపదుల పాయస విభాగంలో దీనికి చక్కని కారణాన్ని సృష్టించారు. దశరథుడు మొత్తం పాయసాన్ని రెండు భాగాలు చేసి, సగం కౌసల్యకు, సగం కైకేయికి ఇస్తాడు. ఇంతలో సుమిత్ర అక్కడికి వస్తుంది. అప్పుడు కౌసల్య తనభాగంలోని సగంతీసి సుమిత్రకు ఇస్తుంది. అలాగే కైకేయి కూడా తన భాగంలోంచి సగంతీసి సుమిత్రకు ఇస్తుంది. కౌసల్య ఇచ్చిన పాయసం వల్ల లక్ష్మణుడు పుట్టాడు, కైకేయి ఇచ్చిన పాయసం వల్ల శత్రుఘ్నుడు పుట్టాడు. అందువల్ల లక్ష్మణుడు రామునితోను, శత్రుఘ్నుడు భరతునితోను ఎక్కువగా స్నేహంగా ఉన్నారు. విశ్వనాథ వారు పాయసం విభాగంలో వాల్మీకినే అనుసరించినా, లక్ష్మణుడు రామునితో సన్నిహితంగా ఉండడానికి కారణాన్ని చెప్పారు. ''నాకు రాముణ్ణి సేవించే కొడుకు పుట్టాలి'' అని భావించి సుమిత్ర పాయసం త్రాగిందట. కాబట్టి విశ్వనాథ లక్ష్మణుని విషయంలో జానపద పాయస విభాగ ప్రభావానికి లోనయ్యారు.

జానపద సాహిత్య కథాకథనంలో అతి ప్రధానమైన అంశం మూలాంశం(Motif) ఇది లేనిదే కథ ముందుకు వెళ్లదు. ఇది మూడు రకాలుగా ఉంటుంది. బొంగరాలాట వంటి ఒక సంఘటన కావచ్చు, లేదా మాయలఫకీరు వంటి ఒక పాత్ర కావచ్చు, లేదా మంత్రదండం వంటి ఒక వస్తువు కావచ్చు. రామాయణంలో కైకకోరికలు, సీత కోరికలు సంఘటనా రూపమైన మూలాంశాలు. మంథర, జటాయువు,

శూర్పణఖ, మారీచుడు, రావణుడు, సంపాతి పాత్రల రూపమైన మూలాంశాలు. పాదుకులు, రాముని ఉంగరం, సీత చూడామణి, సీతకు అనసూయ ఇచ్చిన వస్త్రాలు, వివిధ అస్త్రాలు, సంజీవినీ పర్వతం, పుష్పక విమానం, అమృతభాండం మొదలైనవి వస్తురూపమైన మూలాంశాలు. ఈ మూడు రకాల మూలాంశాల వల్ల రామాయణం కథ ముందుకు నడిచింది.

జానవంతమైన తెలుగుభాష గ్రామీణులైన జానపదులలో మాత్రమే ఉంటుంది. ముఖ్యంగా జానపద స్త్రీలలో ఉంటుంది. ఈ భాష నాలుగు రకాలుగా ఉంటుంది.

1. సామెతలు(Proverbs) - వీటినే 'లోకోక్తులు', అనీ 'నానుళ్ళు' (నానుడు+నుడులు) అనీ కూడా అంటారు.
2. జాతీయాలు లేక నుడికారాలు(Idıams)
3. పలుకు బడులు (Usages).
4. వాక్యవిన్యాసం(syntax).

ఈ నాలుగు రకాల భాషా కలిస్తే ప్రజల "వ్యవహారభాష" అవుతుంది. విశ్వనాద వారు నాది వ్యవహార భాష అని స్వయంగా ప్రకటించుకున్నారు. తెలుగు ప్రజల వ్యవహార భాషను ఆయన సూక్ష్మాతిసూక్ష్మంగా పట్టుకుని చక్కగా రికార్డు చేశారు.

అరణ్యాకాండ - జటాయువు ఖండంలో, జటాయువు సీతను ఎత్తుకు పోతున్న రావణుడు సంభాషించేటప్పుడు తెలుగు జాతీయాలు, పలుకు బళ్లు ఎంత అందంగా ప్రయోగించారో చూడండి. జటాయువు "అరె యిందాకటి నుండి చెప్పెదను నీకావంత విన్పింపదే?"

జాటాయివు X రావణుడు "అడుగు కదలనీయ" ననగ, దానవరాజు

"నేమిచేసెదనిన," నేమియగునొ
చూతు వనిన, న సుర చేతి కశాహతి
ఖరయుగంబు వెన్ను గాడ నడచె.

రావణుడు శా. "ఏరా పక్షి అదేమి వాగికొని నీవే పోదువన్నన్ గ రు
ద్ధారా పాతము తాచినావు......"

ఒక్కొక్కప్పుడు చిన్న చిన్న పద్యాలలో కూడా విశ్వనాధ వారు సామెతలు, నుడికారాలు, పలుకుబళ్లు, తిట్లు - అన్నీ కలిపిన వాక్య విన్యాసంతో ముంచెత్తి వేస్తారు. ఒక చిన్న ఆట వెలది పద్యంలో సామెత, నుడుకారం, పలుకుబడి, తిట్టు ఎలా పొదిగారో చూడండి, అరణ్యాకాండలోనే జటాయువు ఖండంలోనే రావణుడు సీతతో ఇలా అంటున్నాడు.

| | |
|---|---|
| "ముద్దు వచ్చినపుడు మొగి జంక కెక్కుమ | (సామెత) |
| న్నారు, బిఱ్ఱ బిగిసినావు, మఱియు | (నుడికారం) |
| నెవ్వడడ్డమగు నొ యేను జూతును గదా | (పలుకుబడి) |
| వాడెవండొ జిఱ్ఱ బోడి యోగి!" | (తిట్టు) |

<u>వాక్యవిన్యాసం:</u>

తెలుగు నుడికారాలతోను, పలుకుబడులతోను, సంభాషణాత్మకమైన నాటకీయ శైలిలో విశ్వనాధ వారి వాక్యాలు ఉంటాయి. ఇవి జానపదుల వ్యవహారంలోనివే కాని కలికల్పితాలు కావు. ఉదాహరణానికి అరణ్యాకాండలో - పంచవటీ ఖండంలో- శూర్పణఖ రాముడితో సంభాషించడం చూడండి : రాముడు శూర్పణఖతో "నీకు కోపం వస్తే లేదా ఆకలి వేస్తే నన్ను అప్పుడంలా విరుచుకు తినేస్తావు!" అంటాడు హాస్యంగా. అతన్ని ప్రేమిస్తున్న శూర్పణఖ దానికి చాలా నొచ్చుకొని రాముడితో ఇలా అంటుంది
శా. "నాకా? కోపము వచ్చుటా? అదియు నిన్నా? ఓరెముంజేయుటా?

ఈ కాంతాళపు మాట లేమిటికి? నాకీయూహయే వచ్చినన్
నాకంరమ్మును నేన కోసికొనెదన్, నా ప్రాణమిత్రుంబు ని
న్నా కాంక్షించెద? తిండికేమి! మరి కన్నావూహ పారమ్యమున్."

అలాగే, బాలాకాండ – ధనుఃఖండంలో పరశురాముడు రాముడుతో మాట్లాడటంలో కూడా తెలుగు వాక్యం సొంపులు కనబడతాయి.

సీ. "నీవటోయీ! ఓయి సెట్టిక సీల!
నీవా? శైవ ధనుస్సు ను వంచినావు?

సీతాకినంతనా? నిగుడు రుద్రధనుస్సు
వెదురు బద్దయు బోలె విజిగి పోయె!
ఏలాగు విజిగెనో నీలకంధరు మహాధనువు చెప్పుము! నేను వినవలతును;
పనిబూని విఱిచితివా? తాకినంతనే విఱిగెనా?

గీ. మంజూష వెలికి దీసి పూనితవ? ఎక్కుబెట్టితివ?
నితాంతమైన జ్యావల్లి సందితమైనదా?
ఏదీ? కథారీతి చెప్పుము!
తిగిచినట్టియమ్ము ఏలక్ష్యమును తాకి వమ్ము చేసె?"

ఇది సీసపద్యం. ఎత్తుగీతి తెటగీతి. కాని ఛందస్సు ప్రకారం దీనిని విరిచి చదవాలంటే ఆ బ్రహ్మదేవుడి తరంకూడా కాదు. ఎందువల్లనంటే, తెలుగుభాషలో, తెలుగు వారి సంభాషణలో, అదికూడా ఒకతీవ్ర సన్నివేశ ంలో, ఒక మహావీరుడైన అవతార పురుషుడు, మరొక మహావీరుడూ అవతారపురుషుడూ అయిన వాడితో, ఆశ్చర్యంతో, నిర్లక్ష్యంగా మాట్లాడే సందర్భంలో, తెలుగు వాక్యవిన్యాసంలో ఉండే జిగిబిగి నింపి వ్రాసిన పద్యం ఇది! ఇటువంటి పద్యం ఒక్క విశ్వనాథ మాత్రమే వ్రాయగలడు!

కాబట్టి 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయగారు ఎంత పండిత కవి అయినా, ఎంత ప్రౌఢ కవి అయినా, ఎంత శిల్పసమ్రాట్టు అయినా, ఆయన కవిత్వం ప్రధానంగా గ్రామీణ కవిత్వం, కర్షక కవిత్వం, తెలుగుదనంతో తొణికిసలాడే శుద్ధదేశికవిత్వం! తెలుగు నేలలో నుంచి పుట్టిన మట్టికవిత్వం! అది వట్టి మట్టికాదు – తొలకరి చినుకులతో పరిమళించే తెలుగు మట్టి! దాని మూలాలు తెలుగు జానపద సంస్కృతిలోనే ఉన్నాయి!!



# "విశ్వనాథ వారి ధోం కిట ధోం"

కీ .శే. కొత్త వెంకటేశ్వర రావు

అది 1 9 3 4 వ సంవత్సరం. మచిలీ బందరులో చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారికి ఆయన శిష్యులు పోటా పోటీగా సన్మానాలు చేస్తున్నారు. పింగళి లక్ష్మికాంతం గారు ఒక సన్మానం జరిపారు. అంతకన్న విశిష్టంగా జరపాలని విశ్వనాథ సత్యనారాయణగారి ప్రయత్నం. ఇది కవితావ్యసనుల కుతూహలం పెంచింది. సభకు జిల్లాజడ్జి కనాబ్ మహమ్మద్ ఇస్సహాని సాహెబ్ అధ్యక్షులు. ఆయన ఉమర్ ఆలీషాగారివలె తెలుగులో కవి, ఆయన ప్రసంగంతో వేయిమంది సభ్యులు సావధానులైనారు. సభలో నిశ్శబ్దం కమ్ముకొన్నది. విశ్వనాధవారు లేచారు. మొదటి పద్యం వినిపించారు.

"ధోం - కిటధోం - కిటకిటధో
ధోంకిటయని బ్రాహ్మి నాట్య నూపుర రవముల్
సంకుల మయ్యెను మాపురి
వెంకట చెళపిళ్ల సుకవి విచ్చేసెనోకో !"

నిశ్శబ్దం బ్రద్దలయింది. రెండువేల చేతుల చప్పట్లలో కవితాకావ్య నాట్యరవళి అలలు అలలుగా ప్రతి ధ్వనించినది. మరో పద్యం ఎత్తుకున్నారు విశ్వనాధవారు. దాన్లో శబ్దశాస్త్ర కారణము, క్రమ ప్రకామ మధుర స్వరము అయిన నటరాజు తాండవాన్ని, ఆ తాండవం నుండి ఉత్పన్నమైన శబ్దాన్ని, దాని నుండి రూపు గట్టిన కవిత్వాన్ని వర్ణించారు.

"ఆయత్తమ్ములు శైవనూపుర
విమర్దొంకాముల్ తాడితం
బై యాకాశము త్రెవ్వి శబ్దమయ
మార్గాంతమ్ము తేజో మిలత్
వ్యాయామమ్ములు సుళ్లు సుళ్లు వడి
ఆం దావర్తమొక్కండు రెం
డై యీ తిర్పతి వేంకటేశ కవి
యుగ్మాకారమున్ దాల్చెబో!"

మాకు అర్ధం కాలేదంటే మాకు అర్ధం కాలేదంటూ వేయి గొంతులు వేదికను ఢీకొన్నాయి. ఏమాత్రం లక్ష్య పెట్టలేదు రణవెంకి విశ్వనాథ. " మీకోసం కాదు నేను వ్రాసింది" అని విసిరికొట్టారు.

"నాక్కూడా అర్ధం కాలేదండీ!" .. అన్నారు అధ్యక్షులు మృదువుగా.

"మీకోసం కూడా కాదు నేను వ్రాసింది" ... అని కట్టెవిరుపు జవాబు వచ్చింది. సభ రసాభాస అయ్యేలాగుంది. అనేక యుద్ధాలలో ఆరితేరిన వృద్ధమూర్తి చెళ్ల పిళ్ల వారు అందుకొని ---

"నాయనా! నాకూ తెలియలేదోయ్! కొంచెం వివరించి చెప్పు!" అని అనునయించారు.

గురువుగారి బుజ్జగింపు కన్న శిష్యుడికి కావలసిందేమున్నది? శిష్యుడు గురువై సవిస్తరంగా వివరించాడు. పద్యంలో ఉన్నదాన్ని, శాస్త్రంలో ఉన్నదాన్ని కలిపి -- సమస్త జగత్తు అవ్యక్తావస్థలో ఉంది. కదలిక కనిపించదు. శబ్దం వినిపించదు. ఇంతట్లో వ్యక్తావస్థ ఆసన్నమయింది. నటరాజు తాండవంతో అవ్యక్తం చేష్టావంతం అయింది. అతడి అందెల రాపిడిలో ఓం, ఓం,ఓం - అంటూ తొలినాదం బయలు దేరింది. శబ్దానికి ఆధారమయిన ఆకాశకటాహంలో అది అలలు అలలుగా, సుళ్ళు సుళ్ళుగా వ్యాపించింది. నిస్తరంగ సరసిలో ఒక పదార్థం పడినప్పుడు నీటి తరంగాలు ఒక దాని వెంబడి ఒకటి వర్తులంగా, సుళ్ళు సుళ్ళుగా బయలుదేరి ఒడ్డును తాకిన ట్టు, ఓంకార తరంగాలు శబ్దమయమార్గం చివరిదాకా ఆవ్ప తమయినయి. అలాంటి అవ్యక్తాలలో ఒక్కటి రెండుగా అయింది. అదే తిరుపతి వెంకట కవుల జంటగా

తెలిసింది అని విశ్వనాథవారి వివరణ, సభ మెచ్చింది. అధ్యక్షులు మెచ్చారు. గురువుగారు మెచ్చారు. కృతార్థులైనారు విశ్వనాథవారు.

అంతలో మరో పద్యం ఎత్తుకున్నారు ఆయన.

"సాధుశ్రీపతి వేంకటేశ్వర
వచస్సంతాన సంతాన మా
లాధమ్మిల్ల విభూషణాభి
హేలా చాలనోద్వృత్తనూ
దీధిత్యుజ్జ్వల ముగ్ధయానవగు
చాంధ్రీ! యేడకే పోదులీ
వీధిన్ రాగదవమ్మ!
మాగృహములన్ పేరంటమే సెచ్చెలీ!"

దీనికి కూడా విశేషార్థం కవిగారే చెప్పుకోవలసి వచ్చింది. సంతాన మాల అంటే పారిజాత పుష్పమాలట! వేంకట కవిగారి వాక్కులే యీమాల దాన్ని సిగలో అలంకరించుకొన్న ఆంధ్ర కవితా సుమంగళి శరీర కాంతి - రుక్మిణికి వలె పెరిగిందట. ఆ కొత్తకాంతులతో ఆమె సవిలాసంగా విహరించటానికి ఎక్కడికో పోతూ ఉంది. ఎక్కడికో ఎందుకమ్మా! యిదుగో మా సన్మానపు పేరంటానికిరా! అని ఆహ్వానిస్తున్నాడుకవి.

ఆయీ విషయాలు ఈ మధ్య గుడివాడలో నేను మధురకవి కాకాని నరసింహారావుని చూడబోయినపుడు ఆయన చెప్పారు. ఆయన పింగళివారి శిష్యులు. మృదుమధుర శైలిలో, మనోహరమైన భావాలతో ధారాళంగా ఆశుకవిత్వం చెప్పగలవారు. వయసులో ఉన్నపుడు ప్రసిద్ధకవుల పద్యాలు వందలు వందలు వల్లించగలిగేవారు. ఇప్పుడు డెబ్బయి యెనిమిదో పడికి చేరారు. పక్షవాతంతో మంచం పట్టినా, ఇంట్లో కొంచెం తిరగగలరు, ఆక్యుపంక్చర్ యేదో మేలు చేస్తుందని విని ఆ చికిత్స చేయించుకున్నారు. కాని ఎందువల్లనో మూతికూడ వంకర పోయింది అయినా, చూడవచ్చిన వారిని, ఆయన కవితాప్రీతి, ధారణాపటిమ - అలరిస్తూనే ఉన్నాయి. తిరుపతి వెంకటకవుల కాలంలోనూ, ఆ తరువాత సుప్రసిద్ధులైన అనేక మంది కవులగూర్చి, వారివారి వాద ప్రతివాదాలను గూర్చి, వారి కవిత్వాలను గూర్చి అర్ధశతాబ్ద కాలంలో ఆయన స్వయంగా యెరిగిన గాధలెన్నో చెప్పగలరు. వాటిని రేడియోవారో, పత్రికల వారో సేకరించి వెల్లడిపరిస్తే సాహిత్యప్రియులకు ఆసక్తికరంగా ఉంటుంది.



Nayani Subbarao, Vishwanatha Satyanarayana, Pervaram Jagannadham
Khandavallı Laxmi Ranjanam and others

# పద్యానికి పరవశించిన ప్రతిభా ప్రజ్ఞాశాలి శ్రీ విశ్వనాథ

డా.యస్.టి.జ్ఞానానందకవి

అది వేసవి. సాయంకాల సంధ్యాసమయం. గుణదలకు వెళ్ళే మార్గంలో మొగల్ రాజపురం దారిలో ఉన్నతూము దగ్గర తమ ఇంటి నుండి సహోపాధ్యాయులతో వస్తున్న కవిసమ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి దర్శనం లభించింది. పత్రికలలో ఆయన ఛాయా చిత్రాలను చూచినవాడను. వారిని దర్శించడానికి బయలుదేరిన నేను, ఆ మార్గమధ్యములోనే వారిని చూచుట లభించినది. అప్పటికే నేను ఆశువుగా గ్రంధాలు వ్రాస్తాను. వారిని చూడగానే నా మేను పులకరించినది. కవితాసరస్వతి పలకరించి మేల్కొలిపినది. విశ్వనాధుని గురునాధునిగా మనసులో తలచి ఆశువుగా కవిత చెప్పాను.

కలముంబూనుచు వ్రాయనెంచెదవ గంగావాహినీ ధారలు
జ్జ్వలమై పాఱువిధాన నీదు రచనా సామర్థ్య వైశద్యప్రో
జ్జ్వలధారా సముదాయమట్టులెగదా! పాఱున్ యధార్థంబుప
ల్కుల రాణిన్వలపించు బ్రహ్మవు సుధోక్తుల్ నీ మహావాక్యముల్

సకలాంధ్రమ్ము నమస్కరింపగ మహాసాహిత్య లోకైక భూ
ష! కవీశానులు, భూమినాధులు త్వదీయంబైన మాధుర్య మం
జు కధాగీతుల కందలింపగ యశఃస్ఫూర్తిన్ విడంబింప వి
శ్వకవీంద్రా! మదహస్తి నెక్కితివి హర్షధ్వానముల్ మ్రోగగన్

కమనీయార్ద్ర రసావతారధిషణా! గంభీర మూర్తీ! దయా
సముదగ్రా! వివిధార్థకావ్యరచనా సామ్రాజ్య పట్టాభిషి
క్త! మహాంధ్రాభ్యుదయాభిమాని! విలసద్బ్రాహ్మీస్వరూపా! గుణో
త్తమ! యౌదార్య రసస్వభావ! గురునాధా ! విశ్వనాధా ! నమః

నా ఆశు కవితా పద్యాలకు ముగ్ధులైన కవిసమ్రాట్‌గారు "నాయనా బాగున్నవి. ఇకఆపు! ఏమికావలయును. నీదేవూరు" అని తూము మీద కూర్చొని నన్ను అడిగినారు. నేను మా ఊరు, తాలుకా మొదలగు వివరాలు పద్యాలతో జవాబిచ్చి నన్ను మీ శిష్యునిగా అంగీకరించవలసిందిగా వినయంతో విజ్ఞప్తిచేసాను.

"నాయనా! నీవు యధేచ్ఛగా నన్ను కలియవచ్చును. కృషిచెయ్యి. రాణింపువస్తుంది" అని దీవించారు. అది నా తొలి పరిచయం. నేను వ్రాసిన కావ్యగ్రంధాలన్నిటికి శ్రీవిశ్వనాధ వారే పీఠికలు, అభిప్రాయాలు వ్రాసారు. పీఠిక వ్రాస్తూ "ఇంకెవరివద్దను అభిప్రాయాలు తీసుకొనవద్దు. నీకొక శైలికలదు. నీకవిత నీదిగా ఏర్పాటైపోయినది" అని దీవించారు.

నా "పాంచజన్యం" పీఠికకు గురువుగారు వ్రాసిన పీఠికను విజ్ఞాన వికాస విస్ఫురితులు, ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు చదివి బహుధా ఆనందించారు. ఇది అంతయూ నా అదృష్టం.

గురువుగారితో కలిసి కొన్ని భువన విజయాలలో, కవి సమ్మేళనాలలో పాల్గొన్నాను. చాలమంది అనుకున్నట్లుగా ఆయన కుల ద్వేషికాడు. మానవతావాదం కలవారే! మధుర హృదయులే! ధర్మమూర్తులే! దాక్షిణ్యస్వభావులే. నా ఎరిగినంత వరకూ కొలదిమంది హరిజన కవులు తమ గ్రంధాల పీఠిక నిమిత్తం శ్రీవిశ్వనాధ వారి వద్దకు రావడం, వారి అభిప్రాయాన్ని తీసుకోవడం. ఇది మాత్రమే గాక ఆ వచ్చిన కవుల రాకపోకలకు, భోజనాలకు ఆయన ద్రవ్యం ఇవ్వడం నేనెరుగుదును. అంతటి ఔదార్యమూర్తి ఆయన. జాషువాకవిగారు, విశ్వనాధ వారు విజయవాడ రేడియోలో కావ్యగానానికి వచ్చారు. నేను, గురువుగారితో వెళ్ళాను. జాషువాతో విశ్వనాధ ఇలా అన్నారు. జాషువా జ్ఞానానందకవి నాశిష్యుడని అనగానే జాషువాగారు నవ్వుతూ జ్ఞానానందకవి మావాడే అని అన్నారు. నా సన్మానాలకు ఎన్నింటికో గురువుగారు వహించారు.

1 9 5 0లో విజయవాడలో మాన్యశ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు గారికి రామ్మోహనరాయ్ గ్రంధాలయంలో "గాంధీ అమరగీతం" అనే గ్రంధాన్ని అంకితమిచ్చాను. ఆసందర్భంలో గురువుగారు నాకు "కవికోకిల" బిరుదును ఇచ్చారు. 1 9 7 4లో కళాప్రపూర్ణ బిరుదును ఆంధ్రవిశ్వవిద్యాలయం వారు ఇచ్చినపుడు హనుమంతరావు గ్రంధాలయంలో "అభినవ జాషువా" అనే బిరుదును గురువుగారు ప్రదానం చేసారు. ఆసభలో శ్రీమతి హేమలతా లవణం, డా.ఇనాక్, మోదుకూరి జాన్సన్ ప్రభృతులు పాల్గొన్నారు. ఇవి విశ్వనాధ వారి యొక్క విశాల ధృక్పధానికి, మానవతావాద సముద్ధరణ భావనకు ప్రతీకలు కావా?

నేను ఇంతటి సాహిత్యాన్ని వ్రాయుటకు శ్రీవిశ్వనాధ వారే స్ఫూర్తిప్రదాతలు. నాపట్ల వారికున్న అమిత వాత్సల్యం వలన నాపెండ్లికి పద్యాశీస్సులు పంపడమే కాక, నూటపదహారులు పంపించారు.

"నా శిష్యుండును సాధువొకవియు జ్ఞానానంద మీసాధువే
భాశిష్టంబు నదృష్టమందెడిని వాల్లభ్యంబు దీపింపగన్
ఆశీర్యోగ్యుడు యోగ్యుడున్ నవశుభ ప్రారంభ సంపత్తికిన్
ఆశీస్సంతతి నిత్తు నీశుభవివాహ స్వచ్ఛవేళన్ బడిన్"

గురునాధులవారి ఆశీస్సులు అట్టివి. (విజయవాడ 1 2 - 5 - 1 9 5 5)

నా కవితా జీవిత పధానికి గురువుగారి ఆశీస్సులాలంబనలైన మూలకంబములు. ఆయన దయకు పాత్రుడనైతిని. ఆయన ఆర్ద్ర తా హృదయములో నాకు చోటు లభించినది. ఇది నాసుకృత భాగ్యం. ఎంతైనా చెప్పవచ్చు. అట్టిమహాజ్ఞానపీఠ పురస్కార గ్రహీతకు నాపాదాభివందనాలు.



అప్పట్లో జగిత్యాల కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉండిన డా. వెలిచాల కొండాల రావు
అప్పట్లో ఆ కాలేజికి విచ్చేసిన కవి సామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారు
జువ్వాడి గౌతమ రావు గారు